# చతుర

## ఈ నెల సమగ్ర నవల

అక్కడ ఉన్నట్లుండి అకస్మాత్తుగా దేవుడు ప్రత్యక్షమయ్యాడు. తండోప తండాలుగా ప్రజల్ని ఆకర్షించుకుని అభిషేకాలు చేయించుకున్నాడు. మహామహులెందరో ఆ దేవుడి ముందు తలలొగ్గేరు. ప్రభుత్వ ప్రణాళికలే తారుమారయ్యాయి. ఆర్డర్లు తిరగతోడబడ్డాయి...ఈ పరిణామాలన్నింటికి కారకులైన అద్భుత వ్యక్తుల చిత్రణ...

# ఉద్భవం

ఈ నెల చతుర సమర్పిస్తున్న సమగ్ర నవల.

ప్రసిద్ధ కన్నడ రచయిత

## బి.వి.వైకుంఠరాజు

ఆసక్తికరంగా చిత్రించిన తాజా నవలకు

## శ్రీకంఠమూర్తి

సమర్థవంతమైన అనువాదం. చతుర సమర్పిస్తున్న తొలి అనువాద నవల 'ఉద్భవం'

సంపుటి : 2 సంచిక : 2

మార్చి 1979

### ఈ నెల ముఖ చిత్రం

న్యూజార్జియా ప్రాంతపు సాలమన్ దీవులలోని ఆటవికులు తయారుచేసుకున్న శిల్పం.కొయ్యతో చెక్కబడిన శిల్పానికి ఇది ప్రతిరూపం. ప్రకృతి శక్తులను, సంపదలను తనలో ఇముడ్చుకున్న ఆ పక్షి తమను సదా రక్షిస్తోందని వారి నమ్మకం.

### రెండవ కవరు

ఇదే ఈనాటి అత్యంతాధునిక శిల్పుల కళా సృష్టి. ఇటీవల న్యూరెంబర్గ్‌లో జరిగిన శిల్ప కళా ప్రదర్శనలో ఒక "శిల్పం" ఇది. వాస్తవంలో పాత సీనారేకు డబ్బాలివి.

### మూడవ కవరు

ఫ్రాంక్‌ఫర్ట్‌లో జరిగిన అంతర్జాతీయ పుస్తక ప్రదర్శన కోసం అక్కడి శిల్పులు ఎనిమిది టన్నుల నల్ల గ్రానైట్ రాతిని పుస్తకాకారంలోకి మలచి ప్రవేశ ద్వారం వద్ద నిలబెట్టారు. దాని పైనున్న పోస్టర్ ప్రదర్శనోద్దేశ్యాలను వివరిస్తోంది.


చందమామ

ఈనాడు కాంపౌండ్

హైదరాబాద్ – 500 004

Free !!! ఉచితం !!

# మతములోని రహస్యము, రహస్యముగా పాటించే మతము

మతములోని రహస్యమేమిటని ఒక భక్తుణ్ణి అడిగినప్పుడు, "మతములోని రహస్యం, రహస్యంగా పాటించే మతమ"ని సెలవిచ్చాడు. చేసిన దాన ధర్మాలు నలుగురి దృష్టిలో పడాలని పత్రికలలో ఫోటోలతో ప్రకటించుకొనుట మనలో చాలా మందికి అలవాటు.

మనం ధర్మం చేయునప్పుడు రహస్యంగా ధర్మం చేయాలనీ, ఉపవాసము చేయునపుడు రహస్యంగా ఉపవాసము చేయాలని ప్రభువు సెలవిచ్చాడు. రహస్యమందు చూచుచున్న దేవుడు మీకు ప్రతిఫలమిచ్చునని ఆయన మనుష్యులను పదే పదే హెచ్చరించాడు.

మన పర లోకపు తండ్రి మనుష్యులకు వలె నరుల పైవేషము చూసి తృప్తి చెందడు. మన దాన ధర్మాలు, ప్రార్థనలు దైవ దృష్టిలో నయా పైసకు కూడా విలువ చెయ్యవు. అందుచే ఒక భక్తుడన్నాడు, ఏమి తీసుకొని వచ్చి మహోన్నతుడైన దేవుని సన్నిధిలో నమస్కారము చేయను? దాన బలులను, ఏడాది దూడలను అర్పించి దర్శింతునా! నా అతిక్రమమునకైనా జ్యేష్ఠ పుత్రుని నేనిత్తునా!, మనుష్యుడా! ఏవి ఉత్తమమో అవి నీకు తెలియజేయబడినవి, న్యాయముగా నడచుకొనుటయు, దీన మనస్సు కలిగి నీ దేవుని ఎదుట ప్రవర్తించుటయు ఇంతే గదా దేవుడు నిన్ను అడుగుచున్నాడు! అసత్యం మన హృదయాలలో నివసించునంత కాలము దేవుని ఎప్పుడూ పొందలేము. నేనే సత్యమని పలికిన క్రీస్తు గూర్చి తెలుసుకున్నారా!

—చదలవాడ చంద్రమతీదేవి

---

ఉచితం!!!

భగవత్స్వరూపుడైన ఏసు క్రీస్తు బోధలు ఆయన జీవితచరిత్ర, తెలిపే ఆకర్షణీయమైన పుస్తకంగాని, ఆకర్షణీయమైన డిప్లొమా పొందటానికి ఉచితంగా లభించే బైబిల్ కోర్సుగాని మీకు కావాలనుకుంటే, మీ చిరునామా మాకు ఈరోజే తెల్పండి. పోస్టుఖర్చులుకూడా మేమేభరించిఉచితంగా మీకుపంపుతాము.

ఉచితం!!!

ఇదీ అడ్రస్

ఎస్. జాన్ డేవిడ్,

A M. G.

పోస్టు బాక్సు – 12

చిలకలూరిపేట.

గుంటూరు జిల్లా.

A. M. G.

Gospel Message Inserted By A. M. G.



మిరమిట్లు గొల్పే తెలుపు
చూడగానే
అందరి నోట ఒకే మాట...
ఇది తప్పక
డెట్
డిటర్జెంట్
బిళ్ల వుతుకే
Supreme
det
detergent washing cake
Shilpi DM 35A/78 Tel

## *Statement about ownership and other particulars*

FORM IV (See Rule 8)

| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publication | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad - 500 004. |
| 2. | Periodicity of its Publication | : | Monthly |
| 3. | Printer's Name | : | RAMOJI RAO |
| | Whether citizen of India | : | Yes |
| | Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 4. | Publisher's Name | : | RAMOJI RAO |
| | Whether citizen of India | : | Yes |
| | Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad - 500 004. |
| 5. | Editor's Name | : | RAMOJI RAO |
| | Whether citizen of India | : | Yes |
| | Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad - 500 004. |
| 6. | Names and addresses of Individuals who own the news paper and partners or share holders holding more than one percent of the total capital. | : | VASUNDHARA PUBLICATIONS 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad - 500 004. |

I, RAMOJI RAO, hereby declare that the Particulars given above are true to the best of my knowledge and belief.

For VASUNDHARA PUBLICATIONS

DATE

Sd/- RAMOJI RAO

March 1, 1979.

Publisher

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని వివిధ కోణాలనుండి ప్రతిబింబించగల సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి.

* ఈ పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసిపంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి. ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100-112 పేజీల పాకెట్ సైజు నవలాను బంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత వరకూ కుదించవలసివచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతోసహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పిపంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పని సరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే ప్రతి నవలకూ పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 004

# ఫుట్‌పాత్ బ్రతుకులు

కొత్త ఢిల్లీలో మాన్‌సింగ్ రోడ్డులో జైసాల్మీర్ రాజాకు చెందిన ఎత్తయిన భవనం ఎదురుగా, రోడ్డుమీద 500 పాకిస్తానీ శరణార్థులు రెండేళ్ళుగా నివాసం




ఉంటున్నారు. బీహార్, మధ్యప్రదేశ్, రాజస్థాన్ ప్రాంతాల నుంచి తరలివచ్చిన వీరు తమ బతుకుల్ని ఎంతో దుర్భరంగా గడుపుతున్నారు. అక్కడి ఫుట్‌పాత్‌లే వారి ఇళ్ళు, అదే వారి శాశ్వత చిరునామా.

వారికి వచ్చే ఉత్తరాలపై 'జైసాల్మీర్ భవనం ఫుట్‌పాత్', అని పేర్కొంటుంది. పిన్‌కోడ్ న్యూఢిల్లీ 110011. ఆ ఫుట్‌పాత్ మీద ఎండకు, వానకు, చలికి తట్టుకుని బతికి బట్టకడుతున్నవారు రెండు నెలల పసిగుడ్డు నుంచి 95 ఏళ్ళ ముసలిదాని వరకు ఉన్నారు.

1964, 1970 సంవత్సరాలలో తూర్పు పాకిస్తాన్ నుంచి శరణార్థులుగా వచ్చి ఇక్కడ నివాస మేర్పరచుకున్న వారు తమ ఇబ్బందుల్ని తెలియజేస్తూ నిరాహార దీక్షలు కూడా చేశారు. వారి అభ్యర్థనను మన్నించి ప్రభుత్వం కొందరికి భూములు ఇచ్చి మరికొందరికి జోధ్‌పూర్‌లో నివాసానికి మరో ప్రాంతాన్ని చూపించింది.

"భూములు ఇచ్చినంత మాత్రాన ప్రయోజనం ఏమిటి? నీటి సౌకర్యం లేదు కదా!" అన్నారు శరణార్థుల ప్రతినిధి ఒకరు.

జీవితావసర నిమిత్తం 200 రూపాయలు వడ్డీకి తీసుకుంటే, ఏడాది తిరగకుండానే అది 400 అయి కూర్చుంటుంది. ఇలా తమకు ఇచ్చిన భూమి వడ్డీ వ్యాపారస్థులకు తాకట్టు క్రింద వెళ్ళిపోయింది. ప్రభుత్వం తమ భూమిని మళ్ళీ ఇప్పించవలసిందిగా కోరుతున్నాం అంటున్నారు వారు. రీ సెటిల్‌మెంట్ బోర్డు మాత్రం ఈ విషయంలో మౌనంగా ఉంది. మళ్ళీ వాళ్ళు ఒక్కొక్కరే ఫుట్‌పాత్‌ల మీదికి వచ్చేస్తున్నారు.

# కన్యత్వం ఖరీదు?

దక్షిణ ఆఫ్రికాలోని పీటర్ మారిట్జ్ బర్గ్‌కు చెందిన 'జూలు' అనే ప్రాంతీయ అధికారి ఓ వింత ప్రకటన చేశాడు. తమ కన్యాత్వాన్ని నిరూపించుకున్న కన్యాకుమారీలకు ఒక్కొక్క ఎద్దును బహుమతిగా ఇస్తారు. అలా గాక ఈ ప్రకటనని పెడచెవిన పెట్టి, అమ్మాయిలు

సర్టిఫికెట్ చూపెట్టడానికి నిరాకరిస్తే నలభై డాలర్లు చొప్పున పన్నుగా చెల్లించాలి.

అమ్మాయిల్ని మానభంగం చేసిన వ్యక్తులు అపరాధంగా పాడి పశువులను ఆ ఆడపిల్ల తల్లిదండ్రులకు ఇచ్చు కోవాలి.

ఇప్పటికే కొందరు ప్రౌఢ స్త్రీలు ఈ పరీక్షలు జరపడం మొదలు పెట్టారు.

ఈ తప్పనిసరి పరీక్షకు ఎవరేనా హాజరు కాకపోతే 40 డాలర్లు జరిమా నాగా చెల్లించాల్సి వుంటుంది.

సంఘంలో పేరుకుపోయిన అవినీతి, అక్రమం, వ్యభిచారాల్ని తొలగించడం కోసం మాత్రమే తనీ పద్ధతి మొదలు పెట్టానన్నారు జులుగారు.

## తిమింగలగానం

సాధారణంగా ఏదైనా అవయవ లోపం వున్న వారికి తక్కిన జ్ఞానేంద్రియాలు చాలా సునిశితంగా పనిచేస్తాయంటారు.

అందుకే కాబోలు గూని తిమింగలాలు సంగీతంలో కొత్త రాగాల్ని సృష్టించి పాటలు పాడుతున్నాయని అమెరికా శాస్త్రజ్ఞులు అంటున్నారు.

తిమింగలాలు చక్కగా పాడడమే గాక, సంగీత దర్శకత్వం కూడా వహి స్తాయిట. కట్టిన రాగం బాగులేకపోతే మరో రాగం సమకూర్చుకుంటాయిట. రాత్రిపూట పాట ఆపేసిన విరామంలో నీటి బుడగల్ని వలలా చేసి చిన్న చిన్న చేపల్ని పట్టుకుని తింటాయిట. బహుశా మూడ్ కోసమేమో!

తిమింగలాల్లో గూని తిమింగలాలు, వాటిలో ముఖ్యంగా మగ తిమింగలాలు చక్కని పదాలతో పాటల్ని తయారుచేసి సంకేత సూచకంగా ఆడ తిమింగలాల్ని ఆకర్షించేందుకు పాడతాయని-రాత్రిపూట, శీతాకాలపు ప్రభాత సమయాల్లోనూ ఎక్కువగా వీటి సంగీతం వినవచ్చని అంచనాల ప్రకారం తేలింది - ప్రేమే జగతికి మూలం.



## ఇళ్ళపై ఆంక్షలు

రుమేనియా ప్రభుత్వం తన ప్రజలు ఇళ్ళు నిర్మించటం, కొనుగోలు చేయటం లాంటివి చేయరాదని వారిపై ఆంక్షలు విధించింది.

కమ్యూనిస్టు దేశమైన రుమేనియా ప్రజలు తమ ఇష్టానుసారం ఇళ్ళు కట్టు కునే హక్కు ఉండేది. ఇప్పుడు వారు అలాంటి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కోల్పోయారు.

రుమేనియాలో స్టెపెన్ బొబ్బాన్,

జార్జి అయిడెన్స్ క్యూ అమార్సడ్ అనే పెద్ద హోదాలో గల ఇద్దరు వ్యక్తులు ఎంతో ధనం వెచ్చించి రాజభవనాలవంటి సౌధాలను కట్టించారు. తత్ఫలితంగా వారు శిక్షార్హులయ్యారు.



ఆ భవనాలను చూసిన పిమ్మట ప్రభుత్వం పౌరులపై అలాంటి ఆంక్షలను విధించింది. రుమేనియాలో లంచగొండి తనం కూకటి వేళ్ళతో పాతుకుపోయి వుంది. అక్కడి రాజకీయ పరిస్థితులే లంచగొండితనం వ్యాపించటానికి ప్రబల కారణాలట. ఇలాంటి తీవ్రమైన ఆదు పాజ్ఞలు, ఆంక్షలు విధించటం ద్వారా కొంతవరకు లంచగొండితనాన్ని, అరాచకత్వాన్ని అరికట్టవచ్చునే ప్రభుత్వం ఆశిస్తుంది. ఎంతవరకు సఫలీకృతం అవుతుందో!

# రంగుల గుడారం

గుడారాలు తయారుచేసే కళకి ఒకప్పుడు అరేబియా ప్రసిద్ధి కెక్కింది. కాలక్రమేణ దానికి ఆదరణ తగ్గి, ముందు ముందు ఆకళ అంతరించిపోయే ప్రమాదం ఏర్పడుతుంది.

ఈజిప్టులో ఎన్నో కుటుంబాలు ఈ కళను జీవనోపాధికి చేపట్టాయి. పర్షియన్ కవి ఉమర్ ఖయ్యాం కూడా మొదట ఈ వృత్తి చేసి జీవించాడంటారు. ఈజిప్షియన్లు తమ పిల్లలను ఆరేళ్ళు రాగానే ఈ వృత్తిలో ప్రవేశపెట్టేవారు. కానీ,ఇప్పుడు వారు తమ పిల్లల్ని పాఠశాలలకు పంపి చదువులు చెప్పించి వారిని పెద్ద పెద్ద ఉద్యోగాలకు పంపించాలని ఆతృత చూపుతున్నారు. పూర్వం గుడారాల నేత పని కళాకారులతో 6,0 శాతం గల ఈజిప్టులో ఇప్పుడు వారిని వేళ్ళపై లెక్కపెట్ట వలసిన స్థితి ఏర్పడుతుంది.

ఆకర్షణీయమైన రంగుల్లో ఎన్నెన్నో రకాల విశాలమైన గుడారాలు తయారు చేసే నేతపనివాళ్లు తమ కళాత్మక శక్తితో విశాలమైన భవనాలుగా, పడక గదులుగా స్నానాల గదులుగా, ఎన్నెన్నో పద్ధతులలో వాడుకునేందుకు ఉపయుక్తంగా ఉండేలా నేసేవారు.

అరబ్‌లో ఒక ధనికుడికి ఒక పెద్ద గుడారం కావలసివచ్చింది. దాన్ని నేత పనివాళ్ళు 9 ఏళ్ళు కష్టపడి పూర్తిచేశారు. వంద ఒంటెలు ఆ గుడారాన్ని మోసుకెళ్ళవలసి వచ్చింది. అరబ్‌లో కెల్లా అదే పెద్ద గుడారంగా ప్రసిద్ధికెక్కిందట.

ఇటీవల గుడారాల నేతపనికి ఆదరణ తగ్గిపోయింది. నేత కళాకారులు తమ వృత్తిని విస్మరించినప్పటికీ మిల్లులు ఆ బాధ్యతను స్వీకరించాయి. ఎన్నెన్నో రంగుల్లో అసంఖ్యాకమైన నమూనాల్లో మిల్లులవారు తమ సాంకేతిక పరిజ్ఞానంతో



ఆకర్షణీయంగా తయారు చేస్తున్నారు. నేతపనివారు నెల రోజుల్లో తయారుచేసే 6 × 6 అడుగుల గుడారం మిల్లులో కొన్ని నిమిషాల్లో తయారవుతుంది. కాలం మారుతుంది. వేగం పెరుగుతుంది కదా!

# హత్యాల నిలయం

ఈజిప్టులో జరిగే అసంఖ్యాక హత్యల వల్ల ఆ దేశస్థుల్లో ప్రతీకార వాంఛ తీవ్రంగా ఉంటుందని తెలుస్తుంది. గత 40 ఏళ్ళలోను కక్ష సాధింపు చర్యగా సాగిన దౌర్జన్యకాండల్లో 90వేల హత్యలు జరిగాయి. 1948 నుండి ఇజ్రయేల్, ఈజిప్టుల మధ్య జరిగిన నాలుగు యుద్ధాల్లోని హతుల సంఖ్య కంటే కూడా ఈ హత్యల మూలంగా దుర్మరణం పాలైన వారి సంఖ్యే ఎక్కువ. ఈజిప్టులో ఏడాదికి సరాసరి 1300 హత్యలు జరుగుతున్నట్లు అంచనా. 1938లో 3,367 హత్యలు, 1958లో 2,864 హత్యలు జరిగేయట.

ఈజిప్షియన్లు సహజంగా శాంత స్వభావులు. కానీ, కుటుంబ వ్యవహారాలలోను, ఆంతరంగిక విషయాలలోను వారు నిర్దాక్షిణ్యంగా ప్రవర్తిస్తారు. దక్షిణ ఈజిప్షియన్లలో ఆవేశం, ఉడుకు రక్తం ఎక్కువ. అందుకే అక్కడ అసంఖ్యాకంగా హత్యలు జరుగుతుంటాయి.

ఈ హత్యలకు ప్రత్యేక కారణాలేమీ ఉండవు. కుటుంబంలో ఎవరైనా తప్పుడు పని చేస్తే, ఇతరుల పశువులు తమ పొలాల్లో పడి మేస్తే, పక్క కమతం వాడు పంట కాలువను దొంగతనంగా మళ్ళిస్తే ఈజిప్షియన్లు సహించరు. వారి వెంటపడి ప్రాణాలు తీసేవరకు వదలరు. పంటచేల తగాదాలో ఏడుగురు హత్య చేయబడ్డారు! ఒక అందమైన యువతిని ఆమె తండ్రి, అన్నలు కర్రలు ఇనుప కడ్డీలు,తుపాకులతో క్రూరంగా హింసించి చంపారు. అందుక్కారణం ఆమె ఎవరో ముక్కూ ముఖం తెలీని యువకుడిని చూసి నవ్వటమూ, చనువుగా మాట్లాడటమేనట.



# వేలంవెర్రి




ఒక నోటు పుస్తకం అమెరికా 'వేలం' చర్రితలో అగ్రతాంబూలం పుచ్చుకుంది.

పోయిన సంవత్సరం ఏప్రియల్లో 70 వేల డాలర్లకు అమ్ముడు పోయిన పాల్ రెవర్ ఆటోగ్రాఫ్‌ని అధిగమించి 85వేల డాలర్లకు అమ్ముడు పోయి తన ఆధిక్యాన్ని నిలబెట్టుకుంది ఈ నోటు పుస్తకం.

ఈ పుస్తకంలో 33 ఏళ్ళనాటి హిరోషిమా యుద్ధ వివరాలు, హిరోషిమాపై వేసిన బాంబు తాలూకు సమాచారాలు వున్నాయి. ఆ బాంబు వేసిన విమానంకో పైలెట్ దీన్ని భద్రంగా దాచి వుంచాడు.

ప్రఖ్యాత ప్రచురణ కర్త మాల్కోమ్ ఫోర్బెస్ ఈ పుస్తకాన్ని వేలం పాటలో కొన్నాడు.

అందులో

"ఆగష్ట్ 6వ తేదీ ఉదయం 2.27 ని॥లకు మేము విమానం ఇంజన్లు స్టార్ట్ చేశాం - ఈ బాంబు వేసీ వెయ్యగానే అందరికీ విముక్తి లభిస్తుంది.

అయిదుగంటల తర్వాత, అంటే 7.30 ని॥లకి బాంబు బాగా లోడ్ చేశాం. ఎంతో శక్తివంతమైన బాంబు మాచేతుల్లో వుందంటే ఏదో థ్రిల్.. తర్వాతదంతా పెన్సిల్‌తో వ్రాసివుంది. అది - బాంబు విసిరేక సరిగ్గా 15 సెకన్ల తర్వాత పెద్ద వెలుగు. దాని వెనుక రెండుసార్లు ఢాం ఢాం అని శబ్దాలు వచ్చాయి. అంతే కనీ వినీ ఎరుగని ప్రేలుడు సంభవించింది.

నేను వంద సంవత్సరాలు జీవించి మతిమరుపు వచ్చినా సరే బాంబు ప్రేలిన ఆ కొద్ది నిమిషాల సంఘటన మాత్రం నా జీవిత కాలంలో మర్చిపోలేను"-అని లెవిస్ రాసిన విషయాలున్నాయి. ఇంతకు మించిన సమాచారం, లెవిస్ యుద్ధంలో ఏం చేశాడో ఏమిటో ఎంత ప్రయత్నించినా ఎవ్వరికీ తెలీలేదు.

ఆ పుస్తకంలో వున్న ఈ కాసిని విషయాలూ అందరికీ తెలిసినవే! కానీ స్వయంగా లెవిస్ రాసిన ఆ కొన్ని అక్షరాల విలువ 85 వేల డాలర్లు. వేలం వెర్రి కాక మరేమిటి?

# యంత్ర మత్స్యం

చేపల వేటలో బెస్తవారి వలలకు నష్టాన్ని కలిగిస్తున్న 'డాల్ఫిన్' చేపల నుండి రక్షణకు జపాన్‌వారు ఓ సరికొత్త ఉపాయాన్ని ఆలోచించి ఒక పెద్ద యంత్ర

మత్స్యాన్ని తయారు చేశారు.

యాంత్రిక శక్తితో నడిచే ఆ పెద్ద 'సొర చేప' 36 అడుగుల పొడవు, 3 అడుగుల చుట్టుకొలత వుండి, దాని చర్మం ప్లాస్టిక్‌తో తయారు చేయబడి వుంటుంది. పొట్ట భాగంలో ఎలక్ట్రానిక్ పరికరాలు అమర్చబడిన ఆ యంత్రమత్స్యం అసలు సిసలైన సొరచేప కంటే రెట్టింపు ధ్వనితో అరవగలదట. నీటి అడుగున తనకు అనుకూలమైన మార్గంలో ప్రయాణించే ఆ యంత్ర మత్స్యం నమూనా ఖరీదు 8,500 పౌండ్లట.



సముద్రంలోకి వల విసిరినప్పుడు డాల్ఫిన్ చేపలు వచ్చి వల తాళ్ళను కొరికేసి అందులో పడిన చిన్న చేపలను తినేయటం పారిపాటి అయిపోయింది. అందువల్ల జపాన్ బెస్తవారి ఆదాయం చాలావరకు పడిపోయింది. ఈ యంత్ర మత్స్యం వల్ల డాల్ఫిన్‌లు వలల దగ్గరకు రావడానికే భయపడుతున్నాయి. దాని అరుపు విని దూరంగా పారిపోతున్నాయి.

ఈ పథకంతో ఒక్క మాసంలోనే 1,011 డాల్ఫిన్స్‌ను చంపారు. ఈ సరికొత్త విధానం సామాన్య బెస్తవారికి కూడా ఉపయోగపడేలా చేసేందుకు జపాన్ ప్రభుత్వం ఇప్పుడు సన్నాహాలు చేస్తుందట.

## స్త్రీల గల్లంతు

ఇల్లు వదలి వెళ్ళిపోయే స్త్రీలు, అదృశ్యమైపోతున్న యువతుల సంఖ్య పశ్చిమబెంగాల్‌లో నానాటికీ పెరిగిపోతోంది. 1976 లో నూటతొమ్మిది మంది, 1977లో నూటముప్పయినలుగురు ఇలా అదృశ్యమైయ్యారు.

కేంద్ర నేర పరిశోధక శాఖ లెక్కల ప్రకారం మాయమైన వారిలో 71 మంది, 87మంది స్త్రీలను కనుగొన్నారట. కానీ, మిగతా వారి ఆచూకీ తెలియ లేదు.

పదేళ్ళలోపు బాలికలు 1976లో 15 మంది, 1977 లో 7 మంది గల్లంతు అయ్యారు. వీటిలో ఎక్కువగా అపహరణ కేసులున్నట్లు తెలిసింది. మాయమైన 22 మంది బాలికలలో 15 మంది పోలీసుల కంటపడ్డారు.

అవివాహిత యువతులలో 10-25 సంవత్సరాల మధ్య వయసులో ఉన్న వారు 1976 లో 48 మంది, 77 లో 82 మంది అదృశ్యమయ్యారు. వారిలో 84 మంది ఆచూకి మాత్రం తెలిసింది. వారిలో 29 మంది ప్రేమ పిచ్చిలో పడి ప్రియులతో లేచివచ్చిన వారు, 18మంది కుటుంబ కలహాల వల్ల, 4 గురు స్వాతంత్ర్య జీవనం గడపాలనీ ఇంటినుంచి బయటికి వచ్చారు. అయిదుగురు మాత్రం అపహరించి తీసుకు రాబడ్డారు. మిగతా

వారు ఇల్లు వదిలి రావడానికి సరైన కారణాలు చెప్పలేదు.



వివాహితులలో 25-80 సంవత్సరాల మధ్య వయసులో గల స్త్రీలు ఈ రెండేళ్ళలోనూ 35 మంది అదృశ్యమయ్యారు. వారిలో 25 మంది ఆచూకీ తెలిసింది. తాము ఇల్లు వదిలి రావడానికి తమ భర్తలే కారణమని వీరిలో ఎక్కువ మంది స్త్రీలు చెప్పారు.

40 ఏళ్ళ వయసు గల 40 మంది మహిళలు అదృశ్యం కాగా 24 మందిని పోలీసులు కనుగొన్నారు. వీరిలో కొందరు మతిభ్రమణం వల్ల ఇల్లు వదలగా, కొందరు కుటుంబ కలహాలవల్ల, మరి కొందరు ప్రయాణాలలో పుణ్యక్షేత్రాలలో దారి తప్పినవారూ ఉన్నారు.

# మినీజగత్తు

భారతదేశం బాల్య వివాహాలకు పేరు పొందింది. అయితే ప్రపంచంలో కెల్లా అతి తక్కువ వయస్కులైన తల్లి, తండ్రి, అమ్మమ్మ మాత్రం ఈ దేశానికి చెందిన వారు కాకపోవటం విశేషమే.

అతి పిన్న వయస్కులైన మాతా, పితలకు చైనా రికార్డు స్థాపించింది. 'హీస్' అనే కుటుంబంలో ఓ జంటకు 1910లో ఓ పిల్లాడు పుట్టాడు. తండ్రి వయసు తొమ్మిదేళ్ళు, తల్లి వయసు ఎనిమిదేళ్ళు.

ఆఫ్రికా బుల్లి అమ్మమ్మకు చరిత్ర సృష్టించింది. కలాటర్ దీవిలో పదిహేడేళ్ళ అమ్మమ్మ 'జుముళీ' ఉంది. ఆమె ఎనిమిదేళ్ళ నాలుగు నెలల ప్రాయంలోనే ఓ ఆడపిల్లను కన్నది. ఆ ఆడపిల్ల పెరిగి పెద్దదై ఎనిమిదేళ్ళ వయసు రాగానే ఓ బిడ్డకు తల్లి అయింది.

నాలుగవ హెన్రీ కుమారుడు 4ఏళ్ళ



వాడుగా వుండగా మూడేళ్ళ ప్రాకైజ్ డులోరైన్'ను పెళ్ళాడాడు.

మార్గరేట్ గెస్ట్ మూడేళ్ళ ప్రాయంలోనే బార్కర్ విశ్వవిద్యాలయం నుండి సంగీతంలో పట్టా పుచ్చుకుంది.

'జెనెట్' తన అయిదవ ఏట రాసిన "ది పైరేట్స్ టేల్" అనే నవల ఏడాది తర్వాత 1969లో ప్రచురణ అయింది.

పక్క మీద లేచి కూర్చుని పెద్దగా ఆవలించి టైమెంతయిందో చూద్దామని పక్కనున్న పెట్టె మీద వాచీ కోసం తడిమి చూశాడు రాగన్న. అది చేతికి తగలకపోయేసరికి కొంచెం గాభరాపడి కళ్ళు నులుముకుని పెట్టె మీదంతా చూశాడు. వాచీ లేదు. అంతలో ఏదో గుర్తుకొచ్చినట్టయి 'వాచీ అక్కడుంటేగా కనిపించడానికి?'అనుకుని నవ్వుకున్నాడు రాగన్న. తలంతా బరువుగా ఉండడంతో 'రాత్రి దోసు కాస్త ఎక్కువయిందేమో' అనిపించింది. రాత్రి ఆ వెధవలిద్దరూ- వృద్ద, నంజుంద కలవకుండా వుంటే హాయిగా పెందరాళే ఇంటి కొచ్చేసేవాడు తను. 'వాచీ కూడా మిగిలేది' అనుకున్నాడు. మళ్ళీ తన ఆలోచనకు తనకే నవ్వొచ్చింది. ఇదివరకు ఇలాంటి ఆలోచనలు ఎన్నోసార్లు తలకిందులయిపోయినా మళ్ళీ మళ్ళీ అనుకోవడం మాత్రం మానలేదు తను. అంటే తనను తాను సరిదిద్దుకునే ప్రయత్నం ఇంకా కొనసాగుతూనే వుందన్నమాట!

లేచి మొహం కడుక్కుందామని లేవబోయాడు. కానీ ఒళ్ళంతా బరువుగా వున్నట్టనిపించి తిరిగి పక్కమీదికి వాలిపోయి 'ఇప్పుడు టైమెంతయివుంటుంది?' అని కాసేపు ఆలోచించాడు. బయట వీధిలో కార్లు, లారీలు, సైకిళ్ళు, రిక్షాల రణగొణ ధ్వని విని 'బహుశా పది గంటలయిందేమో!' అనుకుని "సుశీలా..." అని భార్యను కేకేశాడు. ఆమె అందించిన కాఫీ గ్లాసు అందుకుని "ఇప్పుడు టైము ఎంతయింది?" అని అతనుఅడగడమే తరువాయి ఆమె రుసరుస లాడుతూ 'బాగుందండీ... వాచీ మీ దగ్గర పెట్టుకుని 'టైమెంతయిందని' నన్నడిగితే నేనేం చెప్పేది? నాకేమైనా మంత్రాలూ, తంత్రాలూ వచ్చనుకున్నారా ఏమిటి? మీరిలాగే ప్రవర్తిస్తుంటే నేను అవి కూడా నేర్చుకోవాల్సి వస్తుందేమో!" అనేసరికి అతను 'ఎందుకడిగానా!' అని మనసులోనే అనుకుని "నా దగ్గర వాచీ వుంటే నిన్నెందుకడుగుతాను టైము? నాకేమన్నా పిచ్చనుకున్నావా?" అన్నాడు.

ఆ మాట విని ఆమెకు మరింత కోపం వచ్చింది. "అంటే అది మళ్ళీ మార్వాడీ కొట్టుకు ప్రయాణం కట్టిందన్నమాట! నా మాట విని దాన్నక్కడే వదిలేయండి. ఎందుకు ఊరికే కష్టపడి దాన్ని విడిపించుకురావడం? ఏ సుముహూర్తాన దాన్ని కొన్నారో గానీ అది మీ చేతిలో కన్నా మార్వాడీ కొట్లోనే ఎక్కువకాలం వుంటోంది. విడిపించుకురావడం; మళ్ళీ తీసుకెళ్ళి తాకట్టు పెట్టడం - ఇదే పని అయిపోయింది మీకు" అంది.

ఇప్పుడు రాగన్నకు నిజంగానే కోపం వచ్చింది. "అది కాదు సుశీలా ... ఇప్పుడు నాకంతకన్న వేరే పనేముంది చెప్పు పోనీ?" అన్నాడు.

సుశీల కూడా నవ్వొచ్చేసింది కానీ. బయటికి నవ్వకుండా తనలో తనే నవ్వుకుంది. చరచరా వంట గదిలోకెళ్ళిపోయి అక్కణ్ణుంచే "ఈసారి ఆ డబ్బేం చేశారు? గుర్రం తోకకి కట్టారా? లేక సారా కొట్టుకి ధారపోశారా?" అని అడిగింది.

భార్య కోపం తగ్గిందన్న సంగతి గ్రహించిన రాగన్న "అలా చేసేవాణ్ణి కానే నేను. డబ్బంతా రెండింటికీ సమానంగా పంచి పెట్టేశా!" అని చెప్పి తన విట్టుకు తనే పెద్దగా నవ్వేశాడు. దానికి

మంటింట్లోంచి ఏ విధమైన సమాధానం రాకపోయేసరికి, కాస్త ధైర్యం తెచ్చుకుని "సుశీలా కాఫీ ఎందుకో ఈ వేళ కాస్త లైట్‌గా వుందే" అన్నాడు అసలు దానికి కాఫీ పొడి వాసన కూడా తగలదేమో అన్న అనుమానం కలిగినా ఆ మాట పైకి చెప్పడానికి ధైర్యం చాలలేదు.

"ఫరవాలేదే...సారా వాసన నోట్లో గుప్పుమంటున్నా ఇంకా కాఫీ వాసన పసిగట్టగలిగే శక్తి మీలో మిగిలివుండడం నా అదృష్టం. లేచి వెళ్ళి కాస్త కాఫీ పొడి పట్రండి, స్ట్రాంగ్ కాఫీ కలిపిస్తా" అని సుశీల అనగానే 'అయ్యో నేరకపోయి అన్నానే' అని పశ్చాత్తాపపడిపోయాడు రాగన్న.

తనిప్పుడు ఇంకేమైనా మాట్లాడితే ఇంకెన్ని అవసరాలు పుట్టుకొస్తాయో అనుకుని నోరుమూసుకు కూర్చున్నాడు. ఇంట్లో పిల్లల అలికిడి వినిపించకపోవడంతో 'బడికెళ్ళారు కామోసు' అనుకున్నాడు. సిగరెట్టు పెట్టె కోసం జేబులు తడుముకున్నాడు. ఏ జేబులోనూ అవి చేతికి తగల్లేదు. రాత్రి ఇక్కడెక్కడైనా పడిపోయిందేమోనని చుట్టు పక్కలంతా చూశాడు. ఎక్కడా కనిపించలేదు. పక్కమీదినుంచి లేచి నిలబడి మంకెకు తగిలించిన చొక్కా అన్నిట్లోనూ వెతికాడు. ఊహూఁ...ఎందులోనూ ఒక్క సిగరెట్టు కూడా లేదు. 'ఛః రాత్రిఒక్క సిగరెట్టయినా మిగుల్చుకుని రావలిసింది' అనుకున్నాడు. అంతలో తన ఆలోచన నవ్వు తెప్పించింది. అంతమాత్రం చూసాలోచన ఉండివుంటే కొంచెం డబ్బే మిగుల్చుకు వచ్చేవాడుగా! 'ఆ లం...కులు తన డబ్బంతా మొత్తం ఖర్చు పెట్టించేశారు మరి' అని చద్ర, నంజుండలను తిట్టుకున్నాడు. మళ్ళీ అంతలోనే వాళ్ళను తిట్టుకోవడంలో అర్థం లేదనీ, వాళ్ళ దగ్గర డబ్బునప్పుడు తను కూడా అలాగే చేశాడనీ గుర్తుతెచుకున్నాడు. అంతలో కాల్చి పారేసిన ఒక సిగరెట్టు పీకను అతని కళ్ళు వెతికి పట్టుకున్నాయి. సమయానికి కంటబడ్డ ఆ పీకే పెన్నిధిగా భావించి ఆనందంగా దాన్నందుకుని వెలిగించాడు. ఒక్కసారి గుప్పుమని పొగ వదిలేసరికి ఎంతో హాయనిపించింది. రాత్రి తను ఇంటికొచ్చినప్పుడు టైం ఎంతయి వుంటుందా - అని ఆలోచించి, జవాబు దొరక్క పోవడంతో భార్య నడిగితే ఇంకా మాటలు పడాల్సి వస్తుందని భయపడి మెదలకుండా ఊరుకున్నాడు. సిగరెట్టు పీక త్వరగా కాలిపోయేసరికి 'ఛీ... వెధవది!' అని విసుక్కుంటూ దాన్నో మూల పడేసి, కోపమంతా దానిమీద చూపించి, పక్కమీదనుంచి లేచి షర్టు దులుపుకొని స్నానాల గదిలోకెళ్ళి కాసిని నీళ్ళు మొహాన కొట్టుకుని కట్టుకున్న పంచతోనే మొహం తుడుచుకున్నాడు.

వచ్చి అద్దం ముందు నిలబడి చూస్తే మొహంలో ఇంకా మత్తుకళ ఉట్టిపడుతూండడం కనిపించింది. చెదరిపోయి చిక్కుపడిపోయిన జుట్టును సర్దుకోడానికి ప్రయత్నించి చేతకాక అలాగే వదిలేసి మళ్ళీ వచ్చి పక్కమీద కూర్చున్నాడు. కాఫీ తాగినా తాగినట్టే లేదు. మళ్ళీ సిగరెట్టు కావాలనిపించింది. పళని కిళ్ళీ కొట్టులో ఇంకో పాకెట్ దొరుకుతుందేమోనని ఆలోచించాడు. తను వాడికివ్వావలసిన బాకీ బాగా పెరిగిపోయింది. వంద రూపాయిలు దాటి పోయిందేమో

కూడా! అందుకే వాడీ మధ్య వారం రోజులనుంచీ తను కొట్టుకు వెళ్ళినప్పుడల్లా ఎవర్నో సాకు పెట్టి తిడుతున్నాడు. వాడు తిట్టేది తననే అని తనకు బాగా తెలుసు. అయినా అవసరం కాబట్టి భరించి ఊరు కుంటున్నాడు. తనని పది నిమిషాలసేపు నిలబెట్టి ఎన్నో మాటలని ఆ తర్వాత ఒక పాకెట్ తన మొహాన పారేస్తాడు. తనకు ఏదైనా ఓ మంచికేసు దొరికివుంటే వాడి బాకీ ఎప్పుడో తీర్చిపారేసేవాడు. కానీ అలాంటి కేసేదీ ఈమధ్య తనకు తగల్లేదు. దొరికే ఆ చిల్లర మల్లర కేసుల తాలూకు డబ్బులు తన కాఫీలకూ, టిఫి న్లకూ, సారాకీ సరిపోతాయి. అంతే! ఎలా గైనాసరే ఏదైనా గట్టి కేసును పట్టు కోవాలి-అని నిశ్చయించు కున్నాడు రాగన్న.

పుట్టింటి కెళ్ళిపోయిన తన భార్యను తిరిగి తన ఇంటికి తెచ్చుకోలేక సతమత మవుతున్న పురుషోత్తమ రావైనా కలిస్తే బావుణ్ణు. తను వాళ్ళిద్దరి మధ్యా రాజీ కుదురుస్తానని చెప్పి కొంచెం డబ్బు లాగొచ్చు. ఈ ఆలోచన రాగానే ఒంట్లోకి కొత్త చైతన్యం వచ్చినట్టయి లేచి గబ గబా బట్టలు మార్చుకుని తల దువ్వు కున్నాడు.

భర్త బయటి కెళ్ళడానికి తయార వడం చూసి సుశీల వంటింటి గుమ్మంలో కొచ్చి "ఈరోజు ఇంట్లో ఏమీలేవు" అంది. దానికి జవాబుగా "మధ్యాహ్నం వేళకేమైనా పట్టుకొస్తాలే!" అన్నాడు.

అలా అని అతను చెప్పులు తొడు క్కుంటూంటే 'మధ్యాహ్నం పట్టుకొస్తా నని చెప్పి అర్ధరాత్రికి రాకండి... అంతే కాదు, మీతోబాటు ఇంకా ఎవరెవర్నో వెంటబెట్టుకొచ్చి అందరికీ వండిపెట్ట మంటే నేనేం చేసేది? ఉట్టి గిన్నెలు ఉడి కించి పెట్టమంటారా?' అంది.

రాగన్నకు తన భార్య చెబుతున్న దేమిటో బొత్తిగా అర్థం కాలేదు. 'అర్ధ రాత్రివేళ నేనెవర్ని వెంటబెట్టుకొచ్చానా?' అని కాసేపు ఆలోచించాడు. గుర్తుకు రాలేదు. ఆమెనే అడిగాడు.

"ఏం? అదికూడా గుర్తులేదా మీకు? నిన్నరాత్రి మీ స్నేహితులను వెంట బెట్టుకొచ్చి వాళ్ళకు వండి పెట్టమని చెప్ప లేదూ?" అంది సుశీల.

'ఒకవేళ రుద్ర, నంజుండలను తను వెంటబెట్టు కొచ్చాడా?' అని సందేహం వచ్చినా సమాధానం మాత్రం దొరక లేదు. అంతేకాదు, రాత్రిజరిగిందేదీ తనకు గుర్తులేదు. మొత్తానికి ఏదేదో జరిగినట్టు మాత్రం లీలగా గుర్తుంది అంతే! 'వాళ్ళని తను నిజంగానే ఇంటికీ తీసుకొచ్చా డేమో...' లేకపోతే సుశీల ఎందుకలా అంటుంది?- అనుకుని బయటికి నడిచాడు.

తను బయలుదేరే వేళకు భార్య అలా అనడం మంచి శకునం కాదేమోనని మనసులో అనుమానిస్తూనే వెళ్ళి పళని కిళ్ళీకొట్టు దగ్గర నిలబడ్డాడు రాగన్న.

అతన్ని చూడగానే పళని "నమ స్కారం రాగన్నగారూ... ఇప్పుడే లేచారా?" అంటూ నవ్వాడు. అతని గొంతులో ధ్వనించిన హేళనను గుర్తించక పోలేదు రాగన్న. ఆ క్షణంలో పళని చెంపలు రెండూ చెళ్ళుమని వాయించాలని పించింది కానీ-ఇప్పుడు వాడి దగ్గరినుంచే సిగరెట్లు సంపాదించు కోవాలి కాబట్టి మౌనంగా భరించి ఊరుకున్నాడు. 'నీతో ఆమాత్రం మాట్లాడ్డమే గొప్ప'

అన్నట్టు మొహం పెట్టి ఎక్కడో చూస్తూ కూర్చున్నాడు పళని. అంతలో ఎవరో గిరాకీలు రావడంతో వాళ్ళతో బాతాఖానీలో పడ్డాడు. తనిక్కడ నిలబడి ఉన్నాడు గనుకనే వాడలా ప్రవర్తిస్తున్నాడని తెలిసినా సహనం కోల్పోకుండా అలాగే నిలబడ్డాడు. వచ్చిన గిరాకీలు తమకు కావలసింది కొనుక్కుని వెళ్ళిపోయారు.

వాళ్ళటు వెళ్ళిపోగానే రాగన్న "ఇదిగో చూడు పళనీ...నేను నీకెంతివ్వాలి?" అని ధీమాగా అడిగాడు. పళని రాగన్నను కింది నుంచి పైదాకా రెండు మూడు సార్లు పరికించి చూశాడు. అతనంత ధీమాగా అడుగుతున్నాడంటే డబ్బేమైనా ఇస్తాడేమో అనిపించింది పళనికి. కానీ అంత మాత్రాన రాగన్న తన బాకీ తీర్చేస్తాడని అనుకోడానికి వీల్లేదని తెలుసు. ఎందుకంటే ఇలాగే మెల్లిగా ఉపాయం చేసి సిగరెట్లు రాబట్టుకోవడమే కాకుండా ఇంకా రెండు మూడు రూపాయల నగదును కూడా లాక్కుపోతాడు తన దగ్గర్నుంచి. 'కొంపదీసి ఇప్పుడు కూడా అలా చేయడు కదా' అనుకుంటూనే "ఈసారి మీ లెక్క చాలా ఎక్కువైపోయింది సార్...వంద కూడా దాటిపోయిందేమో!" అన్నాడు.

"కాస్త పుస్తకం చూసి చెప్పవయ్యా...సరిగ్గా ఎంతయిందో?" అని రాగన్న కొంచెం గట్టిగా అనేసరికి పళనికి ఆశ పుట్టుకొచ్చింది.

'ఒక వేళ బాకీ తీర్చినా తీర్చేస్తాడేమో' అని ఆలోచిస్తూ పద్దు పుస్తకం తీసి రాగన్న బాకీ టోటల్ చేసి "తొంభై ఏడు రూపాయలయింది సార్!" అన్నాడు.

"అయితే ఓ పని చెయ్యి. ఒక సిగరెట్ పాకెట్ ఇచ్చి ఓ రెండు రూపాయలు కూడా ఇచ్చేయ్. అప్పుడు సరిగ్గా వంద రూపాయలవుతుంది. మధ్యాహ్నం వచ్చి ఇస్తాలే!" అన్నాడు రాగన్న.

అతనేమో అంత తేలిగ్గా అనేశాడుకానీ పళని మాత్రం ఆ మాట విని గాభరా పడిపోయాడు. తన ఊహ నిజం కావడం చూసి కంగారుపడుతూ "సార్...సార్" అంటూ చేతులు నలుముకోసాగాడు.

"ఈ రోజు ఎవరో రిజిస్టర్ చేయించడం కోసం పత్రం రాసిమ్మన్నారోయ్... కనీసం వంద రూపాయలైనా దొరుకుతాయి. నీ బాకీ తప్పకుండా తీర్చేస్తాను." అన్నాడు రాగన్న.

అయినా పళనికి మాత్రం ఇంకా అనుమానంగానే ఉంది.

"నిజం పళనీ...నీతో అబద్ధ మాడతానా?" అని రాగన్న మరింత నమ్మకంగా పలికాడు.

పళని 'ఇవ్వడమా మానడమా' అనే సందిగ్ధంలో పడ్డాడు కాసేపు.

మళ్ళీ అంతలో 'తనిప్పుడు ఇవ్వకపోతే ఇదే సాకుతో తన బాకీ ఎగ్గొడతాడేమో'- అని భయం కూడా వేసింది. అందుకని వెంటనే ఒక సిగరెట్టు పెట్టె, రెండు రూపాయల నోట్లూ రాగన్న చేతిలో పెడుతూ "ఈ వేళ తప్పకుండా ఇచ్చేయండి సార్-పేదవాణ్ని. కొట్లోకి సరుకులు తేవాలి. చేతిలో కానీ లేదు"అని బతిమాలుకుంటున్నట్టుగా అన్నాడు.

తప్పకుండా తెచ్చిస్తానని మరోసారి హామీ ఇచ్చి, ఒక సిగరెట్టు తీసి వెలిగించాడు రాగన్న. ఇంటికి వెళ్ళి భార్య చేతిలో ఒక రూపాయి పెట్టి "పిల్లలు బడి నుంచి వచ్చిన తర్వాత హోటల్ నుంచి

ఏమన్నా తెప్పించి పెట్టు" అని చెప్పి మరో రూపాయి తను జేబులో వేసుకుని మళ్ళీ బయలుదేరాడు.

రాగన్న హోటల్లోకెళ్ళి కూర్చుని కాఫీకి ఆర్డరివ్వాలనుకుంటుండగా నంజుంద ప్రత్యక్షమయ్యాడు. "నాక్కూడా ఓ కాఫీ చెప్పు రాగన్నా..." అంటూ తను కూడా అక్కడే కూర్చున్నాడు. 'జేబులో ఉన్న రూపాయిలో సగంఇప్పుడే కరిగిపోతుందే' అని బాధపడుతూనే కాఫీకి ఆర్డరిచ్చి నంజుంద వేపు తిరిగాడు రాగన్న.

"నంజుందా...నువ్వు రాత్రి నాతో మా యింటికొచ్చావట అవునా?" అని ప్రశ్నించాడు రాగన్న.

నంజుందకు కూడా ఆ విషయం సరిగా గుర్తులేదు. 'ఏమో మరి' అన్నాడు.

ఇద్దరూ బాగా తప్పతాగి ఒకే స్థితిలో ఉండడంతో ఎవరు ఏమేం చేశారో ఎవరికి సరిగా గుర్తులేదు. 'అసలు ఇంట్లో తనకే భోజనం ఉంటుందో ఉండదో కూడా తెలియని తను వాళ్ళిద్దరినీ తీసుకొచ్చాడా?' అని ఆశ్చర్యపడ్డాడు. పడి పడి నవ్వుకున్నాడు రాగన్న. రాత్రి ఏం జరిగిందో తెలుసుకోవడం ఇప్పుడతని ముఖ్యసమస్య కాదు. నంజుందని అక్కడి నుంచి ఎలా సాగనంపాలా-అన్నదే సమస్య. ఇప్పుడు తను అర్జంటుగా పురుషోత్తమరావును కలుసుకోవాలి.కాబట్టి ఈ నంజుంద తనతో ఉంటే బావుండదు. అందుకు అతను తనతో ఉంటే మాట్లాడ్డానికి ఇబ్బందిఅన్న కారణం కంటే అక్కడ నాలుగు డబ్బులు దొరికినట్టయితే వీడికి కూడా వాటా ఇవ్వాలి' అన్న బాధే ఎక్కువగా ఉందతనికి. అందుకని ఓ ఉపాయం ఆలోచిస్తుండగా హఠాత్తుగా ఏదో తట్టింది. "చూడు నంజుడా......ఒక మార్వాడీ సేటుకి అర్జంటుగా ఇల్లు కావాలిట. వారం రోజుల్లో ఇప్పిస్తానని చెప్పాను. నువ్వెళ్ళి రుద్రను పిల్చుకుని ఓ రెండు మూడిళ్ళు చూసరండి. రెండు మూడు నెలల అద్దె అయినా పరవాలేదు. కమీషను బాగా ఇస్తాడతను" అన్నాడు. అది విని నంజుందకు సంతోషమైంది. అసలు నిజంగా చూస్తే ఆ మార్వాడీ సేటు రాగన్నను ఇల్లు కావాలని అడగలేదు. ప్రస్తుతం నంజుందను వదిలించుకోడానికి అలా అన్నాడంతే! అదీ కాకుండా చెప్పిన వెంటనే వాళ్ళు ఇల్లు వెతికి కనుక్కు వస్తారన్న నమ్మకం కూడా లేదు, ఒకవేళ కనుక్కుని వచ్చినా వేరే ఎవరికైనా ఆ ఇల్లు ఇప్పిస్తే పోతుంది. ఆ సంగతేమిటో తర్వాత చూసుకోవచ్చు కానీ ప్రస్తుతం ఓ నాలుగైదు రోజుల వరకూ వీళ్ళిద్దరినీ వదిలించుకో వచ్చు- అని ఆలోచించాడు రాగన్న.

నంజుంద, రుద్రల వల్ల చెప్పుకోదగ్గ ప్రయోజనమేమీ లేకపోయినా వాళ్ళిద్దరినీ రాగన్న ఎప్పుడూ తనతోనే ఉంచుకునేవాడు. ప్రస్తుతం తను ఉద్యోగం పోగొట్టుకున్నా, ఒకప్పుడు మంచి ఉద్యోగంలో ఉండేవాడు కాబట్టి కొన్ని పనులు తను స్వయంగా చేయలేక పోయేవాడు. అద్దె ఇల్లు వెతకడం, వాటిని కావలసిన వారికి చూపించడం వగైరా పనులన్నీ వాళ్ళ కప్పజెప్పేవాడు. అంతేకాకుండా ఒక్కోసారి తనకు అనుచరులున్నారని నిరూపించుకోవడానికి, ఎవర్నయినా బెదిరించడానికి వాళ్ళను ఉపయోగించుకునేవాడు. దొరికిన డబ్బుల్లో వాళ్ళకు కొద్దిగా ముట్టజెప్పేవాడు. అందువల్ల వాళ్ళు అతన్నీ,

అతను వాళ్ళనీ మసలి వుండడం సాధ్యం కాదు.

రాగన్న, నంజుంద లిద్దరూ కాఫీ తాగి గ్లాసులు బల్ల మీద పెట్టే సమయానికి సరిగ్గా బయట జనం 'ఓ' అని అరిచారు. ఏమిటా అని అటు చూసేలోగా జనం మూగిపోయారు. ఒక సైకిలు, మోటార్ సైకిలు రెండూ దూరం దూరంగా పడి వుండడం చూసి "భట్టుగారూ... రండి. త్వరగా రండి. యాక్సిడెంట్ జరిగింది" అంటూ హోటల్ యజమానిని కేకేసి రాగన్న గబగబా బయటికి పరుగెత్తాడు. ఈ హడావిడిలో అయన పాపం బిల్లు అడగడమే మరిచి పోయాడు. రూపాయి నోటు జేబులో భద్రంగా ఉన్నందుకు సంతోషిస్తూ రాగన్న యాక్సిడెంటుకు కారకులైన వారిని మనసులోనే అభినందించాడు.

రాగన్న, నంజుంద లిద్దరూ వెళ్ళి గుంపులో జొరబడే సరికి జనం కిందపడ్డ వాళ్ళిద్దర్నీ లేపి కూర్చో పెట్టారు. ఎవరో నీళ్ళు పట్టుకొచ్చి ఇద్దరి మొహాల మీదా చిలకరించారు. ఇద్దరికీ చిన్న చిన్న గాయాలు తగిలి రక్తం కారుతోంది. "నయం, ఏమంత పెద్దదెబ్బలు తగల్లేదు" అని ఎవరో అన్నారు. రాగన్న ఒకతన్ని "యాక్సిడెంట్ ఎలా జరిగింది?" అని కూడా అడిగాడు. అతను 'నేనూ ఇప్పుడే వస్తూన్నాను. ఏదో యాక్సిడెంట్ జరిగిందట" అన్నాడు. ఇంకో వ్యక్తి యాక్సిడెంట్ ఏలా జరిగిందీ తను కళ్ళారా చూశానని చెప్పి వివరంగా చెప్పడం మొదలెట్టాడు. ఎదురుగా వస్తున్న ఆటో రిక్షాని తప్పించుకోబోయి సైకిలతను పక్కకు తిరగ్గానే వెనకనుంచి మోటార్ సైకిల్ వచ్చి గుద్దేసిందట. తను కూడా అటే వస్తున్నాననీ, కాస్త అటూ ఇటూ అయితే మోటర్ సైకిల్ తన మీదికే వచ్చేసేదనీ చెబుతున్నాడతను. అప్పటికే అతని చుట్టూ చేరిన జనం నోరు తెరుచుకుని అతను చెప్పే కథ వింటున్నారు. కొందరేమో గాయపడ్డ వాళ్ళని తీసికెళ్ళి ఎదురింటి అరుగు మీద కూర్చోబెట్టి వాళ్ళకు సపర్యలు చేస్తున్నారు. అంతలో ఈ గుంపును చూసిన ఓ కానిస్టేబుల్ దూరంనుంచే విజిల్ ఊదుకుంటూ వచ్చి గుంపును చెదరగొట్టాడు. కొందరు వెళ్ళి కానిస్టేబుల్‌నే చుట్టుముట్టారు. వాళ్ళందరినీ దూరంగా పొమ్మని కసిరి గాయపడ్డవాళ్ళని సమీపించి "ఆస్పత్రికి తీసుకెళ్ళాలా?" అని అడిగాడు. ఆ ప్రశ్న తన నుద్దేశించే అడిగినట్టుగా భావించి ఒకతను "అంత పెద్ద దెబ్బలేం తగల్లేదులెండి. షాక్ వల్ల కొంచెం నీరసంగా ఉన్నారు. కాసేపు విశ్రాంతి తీసుకుంటే అదే తగ్గిపోతుంది" అన్నాడు. అయినా తాను చేయవలసిన డ్యూటీ ఏదో ఉన్నట్లు కానిస్టేబుల్ "అందరూ కాస్త దూరంగా జరగండి. వాళ్ళకు కాస్త గాలైనా రానివ్వండి"అన్నాడు. సైకిలతను కళ్ళు తెరిచి అందర్నీ ఓసారి పరకాయించి చూసి "నా సంచీ ఏది?" అన్నాడు. "ఇదుగో ఇక్కడుంది. తీసుకోండి" అని ఎవరో బ్యాగ్ తెచ్చి అతనికందించారు. తనకు దెబ్బ దగిలినదాని కంటే తన బ్యాగ్ భద్రంగా ఉన్నందుకు అతని ముఖంలో సంతృప్తి వెల్లివిరిసింది. మోటార్ సైకిలతను లేచి నిలబడి, నడుం పట్టుకుని అడుగులు వేయాలని ప్రయత్నించాడు. కానీ తూలిపడబోతున్న



అతన్ని జనం పట్టుకుని "ఆగండి ఇంకాసేపు కూర్చోండి" అని కూర్చోబెట్టారు. మళ్ళీ కూర్చుని అతను చుట్టూ కలయచూస్తూ ఉండగా కానిస్టేబుల్ కనిపించగానే చటుక్కున దృష్టి మరల్చుకున్నాడు. ఇదంతా గమనిస్తున్న కానిస్టేబుల్ తప్పెవరిదో తెలుసుకున్నట్టు, జేబులోంచి నోట్ బుక్, పెన్సిల్ తీసి రాసుకోడానికి సిద్ధమయ్యాడు. పక్కనున్నతన్ని చూస్తూ "ఇక్కడ జరిగిందేమిటో కాస్త వివరంగా చెబుతారా?" అనగానే అతను "నేనిప్పుడే వచ్చాను, నాకేం తెలీదు" అంటూ అక్కణ్నుంచి జారుకున్నాడు. 'ఇంకెవరి నడుగుదామా' అని చుట్టూ ఓసారి కలయ చూసేసరికి అక్కడున్న వాళ్ళంతా ఒక్కొక్కరే జారుకోవడం మొదలెట్టారు. అంతకుముందు యాక్సిడెంట్ నుగూర్చి కథలాగా చెబుతున్న మనిషి ఎప్పుడో అక్కణ్నుంచి జారుకున్నాడు. దూరంగా నిలబడిన వాళ్ళల్లో ఒకతను 'అమ్మో... కోర్టులచుట్టూ ఎవడు తిరుగుతాడు?' అనడం వినిపించింది. కానిస్టేబుల్ ఒకరిద్దరిని పట్టుకుని, ధైర్యం చెప్పి తనకు కావలసిన వివరాలను అడిగి రాసుకోవడం మొదలెట్టాడు.

అక్కడక్కడ నలుగైదుగురు మనుషులు గుంపులుగా నిలబడి యాక్సిడెంట్ గురించి వ్యాఖ్యానాలు మొదలెట్టారు. చాలా మంది దృష్టిలో మోటార్ సైకిల్ వాడిదే తప్పని ఎప్పుడో నిర్ణయమైపోయింది.

"స్కూటరు, మోటార్ సైకిళ్ళ మీద కూర్చుంటే చాలు, ఈ కాలపు కుర్రాళ్ళకు కళ్ళే కనపడవు" అని ఒక ముస



లాయన వ్యాఖ్యానించాడు. "అసలీ ఆటో రిక్షాలవల్లే అంతా జరిగేది." అని ఇంకెవరో తమ అభిప్రాయం వెలిబుచ్చారు. ఆటోరిక్షాలవల్ల తమకు ప్రమాదాలు జరిగినట్టు కొందరు చెబుతూంటే అందరూ కుతూహలంగా వింటున్నారు. అంతలో సినిక్‌లా కనపడే ఓ వ్యక్తి "అసలెందుకు వాళ్ళ మీద, వీళ్ళ మీద అనవసరంగా తప్పులేస్తారు. ఇప్పుడు వాహనాలు ఎక్కువయిపోయాయి. రోడ్డు ఏమో చిన్నది. ఏనాడో వేసిన ఈ చిన్న రోడ్డు మీద ఇన్ని వాహనాలు వస్తూ పోతూ వుంటే యాక్సిడెంటు కాక ఇంకేమవుతుంది?" అన్నాడు. చటుక్కున అందరి దృష్టి అతనికేసి మళ్ళింది. ఇంతవరకూ ఎవరూ చెప్పని విషయాన్ని ఇతను చెప్పాడు. అందరికీ అది నిజమే అనిపించింది.

నాగన్న మాత్రం ఎందులోనూ జోక్యం చేసుకోకుండా దూరంగా ప్రేక్షకుడిలా నిలబడి వున్నాడు. అతనింకా హోటల్‌వాడికి అర్ధరూపాయి ఇవ్వకుండా ఎగ్గొట్టిన సంతోషంలోనే వున్నాడు. దానికి తోడు 'పురుషోత్తమ రావు ఎక్కడ కలుస్తాడూ?' అన్న ఆలోచన ఓ పక్క అతన్ని వేధిస్తోంది. తనంతట తానుగా వాళ్ళింటికెళితే బాగుండదు; అనుకోకుండా కనిపించినట్టుండాలి. అందుకని 'అతను కనిపించే చోట్లు ఏవి?' అని తనలో తనే ఆలోచించుకోసాగాడు. మధ్య మధ్యన చుట్టూ వున్న వారి మాటలు కూడా చెవిన పడుతూనే వున్నాయి. జనం

ఇంకా రోడ్డు మధ్యనే నిలబడివున్నందు వల్ల కానిస్టేబుల్ నాలుగైదుసార్లు గట్టిగా విజిల్ ఊది అందరినీ పక్కకు పంపించాడు. అప్పుడు రాగన్న, నంజుండ కూడా పక్కకు జరిగారు. 'తప్పంతా రోడ్డుదే' అన్న వ్యక్తి రాగన్నపక్కనే నిలబడి "మేమిక్కడ ఇల్లు కట్టుకున్నప్పుడు ఈ ప్రదేశమంతా ఎలా వుండేదో తెలుసా?' పోయి పోయి వల్లకాట్లో ఇల్లు కట్టుకున్నావేరా?' అని నా ఫ్రెండ్సంతా నన్ను వేళాకోళం చేసేవారు. ఈ పది పదకొండేళ్ళలో ఎంత మార్పొచ్చేసిందో చూడండి, ఎక్కడా ఓ అరచెయ్యంత స్థలం కూడా ఖాళీగా లేదు" అన్నాడు. రాగన్న తలూపి "అవును నిజమే" అని ఒప్పుకున్నాడు. దాంతో ఆ వ్యక్తి మరింత ఉబ్బిపోయి "అప్పుడు ఈ రోడ్డు ఎంతో పెద్దదనిపించేది. అప్పుడు రోడ్డు వేసిన వాళ్ళకేం తెలుసు – మన పేట ఇంతగా పెరిగిపోతుందని? ముందే ప్లాన్ వేసుకుని బాగా వెడల్పయిన రోడ్డు వేసి వుంటే ఇప్పుడిలా జరిగేది కాదు...ఊఁ.. ఇంకా ఎన్ని యాక్సిడెంట్లు జరగాలో ఇక్కడ!" అంటూ గట్టిగా నిట్టూర్చాడాయన. అంతలో దూరంగా పురుషోత్తమ రావు అటువేపు రావడం కనిపించింది రాగన్నకు. 'ఇక వీణ్ని వెతుక్కుంటూ వెళ్ళడం తప్పింది కదా!' అని లోలోపలే సంతోషించాడు. పురుషోత్తమ రావు రాగన్న దగ్గరికొచ్చి "ఇప్పుడు మీ ఇంటి నుంచే వస్తున్నాను. ఇక్కడ కనిపించావు నయం" అంటూ నవ్వాడు. ఇక అక్కడుండడం మంచిది కాదని గ్రహించి రాగన్న నంజుండను భద్ర దగ్గరికి పంపించి, తను పురుషోత్తమ రావుతో బయలుదేరాడు. 'హోటలు కెళదాం' అని అతనన్నందుకు "అక్కడికొద్దు అలా ఎక్కడికైనా వెళదాం" అని చెప్పి గబగబా అడుగువేయసాగాడు. మళ్ళీ అదే హోటలు కెళితే భట్టు ఇందాకటి అర్థరూపాయి అడుగుతాడని అతనికి తెలుసు.



## 2

రాగన్న మనసులో అంచనా వేసుకున్నట్టే జరిగింది. పురుషోత్తమ రావు దగ్గర్నుంచి ఓ 50 రూపాయలు గిట్టుబాటయిందతనికి. 'ఇంకో వారం రోజుల్లో మీ మామగారిని దారిలోకి తేకపోతే నా పేరు రాగన్న కాదు. ఆయనే తన కూతుర్ని తీసుకొచ్చి నీకు అప్పజెప్పేలా చేయకపోతే చూడు!' అని చెప్పి అతన్ని నమ్మించినందుకు ప్రతిఫలంగా 50 రూపాయలు పురుషోత్తమరావు జేబులోంచి రాగన్న జేబుకు ట్రాన్స్‌ఫర్ అయ్యాయి. కానీ ఇదంతా జరగడానికి పూర్తిగా 2 గంటల వ్యవధి పట్టింది. డబ్బు చేతికి రాగానే రాగన్న ఆలోచనలన్నీ ఎక్కడెక్కడికో పయనించాయి. ఏదో సాకు చెప్పి పురుషోత్తమరావు బారి నుండి తప్పించుకొని ఇంటి దారి పట్టాడు. ఇంటికి రాగానే భార్య చేతిలో పాతిక రూపాయలు పడేసి కళ్ళు లాగుతుండడంతో పక్క మీద వాలిపోయాడు.

అలా ఓ గంటసేపు నిద్రపోయాడేమో, హఠాత్తుగా మెలకువ వచ్చింది. వంటింట్లో గిన్నెల చప్పుడును బట్టి భార్య వంటచేస్తున్నట్టు తెలుసుకున్నాడు. అయినా తనిప్పుడు భోజనం చేసే స్థితిలో లేడు కాబట్టి మళ్ళీ కళ్ళు మూసుకుని పడుకున్నాడు. కానీ నిద్రపట్టలేదు. లేచికూర్చుని సిగరెట్టు ముట్టించాడు. అంతలో అతని కొడుకొచ్చి గదిలో ఏదో వస్తువు వెతికి పట్టుకుపోయాడు. వాడు తన ఉనికిని ఏ మాత్రం పట్టించుకోకుండా అలా వెళ్ళిపోవడం చూసి ఎలాగో అనిపించింది రాగన్నకు. 'వాడు తనతో మాట్లాడి ఎన్ని రోజులైంది?' అని ఆలోచించాడు. అంతుపట్టలేదు. తన కూతురు కూడా అంతే! ఎప్పుడో ఓసారి తనను పలకరిస్తుంది. భార్య సుశీల మాత్రం అలాకాదు. తనతో రోజూ మాట్లాడుతుంది. మాట్లాడక తప్పదుగా మరి! 'ఇంట్లోని అవసరాలు ఆమెను తనతో మాట్లాడేలా చేస్తున్నాయేమో' అని ఒక్కోసారి అనుమానంవేస్తుంటుందతనికి. మొత్తంమీద భార్యా పిల్లలు రోజురోజుకీ తనకు దూరమైపోతున్నారనిపించి మళ్ళీ తన ఆలోచనకు తనకే భయమేసింది. 'అసలు నిజంగా దూరమైపోతున్నదెవరు? తనా? లేక వాళ్ళా?' అన్న ఆలోచనవచ్చి ఏదీ సరిగ్గా నిర్ణయించలేక చివరికి మళ్ళీ పడుకున్నాడు. పడుకో బుద్ధేయలేదు. మళ్ళీ లేచాడు. సిగరెట్టు వెలిగించి గట్టిగా దమ్ము లాగాడు.

అలా సిగరెట్టు కాలుస్తూ ఆలోచిస్తూ వుంటే 'దానికి తనే కారణం' అనిపించింది, 'ఇందులో వాళ్ళ తప్పేమీ లేదు' అనుకుంటూ వుంటే మనసుకు కాస్త తృప్తి కలిగింది. లేచి స్నానమైనా చేద్దామని బట్టలు తీసుకుని స్నానాల గదివైపు నడిచాడు. నాలుగు చెంబులు చన్నీళ్ళు గబగబా పోసుకోగానే శరీరానికి, మనసుకి చాలా హాయనిపించింది. 'తను ఉద్యోగం పోగొట్టుకుని అయిదేళ్ళయినా ఎప్పుడూ రాని ఆలోచనలు ఈ రోజే ఎందుకొస్తున్నాయి?' అని ఆశ్చర్యపోయాడు. బాగా అరిగిపోయి చేతికిచిక్కకుండా జారిపోతున్న సబ్బుబిళ్ళను మళ్ళీ మళ్ళీ వంగి తీసుకుని ఎలాగోలా ఒళ్ళు రుద్దుకున్నాడు. ఈసారి అది కిందపడగానే మళ్ళీ వంగి తీసుకోడానికి విసుగు పుట్టి దాన్నలాగే వదిలేశాడు. తను ఉద్యోగంలో ఉన్నప్పుడు లంచం తీసుకున్నప్పుడల్లా ఇలాగే అధికారుల చేతికి చిక్కకుండా జారుకోవడం; తర్వాత వాళ్ళు తనకు పూర్తిగా ఉద్వాసన చెప్పడం గుర్తొచ్చింది.

స్నానం పూర్తిచేసి వచ్చేసరికి సుశీల భోజనం వడ్డించింది. వెళ్ళి పిల్లలతో బాటు భోజనానికి కూర్చున్నాడు. తండ్రి ఆరోజే తమతో భోజనానికి కూర్చున్నాడన్న సంగతిని పట్టించుకునే స్థితిలో లేరుపిల్లలు. కంచంలో అన్నం పడితే చాలని ఆత్రుతగా ఎదురు చూస్తున్న వాళ్ళకు మిగతా విషయాలేవీ అప్పుడు అక్కర్లేదు. ఆ సంగతి రాగన్న కూడా గమనించాడు గనుకనే మౌనంగా భోజనం ముగించి లేచాడు. బయటకొచ్చాక 'తనయినా వాళ్ళను పలకరించి వుంటే బావుణ్ను' అనుకున్నాడు. అయితే ఏమని పలకరించాలో అర్థం కాలేదు. ఎప్పుడూఉన్నట్టే ఈరోజూ ఉంటే సరిపోతుందనుకుని మళ్ళీ పక్కమీద వాలాడు. 'ఇకనుంచైనాసుశీల చేతిలో అప్పుడప్పుడు కాసిని డబ్బులు

పడేస్తుండాలి. దానివల్ల తన బాధ్యత తను నెరవేర్చాడన్న తృప్తయినా మిగులుతుంది' అని నిశ్చయించుకున్నాడు. కానీ ఆ నిశ్చయం...కార్యరూపం దాలుస్తుందన్న నమ్మకం అతనికి లేకపోయింది. ఇదివరకు కూడా ఎన్నోసార్లు తనిలాగే నిశ్చయించుకున్నా ఆ నిర్ణయాలేవీ అమల్లోకి రాలేదు. తనకు నెలసరి ఆదాయం ఏదీ లేకపోవడంతో ఇలా జరగడం సహజమే అనిపించింది.

వాళ్ళకూ, వీళ్ళకూ టోపీలు వేసి సంపాదించే డబ్బు, వచ్చింది వచ్చినట్టే ఎగిరిపోతుండడంతో ఇకనుంచైనా అవన్నీ మానేసి కుదురుగా ఒకచోట పనిచేస్తే మంచిదేమో-అని రాగన్న ఎన్నోసార్లు ఆలోచించాడు. కానీ కష్టపడి పనిచేయటం అలవాటు లేని తను ఎక్కడా ఉద్యోగం చేయలేడేమో అన్న అనుమానంతోఅలాగే ఉండిపోయాడు. తండ్రి తనకోసం మిగిల్చిపోయిన ఈ ఇంటిని అమ్మేసి ఆ డబ్బుతో ఏదైనా వ్యాపారం చేస్తే బావుణ్ను-అని కూడా ఎన్నోసార్లు ఆలోచించాడు. కానీ ఇప్పుడా ఆశ కూడా అడుగంటిపోయింది. మొదట్లోనే తనా పని చేసివుంటే ఏదైనా సాధించగలిగివుండేవాడేమో కానీ ఇప్పుడు మాత్రం అలాంటి ఆశలేవీ పెట్టుకోడానికి వీల్లేదాయె. ఇప్పటికే తను ఇంటిమీద బోలెడంత అప్పుచేశాడు. అసలా ఇంటిని చూసే తనకు అప్పు పుడుతోందన్న మాట అబద్ధం కాదు. దాన్ని గనుక అమ్మేశాడంటే అది అప్పులకే సరిపోదు సరికదా ఇంకెక్కడా తనకు కానీ అయినా అప్పు పుట్టదు. ఇదే ఇల్లు గనుక రోడ్డు పక్కన ఉంటే మిగిలిన స్థలంలో రెండు మూడు కొట్లు కట్టించి హాయిగాకూర్చున్న చోట అద్దెలు వసూలు చేసుకొనేవాడు. 'అక్కడ స్థలంకొనకుండా ఇక్కడెందుకు కొన్నారో' అని ఇప్పుడు ఈ లోకంలో లేని తన తండ్రిని తిట్టుకున్నాడురాగన్న. ఇలా ఏదేదో ఆలోచిస్తూ ఉంటే ఉన్నట్టుండి తన బుర్రలో మెరుపు మెరిసినట్టయి దిగ్గున లేచాడు. పాంటూ, షర్టూ తొడుక్కున్నాడు. తల దువ్వుకుంటూ వుంటే రుద్ర, నంజుండ వచ్చారు. "పొద్దున్నుంచీ తిరిగాం. రెండే రెండు చిన్న ఇళ్ళున్నాయంతే! మార్వాడీ సేటుకు పెద్దిల్లే కావాలేమో కదూ?"అని నంజుండ దీర్ఘం తీయబోతుంటే "ఇల్లు దొరక్కపోతే పీడా పోయింది" అంటూ చెప్పులు తొడుక్కుని బయటకు నడిచాడు రాగన్న. "మంచి ఇల్లు వెతుక్కురాలేదని అతనికి కోపం వచ్చిందేమో అని భయపడి వాళ్ళిద్దరూ అతని వెనకాలే నడిచారు.

బయటికొచ్చి పళని కిళ్ళీకొట్టు దగ్గర నిలబడి రోడ్డు పొడుగునా ఓ సారి దృష్టి సారించాడు. తన కొట్టుముందు నిలబడినందుకు రాగన్న డబ్బివ్వొచ్చేమో అని పళని అతన్నే చూస్తూ నిలబడ్డాడు. రాగన్న పళనికి డబ్బివ్వాలన్న సంగతిని ఎప్పుడో మరచిపోయాడు. బస్సులు, లారీలు, కార్లు, రిక్షాలు, స్కూటర్లు అన్నీ చెవులు చిల్లులు పడేలా శబ్దం చేసుకుంటూ వేగంగా పరుగెడుతున్నాయి. రోడ్డు దాటడానికి జనం ప్రయాస పడుతున్నారు. పొద్దున్న యాక్సిడెంటు జరిగిన స్థలాన్ని చూశాడు రాగన్న. ఇలాంటి సమయంలో అయితేనా కిందపడ్డ వాళ్ళిద్దరి పైనుంచి, కన్నుమూసి తెరిచేలోగా పది వాహనాలు పరుగెత్తి వుండేవి. రోడ్డు మీద సంచ

రిస్తున్న జనాన్ని, వాహనాల్నీ చూస్తుంటే బుర్ర చురుగ్గా పనిచేయడం మొదలెట్టింది. ఒక రెండు ఫర్లాంగుల దూరం అలాగే నడిచివెళ్ళి చూశాడు. రోడ్డు కిరువైపులా దుకాణాలు, చిన్నరోడ్డు, చిన్న ఫుట్‌పాత్‌లు. మళ్ళీ కొంత దూరం వెనక్కి వచ్చి నిలబడ్డాడు. అక్కడ రోడ్డు ఆకారంలో ఒక వ్యత్యాసం కనిపించింది. అక్కణ్నుంచి యాక్సిడెంట్ జరిగిన స్థలం వరకూ రోడ్డు సరిగ్గా లేదు. వంకరగా ఉంది. ఎదురుగా ఉన్న దుకాణాల బారు చౌరస్తాదాకా సాగిపోయింది. ఆ తర్వాత ఇంకాస్త ముందుకు ఓపార్కుంది. పార్కంటే అంత పెద్దదేమీకాదు. నాలుగైదు చెట్లూ, కాస్త గడ్డి ఉంది. పిల్లలు ఆడుకునేందుకు వీలుగా ఉన్నందువల్ల దాన్ని పార్క్ అంటారు. అంతే! అయితే ఆ పార్కు రోడ్డు లెవెల్‌కి సరిగ్గా లేక రోడ్డు మీదికి పొడుచుకొచ్చినట్టుగా ఉంది. ఆ పార్కు దాటి ముందుకెళితే ఒక వరస దుకాణాలు ఆ తర్వాత కొంత ఖాళీ స్థలం మళ్ళీ దుకాణాల వరస. పార్కు కెదురుగా కూడా కొన్ని దుకాణాలున్నాయి. రైల్వేలైను పక్కన మాత్రం ఇరువైపులా పెద్ద పెద్ద గుంట లుండడంతో అక్కడ ఇళ్ళుకానీ, దుకాణాలు కానీ కట్టుకోడానికి వీల్లేకపోయింది.

రైల్వేలైను మధ్యలో వచ్చి ఆ ప్రదేశాన్ని రెండుగా విడదీసి నందువల్ల ఆ రెండు ప్రదేశాలకూ వేరువేరు పేర్లున్నాయి. అవతలి పేటకు బసవపురం అనీ, ఇవతలి పేటకు శాంతప్ప బ్లాక్ అనీ పేర్లు పెట్టారు. రైలు పట్టాలు నేల మట్టానికి ఇరవై ఇరవై అయిదు అడుగుల దిగువన ఉన్నాయి. ఈ రెండు పేటలనూ కలుపుతూ ఒక వంతెనుంది. రైల్వేలైను వేసినప్పుడు అక్కడ ఇళ్ళేమీ లేవు కాబోలు. ఇటు మనుషులు అటు వెళ్ళడానికి వీలుగా ఉంటుందని ఆ వంతెనను నిర్మించారేమో! అప్పుడు ఆ వంతెనను నిర్మించిన ఇంజనీరెవరైనా ఇప్పుడు మళ్ళీ బతికి వస్తే గాభరాగా మూర్ఛపోయేటంతగా నగరం పెరిగిపోయింది. శాంతప్ప బ్లాక్ అని పిలిచే ప్రదేశంలో ఆ వ్యక్తి పేరున భూములో లేక తోటలో ఉండేవేమో! తోట మాయమై ఇళ్ళు లేచిన తర్వాత ఆ పేటకు ఆ వ్యక్తిపేరే నిలిచిపోయినట్టుంది. ఆ పేరు పాతదై పోయిందని ఆధునికంగా ఉండేలా శాంతినగర్ అని మార్చాలని కొందరు యువ సంస్కరణ వాదులు వాదిస్తున్నారు. శాంతప్ప బ్లాక్‌కి అటువైపు కూడా రెండు మూడు మైళ్ళ దూరం వరకూ నగరం విస్తరించిపోయింది. రైలు మార్గం అడ్డం ఉండడం వల్లనూ, చుట్టు పక్కల ఎక్కడా మరో వంతెన లేకపోవడం వల్లనూ ఈ రెండు పేటల జనం, వాహనాలు అంతా ఈ చిన్న వంతెన మీదుగానే పోవాలి. ఒక బస్సు వంతెన మీది కొచ్చిందంటే అది వెళ్ళిపోయే దాకా జనం పక్కకు ఒదిగి నిలబడాలి. అంత ఇరుకుగా ఉంది వంతెన. అందుకే అక్కడ ఒక ట్రాఫిక్ పోలీసు పొద్దున్నుంచీ సాయంకాలం దాకా నిలబడి వచ్చీపోయే వాహనాలను అదుపులో పెడుతుంటాడు. అటువేపు నుంచి ఏ వాహనామైనా వస్తుంటే ఇటువేపు వాళ్ళు నాలుగైదు నిమిషాలసేపు కాచుకుని నిలబడాలి.

రాగన్న చిన్న చిన్న అంశాలను కూడా ఎంతో జాగ్రత్తగా పరిశీలిస్తూ

నడుస్తున్నాడు. వంతెన దగ్గర కాసేపు ఆగి వాహనాల సర్కస్ చూసి నవ్వుకున్నాడు. రుద్ర, నంజుండలకు ఇదేమీ అర్థంకాక తికమకగా ఒకరి మొహాలొకరు చూసుకుంటున్నారు అప్పుడప్పుడు. ఒకటి రెండుసార్లు రాగన్నని పలకరించడానికి ప్రయత్నించారు, కానీ అతను మాత్రం వీళ్ళవైపు కన్నెత్తయినా చూడలేదు. 'ఉదయం యాక్సిడెంట్ జరిగినప్పుడు ఎవరో ఒక వ్యక్తి చెప్పేవరకూ తనెందుకీ రోడ్డును పరిశీలనగా చూడలేదూ?' అని అతనికి ఆశ్చర్యమేసింది. ఇప్పటికైనా ఇవన్నీ పరిశీలనగా చూసే అవకాశం కల్పించినందుకు ఆ అపరిచితుడికి మనసులోనే కృతజ్ఞత చెప్పుకున్నాడు రాగన్న. 'తను కాస్త బుర్ర ఉపయోగిస్తే ఈ రోడ్డే తనపాలిటి కామధేనువు, కల్పవృక్షం కాగలదు. ఓ రెండు సంవత్సరాల దాకా తను అడిగినదంతా అందిస్తుంది ఈ రోడ్డు' అనుకున్నాడు.

ఆక్కణ్ణుంచి కదిలి దగ్గర్లోనే ఉన్న కిళ్ళీ కొట్టులో సిగరెట్టు కొనుక్కొని వెలిగించినప్పుడు కానీ - తనతోపాటు రుద్ర, నంజుండలు ఉన్నారన్న సంగతి అతనికి గుర్తుకు రాలేదు. ఇద్దర్నీ చూస్తుంటే జాలేసింది రాగన్నకు. నవ్వొచ్చింది. అతను నవ్వడంచూసి తమమీద అతనికి కోపమేమీ లేదని గ్రహించి వాళ్ళూ నవ్వడానికి ప్రయత్నించారు: "ఈ రోజు ఏమన్నా డబ్బు సంపాదించారా?" అని అడిగాడు రాగన్న. అతనలా అడగ్గానే వాళ్ళిద్దరూ ఒకరి మొహాలొకరు చూసుకుని నవ్వుకున్నారు. చేతులు నులుముకుంటూ "అబ్బే... చెప్పుకోదగ్గ సంపాదనేంలేదు. ఏదో కాస్త కాఫీ, టిఫినుకుంది అంతే! సాయంత్రం ఖర్చుల కోసం మిమ్మల్ని ఇబ్బంది పెట్టకుండా మేమే ఎలాగో తంటాలు పడదామని ఎంతో ప్రయత్నించాం. కానీ ఏదీ కలిసిరాలేదు. ఆ ఇంటికైనా బేరం కుదిరితే బాగుండేది. ఆ శంకరయ్య ఇల్లు శెట్టిగారు కొన్నట్టయితే కాస్త ఎక్కువే ముడుతుంది. కానీ శంకరయ్యా ఓ మెట్టు దిగడాయె, శెట్టి ఎక్కడాయె. ఓ రెండు మూడువేల దగ్గర సర్దుబాటు చేసుకుంటే బేరం కుదిరిపోతుంది. ఇంకో రెండు రోజులలో ఎలాగోలా సెటిల్ చేసేయాలి" అన్నాడు రుద్ర.

"ఏదో చెయ్యండి." అంటూ రాగన్న వాళ్ళిద్దర్నీ వెంటబెట్టుకుని కాఫీ హోటలుకేసి నడిచాడు.

'కొత్తగా తన బుర్రలో మెదులుతున్న ఆలోచనను వీళ్ళకిప్పుడే చెప్పడమా మానడమా?' అని కాసేపు ఆలోచించి చివరికి...' చెప్పేసుందువల్ల లాభమే కలగొచ్చునేమోనని భావించి "నంజుండా.. ఈ రోడ్డును వెడల్పు చేస్తే ఎలా ఉంటుందంటావ్?" అని అడిగాడు. హఠాత్తుగా వచ్చిన ఆ ప్రశ్న విని వాళ్ళిద్దరూ తెల్లబోయారు. ఏం చెప్పాలో తోచక 'బాగానే ఉంటుంది" అన్నాడు నంజుండ తబ్బిబ్బయిపోతూ. "ఎవరికి?" అని రాగన్న అడగ్గానే మళ్ళీ అయోమయంగా చూశారు రాగన్నవైపు. "రోడ్డు వెడల్పయితే అప్పుడింత రద్దీ ఉండదు కదా రాగన్నా?" తనకూ ఏదో అర్థమైందన్నట్టుగా అన్నాడు రుద్ర. తన ఆలోచనల అంతరార్థం వాళ్ళకేమాత్రం అర్థం కాకపోవడం చూసి రాగన్నకు నవ్వొచ్చింది. "రోడ్డు బాగుంటే మనకేమిటి, బాగాలేకపోతే

మనకేమిటి ? రద్దీ ఉంటే ఎంత లేకపోతే ఎంత ? అవన్నీ మనకక్కర్లేదు. మనకు కావలసిందల్లా రోడ్డు వెడల్పు కావడం. అంటే రోడ్డు కటూ ఇటూ ఉన్న దుకాణా లను పడగొట్టి ఆ స్థలాలను రోడ్డుకు కలుపుకోవడం అన్నమాట. అప్పుడు ఆ దుకాణాదార్లందరూ మన దగ్గరికి పరుగెత్తు కునివచ్చేలా చేయాలి" అన్నాడు రాగన్న. అతని మాటలు పూర్తిగా అర్థం కాక పోయినా రాగన్న ఏది చేసినా అది తమకూ లాభదాయకమే అన్న విషయం బాగా తెలుసు వాళ్ళకు. అందుకే మారు మాట్లాడకుండా 'ఔనౌను' అనేశారు.

తమ పేటలో ఏం గొడవలు జరిగినా అందరూ తన దగ్గరికే పరుగెత్తుకొస్తా రన్న నమ్మకం రాగన్నకు బాగా వుంది. రోడ్డు విషయంలో కూడా ఏ వైనా గొడవలు జరిగితే దాని వల్ల తనకు బాగా కలిసొస్తుంది. ఒకవేళ నిజంగానే రోడ్డు వెడల్పయినా దానివల్ల కూడా తనకు లాభమే :ఎలాగంటే రోడ్డు పక్కనున్న దుకాణాలను పడగొట్టేసి రోడ్డును విస్త రింప చేస్తే అప్పుడా దుకాణాల వెనకే వున్న తన ఇల్లు రోడ్డు పక్కకు వచ్చే స్తుంది. మంచి సెంటర్‌లోవున్న ఇల్లంటే దానికి సహజంగానే గిరాకీ పెరుగుతుంది. ఇల్లు పడగొట్టించేసి చక్కగా మూడు నాలుగుకొట్లన్నా కట్టించుకోవచ్చు. దుకాణా లనగానే ఎవరైనా ముందే అడ్వాన్సులు కూడా ఇచ్చేస్తారు. ఒకవేళ అలా కుదరకపోతే వున్న పళంగా అమ్మేసినా ఇప్పుడున్న ధర కంటే అయిదు రెట్లు ఎక్కువే పలుకుతుంది. అవన్నీ జరిగే లోగా ఇంకా ఏమేం అవాంతరాలొస్తాయో మరి! వాటిని కూడా తన లాభానికే ఉప యోగించుకోవచ్చు - అని మనసులోనే అంచనాలు వేసుకోసాగాడు రాగన్న.

రాగన్న మాటలో ఎంత నమ్మక మున్నా అసలు రోడ్డు విస్తరింపచేయడం ఎలాగో నంజుండకు బోధపడలేదు. భయ పడుతూనే తన మనసులోని సందేహాన్ని బయట పెట్టేసరికి రాగన్నకు ఒళ్ళు మండిపోయింది. "మీకేమీ అర్థం కాదు. ఊరికే నోరుమూసుకుని నే చెప్పినట్టల్లా చేస్తుండండి చాలు. అది కాదర్రా ... రోడ్డు వెడల్పు చేయడమంటే నేను పారా తట్టా పట్టుకుని బయల్దేరుతాననుకున్నారా? నలుగురికీ చెప్పుకుంటూ పోతే వాళ్ళే చేసుకుంటారు. మన బాధ్యత అంత వరకే! ఊఁ...ఇవన్నీ మీకిప్పుడే అర్థం కావులెండి. ఇప్పుడు మీరు ముందుగా చేయవలిసిన పనేమిటంటే ..." అంటూ రాగన్న వాళ్ళకు కొన్ని సూచనలిచ్చాడు. ఇద్దరూ నోరు వెళ్ళబెట్టుకుని వినసాగారు. ఆ మహా కార్యంలో తమ పాత్ర కూడా వుందని వాళ్ళింతవరకూ అనుకోలేదు.

"మీరేం చెబితే అది చేస్తాం రాగన్నా, తలకిందులుగా నడవమన్నా నడుస్తాం" అన్నాడు నంజుండ. "మీరు తల కిందులుగా ఏమీ నడవక్కర్లేదు. నడవ డానికి కాళ్ళున్నాయి. తల వుండేది బుర్రకు పని కల్పించడానికి అంతే! దేని పని అది చేసుకుపోతే చాలు...అది సరే గానీ మీరిప్పుడు చేయవలసిన పని ఇంతే! రేపట్నుంచీ మీరెవరితో మాట్లాడినా మాటల మధ్య 'ఈ రోడ్డు వెడల్పు చేస్తారట అవునా?' అనాలి. ఇక ఆ తర్వాత మిగిలిన పని నేను చూసుకుంటాను" అని రాగన్న విడమర్చి చెప్పినప్పుడు వాళ్ళిద్దరికీ 'ఓస్ ఇంతేనా?'

అనిపించింది. "అదేం పెద్ద కష్టం రాగన్నా...మీరు చూస్తుండండి,నిమిషంలో మేమందరికీ చెప్పుకొచ్చేస్తాం" అన్నాడు వృద్ధ ఉత్సాహంగా.

"ఓరి దద్దమ్మలాలా...చెప్పుకురావడమంటే అలా చాటింపు వేసుకురావడం కాదురా! అలాచేస్తే అందరికీ అనుమానం కలుగుతుంది. కాబట్టి మాటలమధ్య యథాలాపంగా అన్నట్టు రోజుకు ఒకరికో ఇద్దరికో చెవితే చాలు. ఆ తర్వాత అలా అలా ఆ వార్త ఒకరినుంచి మరొకరికి పాకిపోయి వారంరోజుల్లో మొత్తం పేటంతా తెలిసిపోతుంది. అదీకాక మీరు వివరంగా ఏమీ చెప్పకూడదు. ఒకటి, రెండు మాటలతో క్లుప్తంగా చెప్పి జనంలో కుతూహలం రేకెత్తించాలి. వార్త అందరికీ తెలిసిన తర్వాత ఎవరైనా వచ్చి మిమ్మల్ని ఏమైనా అడిగితే 'అవునట, నేనూ విన్నాను' అనో లేక 'ఏమో మరి అందరూ అలా అనుకుంటున్నారు. నాకూ సరిగ్గా తెలీదు' అనో చెప్పి అక్కణ్ణుంచి తప్పుకోవాలి. మాట్లాడేటప్పుడు చాలా జాగ్రత్తగా ఉండాలి మీరు. ఒకసారి చెప్పినవారితో మళ్ళీ ఈమాట అసలు ప్రస్తావించకూడదు. ఆ వార్తపట్ల మీకేం ఆసక్తి లేనట్టే కనపడాలి" అంటూ వాళ్ళకు పుకారు లేవదీసే విధానం గురించి వివరించి చెప్పాడు రాగన్న.

అన్నిటికీ తలలూపారు వాళ్ళు. "అబ్బ! బుర్రంటే నీదే రాగన్నా!" అని వృద్ధ మెచ్చుకున్నాడు కూడా.

ఇంతమంచి ప్లాను ఆలోచించిన రోజున మందుకొట్టడం చాలా అవసరమని ఏకగ్రీవంగా అందరూ తీర్మానించి సారాకొట్టు కేసి బయలుదేరారు.



## 3

ఉదయం ఎనిమిదిగంటలు కావస్తూండగా నిద్రనుంచి లేచి త్వరత్వరగా స్నానాది కాలు ముగించుకుని ఇంట్లోంచి బయలుదేరాడు రాగన్న. రోడ్డు విషయంలో తను తలదూర్చడానికి ఇంకా టైముంది. వృద్ధ, నంజుండల ప్రచారకార్యం సక్రమంగా నెరవేరేవరకూ తను అందులో జోక్యం చేసుకోకూడదు. అందరికీ తెలిసిన తర్వాత కూడా తనకింకా ఏమీ తెలియదన్నట్టే ప్రవర్తించాలి తను. 'అలా ప్రవర్తిస్తేనే తన దగ్గరికి జనం పరుగెత్తుకు వచ్చేది' అన్న విషయం రాగన్నకు బాగా తెలుసు. అంతవరకూ తను మామూలు పనులుచేసి డబ్బులు సంపాదించే మార్గం వెతుక్కోవడం తప్పనిసరి కాబట్టి, పురుషోత్తమరావు కేసును పరిష్కరించడానికి నిశ్చయించుకుని అతని మామగారి స్నేహితుడైన భుజంగరావుగారిని వెతుక్కుంటూ బయలుదేరాడు రాగన్న.

అసలు పురుషోత్తమరావు భార్య పుట్టింటికెళ్ళిపోవడానికి కూడా రాగన్నే కారకుడు.బట్టలకొట్టు పెట్టుకుని వ్యాపారం చేస్తూ చక్కగా కాపురం చేసుకుంటున్న పురుషోత్తమరావును పరిచయం చేసుకుని అతనికి నెమ్మదిగా ఒకటొకటే చెడువ్యసనాలను అలవాటు చేయసాగాడు రాగన్న. అంతకితమే తండ్రిపోయి అన్ని అధికారాలూ చేతికొచ్చిన

పురుషోత్తమరావుకు ఇంట్లో భార్య, తల్లి తప్ప మరెవరూ లేరు. వ్యాపారంలో లాభ నష్టాలను నిలదీసి అడిగే పెద్దలెవరూ లేకపోవడంతో అతను రాగన్న చూపిన మార్గంలో పోవడానికి ఎక్కువ కాలం పట్టలేదు. కొత్తగా డబ్బుముఖం చూస్తున్న పురుషోత్తమరావుకు జీవితానుభవం పొత్తిగా లేకపోవడంతో-కేవలం ఇల్లు, ఇల్లాలు, వ్యాపారం-ఈ మూడింటితోనే సుఖం ఉంచుకోవడం పిచ్చితనమనీ, ప్రపంచంలో సుఖాన్నిచ్చే సాధనాలు ఇంకా చాలా ఉన్నాయనీ, ఏ వయసులోని సరదాలు ఆ వయసులోనే తీర్చుకోవాలనీ, దాంతో జీవితానుభవం కూడా బోలెడంత సంపాదించుకోవచ్చుననీ బోధించసాగాడు రాగన్న. ఆయా సందర్భాలకు తగ్గట్టుగా తను చేసిన సాహసాలను గురించి వర్ణించి వర్ణించి అతన్ని ఊరించేవాడు. తన మాటలను పురుషోత్తమరావు కళ్ళూ, నోరూ వెళ్ళబెట్టుకుని వినడం చూసి రాగన్న ఇతన్ని బుట్టలో పడేయడం ఏమంత కష్టంకాదని ఇట్టే గ్రహించాడు. రెండు మూడు నెలలు తిరిగేలోగా పురుషోత్తమరావు పూర్తిగా రాగన్న భక్తుడైపోయాడు. తాగుడు, పేకాట వగైరాలన్నీ ప్రారంభమయ్యాయి. బట్టల కొట్లో మేనేజరు పని మానేసి వెళ్ళిపోతే సేల్స్‌మన్‌గా వున్న ఒకతన్ని ఆ స్థానంలో నియమించాడు పురుషోత్తమరావు. యజమాని గుట్టుమట్లన్నీ బాగా తెలుసుకున్న ఆ కొత్త మేనేజరు నెమ్మది నెమ్మదిగా కొట్లో సొమ్మును మాయం చేయసాగాడు. ఇలా అటు యజమానీ, ఇటు మేనేజరూ-ఇద్దరి చేతి చలవతో ఒక సంవత్సరం తిరిగేసరికి కొట్టు పూర్తిగా ఖాళీ అయిపోయింది. ఈ సంగతి అతని భార్యకు తెలిసి, ఆమె ద్వారా అతని మామగారికి కూడా తెలిసిపోయింది. 'ఇలాంటి మనిషిదగ్గర నా కూతురుండడం నాకిష్టంలేదు' అని కేకలు పెడుతూ కూతురిని తన ఇంటికి తీసికెళ్ళిపోయాడాయన. ఇక అప్పటినుంచీ అతనికి ఇంట్లో తల్లి పోరు కూడా ఆరంభమైంది. 'నీ భార్యని తీసుకురా! నా నగలైనా లేక ఇల్లయినా అమ్మేసి మళ్ళీ కొట్టు తెరు' అని ఒత్తిడి చేయడం మొదలెట్టింది ఆవిడ. పురుషోత్తమరావుకు ఈ బాధ ఒకవైపైతే, మరోపక్క తను బంధువుల్లో-"భార్య తనని వదిలేసి వెళ్ళిపోయింది.' అన్న పుకారు ఎక్కడ లేస్తుందో అన్న భయం. ఈ బాధ లన్నింటినీ మరిపించే శక్తి తన పాలిటి పురుషోత్తముడైన రాగన్నకే ఉందని అతన్నే ఆశ్రయించాడు పురుషోత్తమరావు. మొదట్లో ఆ భార్యాభర్తలని విడదీయడానికి ఫీజు వసూలు చేసుకున్న రాగన్న ఇప్పుడు తిరిగి వాళ్ళిద్దరినీ కలపడానికి మళ్ళీ ఫీజు వసూలు చేయడం మొదలెట్టాడు. అలా ఆ కేసును పరిష్కరించకుండా చాలా రోజులు నాన్చేడితే అతనికి విసుగొచ్చి మరొకరి దగ్గరికి వెళ్తానని వెళ్ళొచ్చని భయపడి, పురుషోత్తమరావు మామగారితో మాట్లాడ్డం కోసం ఆయన స్నేహితుడైన భుజంగరావు గారిని పంపిస్తే మంచిదని ఆలోచించాడు రాగన్న.

భుజంగరావుగారు తన మనుమల్తో లేక మునిమనుమల్తో ఆడిస్తూ ఇంట్లోనే కనిపించారు. రాగన్న ఆ పిల్లల్లో ఒక పాపాయిని ఎత్తుకుని "అబ్బా... ఈ పాపాయి ఎంత ముద్దుగా సార్! ఈమె కళ్ళు చూసిన తర్వాత ఇక మీ కళ్ళు

చూడనే అక్కర్లేదు. అంతా మీ పోలికే అంటే నమ్మండి. మీ మనుమరాలేమో కదూ?" అంటూ ఆ పాపాయిని ముద్దు పెట్టుకున్నాడు.

"అయ్యో...అదేమిటి రాగన్నా అలా అంటావు? ఈ అమ్మాయి మా మనుమరాలి కూతురు కాదేమిటి?" అన్నారు భుజంగరావుగారు.

రాగన్న ఆశ్చర్యపోతున్నట్టు నటించి "నిజంగానా సార్... అరె.... మీకు అప్పుడే మునిమనుమలు పుట్టారంటే ఎవరైనా నమ్ముతారేమిటి? మిమ్మల్ని చూస్తూ వుంటే ఇంకా సర్వీసులో ఉన్నవారి లాగే కనిపిస్తున్నారు" అన్నాడు.

రిటైరయి పాతికేళ్ళు దాటినా ఇప్పుడీ మాట వినగానే సంతోషంతో ఉబ్బిపోయారు భుజంగరావుగారు. తమ బట్టతలను ఒకసారి ఆప్యాయంగా నిమురుకున్నారు. ఆయన కుటుంబ యోగక్షేమాలన్నీ కనుక్కున్న తర్వాత రాగన్న నెమ్మదిగా "పింఛనుదార్లందరికీ ప్రభుత్వం వారు మరో పది రూపాయలు పింఛను పెంచుతారట తెలుసా సార్?" అని అడగ్గానే కూర్చున్న భుజంగరావుగారు దిగ్గున లేచి నిలబడ్డారు.

"నిజమేనా రాగన్నా?" అన్నారు సంతోషంతో, ఆయన సర్వీసులో ఉన్నప్పుడు ప్రమోషన్ వచ్చిందని తెలిసినప్పుడు కూడా ఇంత సంతోషించారో లేదో పాపం. 'ఎలాగైతేనేం ఆయన ప్రసన్నచిత్తులయ్యారు అంతేచాలు.' అనుకుని వెంటనే వరం అడగడానికి సిద్ధపడ్డాడు రాగన్న. పురుషోత్తమరావు పరిస్థితిని ఆయన మనసుకరిగేలా వర్ణించాడు.

"ఏదో చిన్న కుర్రాడు, తెలియక తప్పు చేశాడేమో...? కాస్త మందలించి వాళ్ళ కాపురాన్ని సరిదిద్దాలే కానీ భార్యాభర్తల్ని ఇలా విడదీస్తారా సార్ ఎవరైనా?" అని రాగన్న అంటూండగానే భుజంగరావుగారు చెవులు రెండూ మూసుకుని 'రామరామ' అన్నారు. ఒక్క క్షణంసేపు కళ్ళు మూసుకుని ఆలోచించి "ఛ! సీతాపతి చేసిన పని ఏం బాగాలేదు" అని తీర్పు చెప్పేశారు.

'అలా ఊరికే తీర్పు చెప్పడం కాదు సార్... మీరు ఆయనతో ఈ మాట చెప్పాలి. అప్పుడు ఒక ఇల్లు నిలబెట్టిన పుణ్యం మీకు దక్కుతుంది" అంటూ రాగన్న వినయంగా చేతులు జోడించగానే "అలాగే నాయనా... తప్పకుండా చెబుతాను. నువ్వింత దూరం వచ్చి 'ఒక మంచి పని చెయ్యండి' అంటే నేను కాదంటానా? సీతాపతి నాకు బాగా తెలుసు. వాడు నా కళ్ళముందు పెరిగిన వాడు. చెవులు మెలేసి మరీ బుద్ధిచెబుతా వాడికి" అని హామీ ఇచ్చారు భుజంగరావుగారు. రాగన్న లోలోపల ఎంతో సంతోషించాడు, 'వచ్చినపని నెరవేరింది' అనిపించినా ఇంకో మాట అనకుండా ఉండలేక పోయాడు. "ఈకాలంలో నూరిపోసే వాళ్ళకేం తక్కువ సార్! పురుషోత్తమరావు మిత్రులు కొందరు కోర్టుకెళ్ళమని అతనికి నూరిపోస్తున్నారు. 'మామా - అల్లుళ్ళు తమ తగాదాలు ఏదో విధంగా పరిష్కరించుకోవాలిగానీ ఈ మాత్రానికి కోర్టుల కెళ్ళడం ఎందుకు?' అని బాగా బుద్ధి చెప్పాను పురుషోత్తమరావుకి" అన్నాడు రాగన్న. తను అనుకున్నట్టుగానే భుజంగరావుగారి నుంచి సమాధానం వచ్చింది. "ఛ...ఛ! ఎవరో మర్యాదల



మాటలు పట్టుకుని ఈ మాత్రానికి కోర్టు కెళ్ళడం ఏం బావుంటుంది? నేనంతా చక్క-బరుస్తాలే! నువ్వేం బెంగపెట్టుకోకు" అని ఆయన భరోసా ఇచ్చిన తర్వాత నిశ్చింతగా అక్కణ్ణుంచి కదిలాడు రాగన్న.

అంతకు ముందు అతను పురుషోత్తమ రావుతో 'నీ భార్యను తీసుకొచ్చి నీకప్పగించే బాధ్యత నాది.' అని ఎంతగా చెప్పినా, ఆ మాట ఆధారంగా ఇంకా అతన్ని ఎక్కువ కాలం తన గుప్పిట్లో పెట్టుకోవడం కష్టమని రాగన్నకు బాగా తెలుసు. అందుకే ఇక ఆలస్యం చేయకూడదని వెంటనే ఆ పనికి పూనుకున్నాడు. ఒకవేళ తన ప్రయత్నం ఫలించి వాళ్ళ-కాపురం చక్కబడినా ఇక తరువాత కూడా పురుషోత్తమరావు తనపట్ల కృతజ్ఞతగానే ఉంటాడనడంలో రాగన్నకేమాత్రం సందేహం లేదు. అసలు మామా, అల్లుడుఅప్పుడు మాటామాటా అనుకున్నా కొంతకాలం తరువాత రాజీ పడడానికి ఇద్దరూ సుముఖులేనన్న విషయం తెలిసినందువల్లే తను మళ్ళీ వాళ్ళ కాపురాన్ని చక్కదిద్దగలడన్న నమ్మకం కలిగింది. అందువల్లే తను మధ్యలో తల దూర్చడానికి సిద్ధపడ్డాడు. కానీ కొంచెం వేడి చల్లారితే గానీ ఇద్దరూ మెత్తబడరన్న సంగతి తెలిసిన వాడవడం వల్ల పురుషోత్తమరావుకు 'ఇదిగో అదిగో' అంటూ రోజులు గడుపుకుంటూ వస్తున్నాడు. అదీ గాక అలా అలా ముందుకు నెట్టుకుంటూ వస్తుంటే అటు పురుషోత్తమ రావు మామగారి కోపమూ చల్లారుతుంది, ఇటు తనకు అంతో ఇంతో డబ్బు ముడుతూ ఉంటుంది - అని అతని ఆలోచన.

రాగన్న ఇలా ఆలోచనల్లో మునిగిపోయి పరధ్యానంగా నడుస్తూంటే ఎవరో ఒక ముసలాయన ఎదురుపడి "నమస్కారమండీ... మీ కోసం మీ ఇంటికెళ్ళాను. మీరు లేరని చెప్పారు" అంటూ చేతులు రెండూ జోడించాడు. రాగన్న ఆయన వంక పరిశీలనగా చూశాడు. ఇదివరకెక్కడా చూసినట్టు గుర్తు లేదు. ఆయన పక్కన ఓ యువకుడు కూడా

ఉన్నాడు. అనుకోకుండా ఏదో బేరం తగిలిందని రాగన్నకు సంతోషం కలిగింది. వాళ్ళెవరో, తనతో వాళ్ళకేంపనో కనుక్కోవాలను కుంటుండగానే ముసలాయన అతన్ని హోటలుకు తీసికెళ్ళాడు. కడుపునిండా టిఫిను పడేవరకూ రాగన్న సంగతేమిటని అడగలేదు. తనతో పని వున్న వాళ్ళెవరైనాసరే వాళ్ళే ముందుగా విషయాన్ని ప్రస్తావించాలి. అంతేకానీ తనంతట తానుగా అడిగితే తన విలువ తగ్గిపోతుందని అతని సిద్ధాంతం. టిఫిను, కాఫీలు పూర్తయ్యాక ముసలాయన కుర్రాడికి డబ్బులిచ్చి "అయ్యగారికి సిగరెట్లు తెచ్చిపెట్టు" అన్నాడు.

రాగన్న తాపీగా సిగరెట్టు వెలిగించుకుని రెండు మూడు దమ్ములు లాగిన తర్వాత అప్పుడు అసలు విషయం చెప్పడం మొదలెట్టాడు ముసలాయన. ఆ కుర్రాడు ఆయన కొడుకు, ఎంత ప్రయత్నించినా స్కూలు ఫైనల్ కూడా గట్టెక్కలేకపోయాడు. ఊరికే బలాదూరుగా తిరుగుతుంటాడు ఎప్పుడూ. ఇక అతనికి చదువు ఎలాగూ అబ్బదు. ఏదో ఓ ఉద్యోగంలోనైనా పడేస్తే ఆ తర్వాత అతని కర్మ ఎలావుంటే అలా జరుగుతుంది – అన్న నిర్ణయానికి వచ్చిన ముసలాయన తిన్నగా అతన్ని రాగన్న దగ్గరికి తీసుకొచ్చాడు. "ఏదైనా ఫాక్టరీలోనో, వర్కుషాపులోనో ఏదో ఓ ఉద్యోగం ఇప్పించి పుణ్యం కట్టుకోండి. సార్!" అంటూ మళ్ళీ చేతులు జోడించి నమస్కరించాడు. రాగన్న కాసేపు ఆలోచిస్తున్నట్టు నటించి "అరెరె... ఎంతపని చేశారండీ! నిన్ననే ఓ కుర్రాణ్ని మా స్నేహితుడి దగ్గర పనికి కుదిర్చాను. మీరు కాస్త ముందే నా దగ్గరికి వచ్చి వుంటే ఆ ఉద్యోగం మీ అబ్బాయికే ఇప్పించేవాణ్ని" అన్నాడు.

ముసలాయన పశ్చాత్తాప పడిపోతూ "నాకు తెలియదు సార్... ఏ మాత్రం తెలిసినా ముందుగానే తీసుకొచ్చి మీ పాదాలమీద పడేసేవాణ్ణి. ఇప్పుడైనా కాస్త దయచూపించండి... వీణ్ని మీ సొంత కొడుకులాగే భావించి కడుపులో పెట్టుకోండి" అంటూ ఇంకోసారి వినయంగా నమస్కరించాడు. ఆ మాటకు రాగన్నకు నవ్వొచ్చింది. "చూడండి. ఈ కాలంలో ఉద్యోగం దొరకడం ఎంత కష్టమో మీకు తెలియంది కాదు. అయినా నేను ప్రయత్నిస్తాను లెండి. రేపు ఓ అప్లికేషను పట్టండి. ఏదైనా ఫాక్టరీకేసి వెళ్ళినప్పుడు ఇచ్చివస్తాను. ఆఫీసర్లేమో నాకు తెలిసినవాళ్ళే గానీ, గుమాస్తా వెధవలుంటారు చూడండి మధ్యన... వాళ్ళను ముందు తృప్తిపరిస్తే గానీ మన పనులేవీ జరగవు. అయినా నా శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తాను... అన్నట్టు అన్నీ సానుకూల పడినా వారం రోజుల్లోనో, రెండు వారాల్లోనో పని జరిగిపోదు. దానికోసం ఓపిక పట్టాలి.... అసలీ రోజుల్లో ఏళ్ళ తరబడి ఎదురు చూసినా ఉద్యోగాలు రావడం మహాకష్టం" అన్నాడు రాగన్న.

"తమరు తల్చుకుంటే ఎక్కడో ఓ చోట దొరక్కపోదు. ఈ పేదవాణ్ణి కనికరించాలి" అని బతిమాలుకున్నాడు.

"రేపు తప్పకుండా అప్లికేషన్ పట్టండి" అని చెప్పి రాగన్న లేచి నిలబడ్డాడు. 'అప్లికేషన్‌తో పాటు 'అది' కూడా తీసుకు రమ్మని తను ప్రత్యేకంగా

చెప్పక్కర్లేదు. ఎందుకంటే వాళ్ళను తన దగ్గరికి పంపించిన వాళ్ళు ఆ మాట కూడా ముందుగా చెప్పే వుంటారు అని రాగన్నకు తెలుసు. ఈ రోజు తను లేచిన వేళా విశేషం మంచిదే అనుకుంటూ వాళ్ళను అటు పంపించి తను ఇంటికేసి బయలు దేరాడు.

తన వ్యవహారాలను గురించి జనం ఏమనుకుంటున్నారో రాగన్నకు బాగా తెలుసు. అవసరమైనప్పుడు తన దగ్గర పని సాధించుకున్న వాళ్ళు కూడా ఆ తర్వాత చాటుగా ఏమనుకుంటారో అదీ తెలుసు. మళ్ళీ వాళ్ళే తన దగ్గరికి వచ్చినప్పుడు పళ్ళికిలించుకుని చేతులు నులుము కుంటూ తనని పొగుడుతుంటే అతనికి నవ్వుగానూ, గర్వంగానూ ఉండేది. అదో విధమైన సంతృప్తి కూడా కలిగేది. అలా అని రాగన్న దగ్గరికి వచ్చేవాళ్ళందరికీ తమ పనులు అయ్యే తీరతాయన్న నమ్మకం కూడా లేదు. ఒకవేళ పనులు జరిగినా జరగొచ్చునేమో అన్న ఆశతో బయట ఇంకెక్కడా పలుకుపడి లేనివాళ్ళు అతని దగ్గరికి వచ్చేవారంతే! ఎవరితోనైనా, ఎంత పెద్ద వారితోనైనా ధైర్యంగా మాట్లాడి పని సాధించుకునే నేర్పు రాగన్నలో ఉంది కాబట్టి – వాళ్ళతని దగ్గరికి వచ్చేవారు. అందుకోసమే అతని దగ్గరికి ఎవరో ఒకరు వస్తూ పోతూ ఉండేవారు. వాళ్ళు ఓ పదిసార్లు తన ఇంటికి తిరిగి కాసిని డబ్బులు విదిలించినట్లయితే రాగన్న నిజంగానే ఆ పనికోసం రెండు మూడుసార్లు తిరిగేవాడు. ఆసరికి అదృష్టవశాత్తు ఆ పని సానుకూల పడిందో ఇక అది తనవల్లే జరిగిందని చెప్పుకోడానికి అతనికీ మంచి అవకాశం దొరికేది. పది పనుల కోసం పదిమంది వస్తే వాటిలో ఏ రెండు మూడు పనులో సానుకూల పడినా అది నలుగురికీ తెలిసిపోయేది. దీనివల్ల రాగన్న క్లయింట్ల సంఖ్య రోజురోజుకీ పెరిగిపోతోందే కానీ ఎప్పుడూ తరిగిపోలేదు. ఈ విషయంలో చంద్ర, నంజుండలు కూడా అతనికి సహకరించేవారు. అవకాశం దొరికినప్పుడల్లా రాగన్న శక్తి సామర్థ్యాల గురించి అందరి ఎదుట పొగిడేవారు. ఎవరైనా తమ ఇబ్బందులు వెళ్ళబోసుకుంటే చాలు రాగన్న ద్వారా వెంటనే పరిష్కార మార్గం చూపిస్తామని చెప్పి వాళ్ళనక్కడికి తీసుకొచ్చేవారు. దీనివల్ల వాళ్ళకు అంతో ఇంతో ముట్టేది మధ్యలో. .

తన దగ్గరికి ఎప్పుడూ మనుషులు వస్తూ పోతూ ఉండడం; పెట్టుబడి, శ్రమ రెండూ లేకుండా డబ్బు సంపాదిస్తుండడం రాగన్నకు మంచి థ్రిల్‌గా ఉండేది.



## 4

వారం తిరిగేసరికి అక్కడక్కడ గుసగుసలు ప్రారంభమయ్యాయి. ఎక్కడ నలుగురు మనుషులు చేరినా 'రోడ్డు పెద్దది చేస్తారట!' అన్న మాట వాళ్ళ మధ్య దొర్లేది. ఇంకా ఆ విషయం ఎవరికీ ఖచ్చితంగా తెలియక పోయినా 'చేస్తారేమో మరి. ఎప్పుడో వేసిన ఈ



చిన్న రోడ్డు ఇప్పటి ట్రాఫిక్‌కు ఎక్కడ సరిపోతుంది? అబ్బబ్బ...ఏం మనుషులు.. ఏం వెహికిల్సు...' అని కొందరు సమర్థించారు. కొందరు రాగన్నను అడిగారు. అయితే రాగన్న మొదట ఆ విషయంలో తన కేమాత్రం ఆసక్తి లేనట్టు నటించేవాడు, కాని ఈ రెండు మూడు రోజుల తర్వాత 'నాకూ సరిగ్గా తెలీదు. అందరూ చెప్పుకొంటూంటే విన్నాను' అని చెప్ప సాగాడు.

రుద్ర, నంజుండలు ఇక ప్రచార కార్యం కొనసాగించ వలసిన అవసరం తీరిపోయింది. అందరూ వచ్చి తమతోనే ఆ విషయం చెప్పడం చూసి 'ఆ వార్త నిజమేనేమో!' అన్న అనుమానం వచ్చేసింది వాళ్ళకే. మామూలు మనుషులకు ఇదొక కుతూహలం కలిగించే వార్త అయినా రోడ్డు పక్కల ఉన్న దుకాణాదార్లకు మాత్రం ఇదొక పిడుగుపాటుగా తోచింది. నిజంగానే రోడ్డుకనుక వెడల్పుచేస్తే అటూ ఇటూ ఉన్న దుకాణాలను పడగొట్టవలసి వస్తుంది. అప్పుడు తమ గతేమిటి? అన్న భయం వాళ్ళని పూర్తిగా ఆవరించేసింది. వ్యాపారంలో పోటీలుపడి ఒకరితో ఒకరు మాట్లాడ్డం మానేసిన వాళ్ళందరూ మళ్ళీ ఇప్పుడు ఒకటై స్నేహ సంబంధాలు పెంచుకో సాగారు. మధ్యాహ్నం పూట గిరాకీలు లేనప్పుడు దుకాణాల బయట నిలబడి తమకు రానున్న ఆపదగురించి చర్చించుకో సాగారు. వాళ్ళల్లో కొందరు రాగన్ననూ కూడా అడిగారు. అతను తేలిగ్గా నవ్వేసి

చేస్తే మంచిదేగా... నేనెందుకు దిగులు పడాలి?' అనేవాడు నిర్లక్ష్యంగా. 'అలా అంటే ఎలా రాగన్నగారూ... ఇరుగు పొరుగు వాళ్ళకు ఇబ్బందివస్తే మనకూ వచ్చినట్టు కాదూ? మీలాంటి వాళ్ళు కల్పించుకుని, విషయమేమిటో వివరంగా కనుక్కొని వచ్చి మాకు చెప్పకపోతే మాలాంటి వాళ్ళకవన్నీ ఎలా తెలుస్తాయి చెప్పండి?' అని వాళ్ళు మళ్ళీ అనేసరికి, మొహమాటానికి ఒప్పు కుంటున్నట్టు మొహం పెట్టి 'అలాగే కనుక్కొని వస్తానులెండి' అన్నాడు. అసలు సంగతి తెలుసు కోవడం కోసం దుకాణాలు వది లేసి ఆఫీసుల చుట్టూ తిరగడానికి తమ కెలాగా కుదరదు కాబట్టి రాగన్నవల్లే ఆ పని జరిపించు కోవచ్చునేమో - అన్న ఆశ వాళ్ళలో మొలకెత్తింది. అసలు ఆ ఆశ మొలకెత్తడానికి కృష, నుంజుండలే పరో క్షంగా కారకులు. 'ఏదెలాగైతేనే కేసు తన దగ్గరికొస్తోంది, అంతా తను అను కున్నట్టే జరుగుతోంది,' అని రాగన్నకు ఎంతో సంతోషమేసింది.

అక్కడక్కడ పుకార్లు లేవదీసి ఆ వీధిలో వాళ్ళందరూ ఆందోళన పడేలా చేయడమే రాగన్న ముఖ్యోద్దేశం. అది అతని పథకంలో మొదటి భాగం. దాన్ని లాగే వదిలేస్తే నాలుగు రోజులు జనం నోళ్ళలో నాని నాని ఆ వార్త అలా అలా చప్పబడి పోవచ్చునేమో - అని భావించి కార్యరంగంలోకి దిగాలని నిశ్చయించు కున్నాడు. ఇప్పుడు తను మొట్ట మొద టిగా చేపట్టవలసిన కార్యక్రమం ఏమి టంటే దుకాణాలు అద్దెకిచ్చిన యజమా నుల దగ్గరికెళ్ళి రోడ్డు విస్తరింపచేస్తే వాళ్ళకు కలిగే ప్రయోజనాలు విడమర్చి చెప్పాలి. అక్కడున్న దుకాణాల్లో ఎక్కువ భాగం అద్దెవే. ఏనాడో తక్కువ అద్దెకువచ్చి చేరిన ఆ దుకాణాదార్లు ఇప్పటికీ అంతే అద్దె ఇస్తున్నారు. యాభై రూపాయలకు మించి ఎవరూ ఇవ్వటంలేదు. అదేగనుక ఇప్పుడు కొత్తగా కొట్లు కట్టించి అద్దెకిస్తే నెలకు ఎంత లేదన్నా రెండు మూడు వందల దాకా అద్దె వస్తుంది సులభంగా. పూర్వం జనం ఎక్కువలేని ఈ పేటలో దుకాణాలు కట్టిస్తే ఏం ప్రయోజనముంద దని, ఇళ్ళు కట్టుకుని ఉంటున్న వాళ్ళు కూడా ఇప్పుడు ఇంటి ముందు భాగాన్ని కూలగొట్టించేసి దుకాణాలు కట్టించి రెండు చేతులా అద్దెలు సంపాదించు కుంటున్నారు. అది చూసి పాత కొట్ల యజమానులు ప్రతినెలా అద్దె వసూలు చేసుకుంటున్నప్పుడల్లా లోలోపల అసూయ పడేవాళ్లు. అద్దెలు పెంచుదామని వాళ్ళు చేసిన ప్రయత్నాలు ఏమాత్రం ఫలించ లేదు. ఏ రెండు మూడేళ్ళ కొకసారో అయిదో, పదో పెంచితే ఊరుకునేవారు కానీ, అంతకు మించి పెంచితే గొడవ చేసేవాళ్ళు. ఆ పెంచిన అయిదో, పదో కూడా నానాటికీ పెరిగిపోతున్న ఇంటి పన్నులకే సరిపోయేది. కొందరు యజ మానులు పాతవారిని పంపించేసి కొత్త వాళ్ళకి ఇద్దామని ప్రయత్నించారు కానీ తెలివైన దుకాణాదార్లు ఆ ప్రయత్నాలు కొనసాగనివ్వలేదు. ఆ యజమాను లందరూ దుకాణాల వెనకాలే ఇళ్ళు కట్టు కుని అక్కడే ఉంటున్నారు. రోడ్డును వెడల్పు చేయాలంటే ముందున్న దుకా ణాల వరసనంతా తప్పక పడగొట్టాలి. అందుకు వాళ్లు ఒప్పుకుంటే ప్రభుత్వం నుంచి వాళ్ళందరికీ పరిహారధనం లభి



స్తుంది. ఆ డబ్బుతో పడగొట్టగా మిగిలిన ఇంటి భాగాల్ని దుకాణాలుగా మార్చించుకోవడమే కాకుండా, మేడమీద చక్కని గదులు వేసుకుని వాటిల్లో హాయిగా ఉండొచ్చు. కానయితే ఇన్ని సౌకర్యాలు తమకు కలుగుతాయన్న విషయాన్ని గ్రహించగలిగే తెలివితేటలు మాత్రం వాళ్ళల్లో లేవు అంతే!—రాగన్న ఇవన్నీ ఎరిగినవాడే కాబట్టి ముందుగా వాళ్ళతోనే చెప్పదల్చుకున్నాడు. విషయమంతా వివరంగా వాళ్ళ బుర్రలోకి ఎక్కించాడంటే ఇక ఆ తర్వాత వాళ్ళంతా కలసికట్టుగా నిలబడి పని సాధించుకుంటారనడంలో సందేహం లేదు.

ఇక రెండో ఘట్టం-వాళ్ళని తన దగ్గరికి రప్పించుకోవడం. ఇదీ రాగన్న వేసిన పథకం. ఈ కార్యాన్ని ద్రుప, సంజుందలకు అప్పజెప్పాడు. ఇదివరకటిలాగే ఇప్పుడు కూడా పని చాలా జాగ్రత్తగా జరగాలనీ, చెప్పిన విషయం వెంటనే గ్రహించుకోగల యజమానులెవరో కనిపెట్టి, వాళ్ళల్లో ఒకరిద్దరికి మాత్రమే చెబితే చాలని హెచ్చరించాడు. వాళ్ళ పేర్లు కూడా సూచించాడు.

ఆ రోజుకు తను చేయాల్సిన పని అయిపోయిందనిపించగా ఇంటికి బయలుదేరాడు రాగన్న. వెళ్ళాక స్థిమితంగా కూర్చుని తరువాత చేయాల్సిన పనులను గురించి నింపాదిగా ఆలోచించడం మొదలెట్టాడు. అల్లా ఆలోచించుకున్న అంశాలను మళ్ళీ మరిచిపోకుండా ఉండాలని ఒక కాగితంమీద నోట్ చేసిపెట్టుకున్నాడు. రోడ్డును విస్తరింపచేయాల్సిన అవసరం గురించి ఒక విజ్ఞాపన పత్రాన్ని తయారుచేయాలి. దాన్ని ప్రభుత్వానికి సమర్పించేందుకు ఒక బృందాన్ని నియమించాలి. ఆ బృందంలో శాంతప్ప బ్లాక్‌లోని ప్రముఖులందరూ ఉంటే మరీ మంచిది. బృందంలో మనుషులు ఎక్కువగా ఉన్నకొద్దీ (వాళ్ళు వివిధ ప్రదేశాలకు చెందినవాళ్ళయితే మరీ మంచిది) విజ్ఞాపన పత్రానికి ప్రాధాన్యత ఎక్కువగా లభిస్తుంది అనుకున్నాడు. తను టాక్స్ ఆఫీసులో పనిచేస్తున్నప్పుడు మంత్రులు విచ్చేసిన సందర్భాల్లో వాళ్ళను సందర్శించడానికి అలాంటి బృందాలు రావడం చూశాడు. ఎలాంటి బృందాలకు మంత్రులు ప్రాధాన్యతనిచ్చేవారో, దానికి కారణాలేమిటో అతను జాగ్రత్తగా కనిపెట్టేవాడు. ట్రాఫిక్ ఎక్కువగా ఉన్న సమయంలో, ఇక్కడి రోడ్డును పరిశీలించడానికి ఆ శాఖకు సంబంధించిన అధికారులనూ, మంత్రులనూ ఆహ్వానించాలి. సదరు ప్రదేశాన్ని ఓసారి తిలకిస్తే అక్కడి అవసరాలని గుర్తించగలుగుతారు వాళ్ళు. అదొక్కటే కాక పత్రికలలో ఉత్తరాల శీర్షికలో ఉత్తరాలు ప్రచురించేలా చూడాలి. ఆ తర్వాత ఆఫీసుల్లో కాగితాలు త్వరత్వరగా ఒక బల్లమీంచి మరో బల్లమీదకు జరిగేలా చూసుకునేందుకు కొందరు మనుష్యులను నియమించాలి—ఇలా అన్నీ వివరంగా రాసుకుని కార్యక్రమాల పట్టికను తయారుచేసుకున్నాడు రాగన్న.

విజ్ఞాపన పత్రాన్ని సమర్పించడానికి వెళ్ళే బృందంలో ఎవరెవరుండాలి అని కాసేపు ఆలోచించసాగాడు రాగన్న. అలా ఆలోచిస్తూ వుంటే అతనికి చటున విఘ్నేశ్వర యువక సంఘం జ్ఞాపకం వచ్చింది. ప్రతి సంవత్సరం వినాయక చవితి సందర్భంలో హెచ్చులో పెద్ద వినాయకుణ్ని కూర్చోబెట్టి వారంరోజుల

పాటు చక్కటి సాంస్కృతిక కార్యక్రమాలను ఏర్పాటు చేస్తారు ఆ సంఘంలోని యువకులు. వాళ్ళ సంఘం స్థాపించి దాదాపు ఆరు సంవత్సరాలు కావస్తోంది. ఉత్సవాలు చాలా బాగా జరుగుతూ ఉండీ, ప్రజలనుంచి మంచి ప్రోత్సాహం లభిస్తూ ఉండడంతో వాళ్ళు బాగా ఉత్తేజితులై- వినాయక చవితిఉత్సవాలే కాకుండా స్వాతంత్ర్య దినోత్సవం, రిపబ్లిక్ డే దినోత్సవం, రాష్ట్రావతరణదినోత్సవం-వగైరా వేడుకలు కూడా జరిపించడం ప్రారంభించారు. అప్పుడప్పుడు ప్రసిద్ధరచయితలనూ ప్రముఖ కళాకారులనూ పిలిపించి వారిచేత ఉపన్యాసాలు ఇప్పించడంతో కాంతప్ప బ్లాక్‌లోని ప్రజల్లో ఆ సంఘం పట్ల మంచి అభిప్రాయం ఏర్పడిపోయింది. ఆ సంఘంలోని వారందరూ ఉత్సాహవంతులైన యువకులే కావడంతో ఏ పనికైనా ధైర్యంగా ముందుకురికేవారు. కాంతప్ప బ్లాక్‌ను 'శాంతి నగర్' అని పిలవాలని ఒత్తిడి చేస్తున్నది కూడా వాళ్ళే. పూర్వం ఏ చైతన్యమూ లేక నిర్జీవంగా వున్న ఆ పేటలో వీళ్ళ సంఘం స్థాపించినప్పటి నుంచీ చైతన్యం వెల్లివిరిసింది. వాళ్ళకే గనుక ఈ రోడ్డు విషయంలో పురెక్కిస్తే వాళ్ళ సంఘానికి మంచి పేరు రావాలన్న కాంక్షతో ఏ పని చేయడానికయినా సిద్ధపడతారు. అందులో అనుమానమేమీ లేదు. బృందాన్ని నియమించే బాధ్యత కూడా వాళ్ళ పైనే వదిలేస్తే మంచిది. ఇష్టం వచ్చిన వాళ్ళని వాళ్ళు పిల్చుకుపోనీ. తన పని తేలికపడాలంటే అదే మంచి ఉపాయం—అని ఆలోచించి, విఘ్నేశ్వర యువక సంఘం ప్రెసిడెంటు రాధాకృష్ణను కలుసుకోవాలని నిశ్చయించుకున్నాడు.

రాగన్న ఇలా ఆలోచనల్లో లీనమై వుండగానే బయట చెప్పుల చప్పుడైంది. ఆ చప్పుడును బట్టే వచ్చినవాడు గోవిందయ్య అని ఇట్టే పసిగట్టేశాడు రాగన్న. రెండు నెలల నుంచీ అతనికి దొరక్కుండా తప్పించుకుంటున్నవాడల్లా ఈ రోజు ఇలా ఇంట్లోనే దొరికిపోయానే అని విసుక్కుంటూనే లేచాడు. "రాగన్నగారు - ఇంట్లో వున్నారామ్మా?" అని గోవిందయ్య సుశీలను అడుగుతూండగానే రాగన్న ఇవతలికొచ్చి "రండి రండి. ఈ మధ్య తమ దర్శనం లేక చాలా కాలమైంది" అంటూ ఆయన్ని సాదరంగా ఆహ్వానించాడు. గోవిందయ్య మొహం చూస్తూంటేనే అతనెంత కోపంగా వున్నాడో తెలిసిపోయింది. "ఆహా ... చాలా బాగా సెలవిచ్చారే? కనిపించకుండా పోయింది మీరా నేనా? ఎప్పుడొచ్చినా ఇంట్లోనే వుండరు. మీ ఇంట్లో వాళ్ళను అడగండి కావాలంటే నేనెన్నిసార్లు వచ్చి వెళ్ళానో? తిరిగి తిరిగి నా కాళ్ళు పడిపోతున్నాయే తప్ప మీ దగ్గర నుంచి ఒక పైసా కూడా వసూలు కావడంలేదు. వచ్చే నెలలో ఇస్తానన్నవారు ఆరు నెలలైనా అటువైపు మొహం చూపించలేదు. వడ్డీమాట దేవుడెరుగుగానీ అసలుకే మోసం వచ్చేలా ఉంది మీ వ్యవహారం చూస్తుంటే! పోనీ 'నేనివ్వను' అని స్పష్టంగా చెప్పేయండి. ఆ డబ్బుకు తిలోదకాలిచ్చి నిశ్చింతగా ఉంటాను! అంటూ గుక్క తిప్పుకోకుండా రాగన్న పైకి మాటలు విసిరాడు గోవిందయ్య. ఆ మాటలు తనకసలు తాకనే లేనట్టుగా "పేద వాడిమీద ఇలా కోపగించుకుంటే ఎలాగండీ షావుకారుగారూ? నా అవ

నరకానికి దప్పిచ్చి నన్ను మీరు ఆడుకున్నారు. అలాంటప్పుడు 'నేనివ్వను' అని ఏ నోటితో చెప్పమంటారు చెప్పండి? అలా చెప్పి నన్ను నరకానికి పొమ్మంటారా? ఇప్పుడు నేను ఏం చెప్పినా అబద్ధమే అనుకుంటారు మీరు. కానీ నా మాట నమ్మండి. నాలుగైదుసార్లు నేను మీ యింటికొచ్చాను-వడ్డీ అయినా కడదామని. కానీ మీరు కనిపించలేదు. ఇకపోతే మీరు మాయింటి కొచ్చినప్పుడు నేను ఇంట్లో లేనన్నారు. అది నా తప్పా చెప్పండి? మేం పేదవాళ్ళం కదా – మీలా ఇంట్లో కూర్చుంటే మా కడుపెలా నిండుతుంది? ఇరవై నాలుగ్గంటలూ బయట నానా అవస్థలూ పడుతూంటేనే కడుపు నిండదు, అందులోనూ ఒక నెలరోజుల నుంచీ ఏవో లేనిపోని ఇబ్బందుల్లో పడి ఊళ్ళంబడి తిరగాల్సొచ్చింది. నిజంగా మీ డబ్బు మొత్తం ఇచ్చేద్దామనుకున్నాను గానీ మా దురదృష్టం గురించి ఏం చెప్పమంటారు గోవిందయ్యగారూ......! మా స్వగ్రామంలో ఉన్న మా పెద్దనాన్నగారు బాగా జబ్బు పడిపోయారు. ఆయన్ను...ఆయన్నిక్కడికి తీసుకొచ్చి ఆస్పత్రిలో చేర్పించి వేలకు వేలు డబ్బు ఖర్చు పెట్టినా ప్రయోజనం లేకపోయింది. ఈ మధ్య నెలరోజుల క్రితమే పోయారు పాపం. ఆయనకు పిల్లాజెల్లా లేరు మరి. మా నాన్నగారికి సొంత అన్నయ్యకదా-ఆయన పోతే ఊరుకోవడం ఎలా? పాపం మా చిన్నప్పుడు మాకెంతో చేసింది, ఎంతో పెట్టింది మా పెద్దమ్మ. అప్పుడు వాళ్ళకు బాగా డబ్బుండేది. ఆ డబ్బు ఇప్పుడు లేనంత మాత్రాన నేనిప్పుడు ఏమీచేయకుండా ఊరుకుంటేఆవిడ ఏమనుకుంటుంది చెప్పండి? అందుకనే నాకసలు అలాంటివన్నీ ఇష్టం లేకపోయినా పెద్దవాళ్ళసంతృప్తి కోసంఆయనకు కర్మలన్నీ చేశాను. అంతా పూర్తయ్యేసరికి మీకోసం ఉంచిన డబ్బు ఖర్చయిపోవడమేకాకుండా, ఇంకో అయిదు వందలు బయటినుంచి అప్పుకూడా తేవలసి వచ్చింది...ఇప్పుడు మీరే చెప్పండి, నేను చేసింది తప్పా? తప్పయితే మీరు పెద్దవారు. నా మొహాన ఉమ్మి మరీ చెప్పండి 'ఇది తప్పని'! మీరు నాకు తండ్రిలాంటివారు... మీరు కాక నాకు ఇంకెవరు బుద్ధి చెబుతారు?" అని గుక్క తిప్పుకోకుండా గడగడా మాట్లాడేసరికి గోవిందయ్యకు మతి పోయినట్టయి ఏం మాట్లాడాలో తోచని అయోమయ పరిస్థితి ఏర్పడిపోయింది. గుడ్లప్పగించి రాగన్నకేసి చూస్తూ అలాగే ఉండిపోయాడు. రాగన్న చనిపోయిన తన పెదనాన్నగారి గుణగణాలను వర్ణిస్తూ కనుకొలకుల్లో నిలిచిన కన్నీటి బిందువులను తుడుచుకున్నాడు. చివరికి చేసేదిలేక తనే రాగన్నను ఊరడించి ధైర్యం చెప్పి వెళ్ళిపోయాడు గోవిందయ్య.

ఆయన అటు వెళ్ళగానే లోపలున్న సుశీల "మరి మీ పెదనాన్న కర్మలకు నన్ను తీసికెళ్ళనే లేదేమిటండీ?" అని అడిగింది అక్కడినుంచే.

రాగన్న పకపకా నవ్వేసి "ఉష్... కాస్త నెమ్మదిగా మాట్లాడవే...వాడింకా ఎక్కువ దూరం పోలేదు. నీ మాటలు గనుక విన్నాడంటే వెనక్కి తిరిగొచ్చి నాకే 'కర్మ' చేసేస్తాడు" అన్నాడు.

"అయినా రోజూ మీ వాళ్ళలో ఎవరో ఒకరు చస్తూ వుంటారు. లేకపోతే పుడుతూ వుంటారు కదూ? పోనీ మీకు

పెదనాన్న వరసయ్యే వాళ్ళెవరైనా ఉన్నారా అసలు?" అని అడిగింది మళ్ళీ.

అలా అడిగిందే కానీ సుశీలకు జవాబు ముందే తెలుసు.

'గోవిందయ్య హఠాత్తుగా ఊడి పడే సరికి అయన్ని వచ్చిన దారిన ఎలా సాగనంపాలా అని ఆలోచిస్తూంటే తనకి ఉపాయం తట్టింది. ఏమైతేనేం మరో రెండు నెలల వరకూ ఆయన ఇటుకేసి రాకుండా చేయగలిగాను కదా అంతే చాలు' అనుకుంటూ సంతోషంగా సిగరెట్టు వెలిగించుకున్నాడు రాగన్న.



## 5

ఓ వారం రోజులు గడిచిపోయిందేమో-

ఉదయం తొమ్మిది గంటల వేళప్పుడు రంగయ్య మరో ఇద్దరిని వెంటబెట్టుకుని రాగన్న ఇంటికొచ్చాడు. అప్పటికి రాగన్న ఇంకా నిద్రలేవలేదు. భార్య లేపేసరికి నింపాదిగా లేచాడు. అది కూడా వాళ్ళొచ్చారని లేచాడు కానీ లేకపోతే మరో రెండు మూడు గంటలసేపు హాయిగా నిద్రపోయేవాడు. ఇంకెవరైనా అయితే ఒంట్లో బాగాలేదని చెప్పి పంపించేసేవాడే కానీ 'వచ్చింది రంగయ్య' అని సుశీల చెప్పగానే అతని నిద్రమత్తు పూర్తిగా విడిపోయింది.

నాలుగైదు దుకాణాలూ, వాటి వెనుక రంగయ్య వడ్డీ వ్యాపారం కూడా చేస్తూండడంతో శాంతప్ప బ్లాక్‌లో అతను పెద్ద మనిషిగా చలామణి అవుతున్నాడు. అతనెప్పుడూ రాగన్న ఇంటి ఛాయలకన్నా రాలేదు. రాగన్నే అతని దగ్గరికి అప్పుకోసం అప్పుడప్పుడు వెళ్ళేవాడు. అంతే కాక తీర్చడం ఆలస్యం అయినందుకు అతనిచేత తిట్లు కూడా తిన్నాడు. అంతటి పెద్దమనిషి తనను వెతుక్కుంటూ తన ఇంటికి వస్తాడని అతను కలలో కూడా ఊహించలేదు. ఇప్పుడు అతను వచ్చాడంటే ఇక తన పథకం పారినట్టే అని చాలా సంతోషం కలిగింది రాగన్నకు. లేచి ఇవతలికి వచ్చి ఏమీ ఎరగనట్టే "పేదవాళ్ళ ఇంటికి పెన్నిధే కదలి వచ్చినట్టు తమరే మా యింటికి దయ చేశారా రంగయ్యగారూ? ఇంత శ్రమ మీరెందుకు తీసుకున్నారు ? కబురంపిస్తే నేనే వచ్చేవాణ్నిగా ?" అన్నాడు వినయంగా.

రంగయ్య తక్కువ తిన్నవాడేమీ కాదు. ఏం "నాలాంటి వాళ్ళు మీ ఇంటికి రాకూడదా రాగన్న గారూ ...? మీరేం కొత్త కాదుగా మాకు? మాలాంటి పల్లెటూరి బైతులకు తెలియని ఎన్నో విషయాలు తెలియ చెప్పడానికి మీరు కాక ఇంకెవరున్నారు మాకు?" అన్నాడు.

"ఒక్క నిముషం కూర్చోండి,మొహం కడుక్కుని వచ్చేస్తాను" అని వాళ్ళదగ్గర క్షమాపణ కోరుకుని స్నానాల గదివైపు నడిచాడు రాగన్న.

మొహం కడుక్కుంటూంటే అతనికి శ్రద్ధ, నంజుండలు గుర్తుకొచ్చారు. ఫరవాలేదు. తననుకున్న దానికంటే ఎక్కువే పనిచేసి వీళ్ళను తన దగ్గరకే పంపించారు వెధవలు. ఈరోజు ఏమైనా

సరే వాళ్ళిద్దరికీ మందుపోయించాలి' అను కున్నాడు.

మొహం తుడుచుకుంటూ బయటికొచ్చి "రంగయ్యగారూఇక్కడే కూర్చుందామా, లేక మీయింటికి వెళదామంటారా?" అని అడిగాడు.

"ఎక్కడైనా సరే...మీరో అరగంట సేపు తీరిక చేసుకుని మాతో మాట్లాడితే చాలు" అన్నాడు రంగయ్య.

ఇక్కడ వీళ్ళతో మాట్లాడుతూఉండగా తన మామూలు క్లయింట్స్ ఎవరైనా వస్తే బాగుండదని ఆలోచించాడు రాగన్న. అదే కాక రంగయ్య ఇంట్లో అయితే పొద్దుటి కాఫీ, టిఫినూ, సిగరెట్లూ పీటన్నిటి సమస్య కూడా తీరిపోతుందని అతని ఐడియా. అందుకని ఉపాయంగా "ఇక్కడ మీరు కూర్చోడానికి సదు పాయంగా వుండదు. ఊరికే మీరు ఇబ్బంది పడకూడదని నా ఉద్దేశం అంతే. పదండి మీ ఇంటికే వెళదాం" అంటూ వాళ్ళను లేవగొట్టి బయటికి తీసికెళ్ళాడు రాగన్న.

అతను తన పట్ల గౌరవంతోనే అలా చేస్తున్నాడేమో అని రంగయ్యకి కూడా సంతోషం కలిగింది.

రంగయ్య ఇంట్లో అందరికీ కాఫీ, ఫలహారాలు పూర్తయ్యాక రంగయ్య అసలు విషయాన్ని ప్రస్తావించాడు.

"మన రోడ్డును ఇంకా పెద్దది చేస్తారట నిజమేనా రాగన్న గారూ? అలా చేస్తే మరి మా దుకాణాలన్నీ నేలమట్టమై పోవూ? మాకు నష్టం కాదూ? కొందరేమో లాభమే అంటున్నారు. నిజంగా లాభమో, నష్టమో మాకైతే తెలియదు. అందుకనే మిమ్మల్ని అడుగుదామని మీ యింటికొచ్చాం!" అన్నాడు.

అతనుకాక ఇంకా మిగిలిన ముగ్గురు కూడా అవే ప్రశ్నలను మరో విధంగా అడిగారు.

వాళ్ళందరూ మాట్లాడ్డం పూర్తయ్యే దాకా రాగన్న నోరు మెదపకుండా మౌనంగా కూర్చున్నాడు. అందే వాళ్ళ మాటలను చాలా జాగ్రత్తగా, శ్రద్ధగా వింటున్నట్టు నటిస్తున్నాడన్నమాట! ఆ తర్వాత తాపీగా సిగరెట్టు వెలిగించుకుని ఒకటి రెండు నిమిషాలు ఏదో ఆలోచిస్తున్నట్లుగా కళ్ళు మూసుకొని "అలా అని నేనూ విన్నాను. రంగయ్య గారూ... అయితే ఆ మాట ఎంతవరకు నిజమో నాకు తెలీదు, తెలుసుకోడానికి నేను ప్రయత్నించనూ లేదు. ఎక్కడ ఏం జరిగితే నాకెందుకు చెప్పండి? దాని వల్ల నాకు ఒరిగేదేమిటి? మాటవరసకు చెబుతున్నాననుకోండి! ఇప్పుడు ఈరోడ్డు పక్కనున్న దుకాణాలన్నిటినీ కూల గొడితే, దానివల్ల మీలాంటి వాళ్ళకు లాభం. ఎందుకంటే ప్రభుత్వం మీకు నష్టపరిహారం ఇస్తుంది. ఆ డబ్బుతో మీరు మళ్ళీ కొత్త దుకాణాలు కట్టిస్తారు. అప్పుడింకా ఎక్కువ అద్దెలు వస్తాయి మీకు. కానీ నా సంగతి అలా కాదుగా? నాకసలు దుకాణాలూ లేవు, నష్టపరిహారమూ దొరకదు. ఇక ఈ రోడ్డు విషయంలో నేనెందుకు ఊరికే బుర్ర పాడు చేసుకోవాలి. మీరే చెప్పండి" అన్నాడు.

తనెంత నిరాసక్తిగా చెప్పినా ఆ మాటలోనే రోడ్డు వెడల్పు చేసినందువల్ల ఎవరెవరికి ఎంత లాభమో, దానివల్ల కలిగే ప్రయోజనాలేమిటో అన్ని వివరాలూ ఇమిడివున్నాయి. ఆ విషయం

వాళ్ళు గ్రహించారో లేదోనని ఓసారి అందరి వంకా పరిశీలనగా చూశాడు రాగన్న. రుద్ర, నంజుండలు అంతకు ముందే ఆ విషయాలను గురించి కావలసి నంత ప్రచారం చేసివున్నందువల్ల అతని మాటలు వాళ్ళకు సులభంగానే అర్థమయి పోయాయి. అంతేకాదు, రోడ్డు విస్తరింప జేస్తే దానివల్ల తమకు లాభమే కానీ నష్టమేమీ లేదని కూడా తేలిగ్గానే గ్రహించ గలిగారు. కానయితే నిజంగానే ఆ పని జరుగుతుందో లేదో మాత్రం వాళ్ళకు తెలియదు. రాగన్న ఈ విషయంలో ఏమంత ఆసక్తిలేనట్టు కనిపించినా అతనికి అన్ని విషయాలూ తెలుసేమో – అన్న అనుమానం వాళ్ళల్లో తలెత్తింది. ఒకవేళ నిజంగానే అతనికేమీ తెలియకపోయినా, తెలుసుకోగల నేర్పుందని మాత్రం వాళ్ళం దరికీ ఖచ్చితంగా తెలుసు. అందుకనే రంగయ్య మధ్యలో కల్పించుకుని "మీరే అలాగంటే ఎలా రాగన్నగారూ...మాకు లాభం వస్తే మీకొచ్చినట్టుకాదూ? మాకు ప్రయోజనం కలిగితే మీకు కలిగినట్టు కాదూ ? మాకోసమైనా మీరీ విషయంలో కలుగచేసుకోవాలి; శ్రద్ధతీసుకోవాలి. ఎంతైనా మనం ఇరుగు పొరుగు వాళ్ళం. మా అవసరాలకు మీరూ, మీ అవసరాలకు మేమూ ఆదుకోకపోతే బయటి వాళ్ళొచ్చి ఆదుకుంటారా ? మీకే ఇబ్బందులున్నా మాతో చెప్పండి. మేం సహాయం చేస్తాం!" అన్నాడు.

దాని అంతరార్థం రాగన్నకు బోధ పడింది. అంటే వాళ్ళు అప్పుడప్పుడు తనకు డబ్బు ముట్టచెపుతూంటారన్న మాట! అంతేకాక ఇంతకుముందు తనంటే ఏమాత్రం గౌరవంలేని ఈ రంగయ్య ఇప్పుడు 'మీరు' 'తమరు' అంటూ తనను కొత్తగా గౌరవిస్తున్నాడు. కానీ తను వెంటనే ఒప్పేసుకోకూడదు. కొంచెం బెట్టు చూపించాలి. అందుకని ఎంతో మొహమాట పడిపోతున్నట్టు నటిస్తూ "ఏమిటో మీరంతగా చెబుతుంటే కాదన లేకపోతున్నాను. ఈరోజేవెళ్ళి మునిసిపల్ ఆఫీసులో సంగతేమిటో కనుక్కు వస్తా లెండి!" అన్నాడు రాగన్న,

రాత్రి ఎనిమిది గంటలకు తిరిగి రంగయ్య ఇంట్లోనే సమావేశమవ్వాలని నిర్ణయించుకుని అందరూ లేచారు. రాగన్న స్వభావం కాస్త ముందుగానే తెలిసిన రంగయ్య "రాత్రికి అంతా ఇక్కడే ఏర్పా టవుతుందిలెండి.ఆ విషయంలో మీరేం ఆలో చించ నక్కర్లేదు" అన్నాడు.

ఆ ఏర్పాట్లేమిటో అర్థం చేసుకున్న రాగన్న తనలో తనే ముసిముసిగా నవ్వు కున్నాడు. అయితే ఇక తను వెధవసారా కొట్టుకు వెళ్ళనవసరం లేదన్నమాట! అనుకుని లోలోపల సంతోషించాడు.

* * *

మునిసిపల్ ఆఫీసుకు వెళ్ళాలని రాగన్న రంగయ్య వాళ్ళతో చెప్పినా, అక్కడికివెళ్ళి తను చేయాల్సిందేమీలేదని అతనికి తెలుసు. తన బుర్రలో పుట్టిన ఆలోచనకి అక్కడేం జవాబు దొరుకు తుంది, వీళ్ళ పిచ్చి కాకపోతే ?–అనినవ్వు కున్నాడు. కానీ ఆ మాట వీళ్ళ ముందు అనకూడదుగా ? ఏ పనీ చేయకుండానే చేసినట్టు చెప్పుకునే వాళ్ళకే ఈ కాలంలో గౌరవం—అన్న సిద్ధాంతాన్ని బాగా ఎరి గినవాడు రాగన్న. 'కాబట్టి ఇంటికెళ్ళి స్నానంచేసి అటునించటే ఆఫీసు కెళతాను' అంటూ అక్కడినుంచి ఇంటికెళ్ళినవాడల్లా



స్నానం చేసేసరికి పురుషోత్తమరావు తన కోసం రావడంతో అతనితో కలిసి భుజంగరావుగారింటికి బయల్దేరాడు.

వీళ్ళను చూడగానే భుజంగరావుగారు తను సీతాపతిని కలుసుకున్నట్టు చెప్పి పురుషోత్తమరావుతో "మీ మామగారికి నీ మీద చాలా కోపంగా ఉంది నాయనా! ఆ కోపం సబబైనదే! ఎందుకంటే తన కూతురి సంసారం కష్టాల పాలయితే ఏతండ్రికి మాత్రం కోపంరాదు చెప్పు? నువ్వు తెలియక ఏదో తప్పు చేశావనుకో! ఆ తర్వాత నీ తప్పు నువ్వు తెలుసుకుని ఇప్పుడు దాన్ని సరిదిద్దుకోడానికి సిద్ధపడ్డావని రాగన్న చెప్పాడు. పోనీ జరిగిపోయిందేదో జరిగిపోయింది. ఇకనుంచైనా బుద్ధిగా ఉండడం నేర్చుకో. సీతాపతితో నేనంతా చెప్పాలే! అయినా నువ్వు కూడా ఓసారి వెళ్ళి క్షమాపణ కోరుకో! పెద్దలను క్షమాపణకోరుకోవడం నామోషి ఏమీకాదు. ఇప్పటికైనా నువ్వు మళ్ళీ బిజినెస్ మొదలుపెడితే వాడు కూడా సహాయం చేస్తానన్నాడు." అన్నారు. ఆ తర్వాత అలవాటు ప్రకారం కళ్ళుమూసుకుని "రామరామ" అన్నారు.

"మిమ్మల్ని శ్రమపెట్టినందుకు క్షమించండి సార్...ఒక సంసారం నిలబెట్టిన పుణ్యం మీకు దక్కుతుందిలెండి" అన్నాడు రాగన్న భుజంగరావుగారితో.

"నేనెవర్ని నాయనా చేయటానికి? అంతా ఆ శ్రీరాముడే చేస్తాడు. మీరిక వెళ్ళిరండి. మిమ్మల్ని భగవంతుడు చల్లగాచూస్తాడు!" అంటూ ఆయన మళ్ళీ ధ్యానమగ్నులైనట్టు కనిపించగానే ఇద్దరూ అక్కడినుంచి కదిలారు.

పురుషోత్తమరావుకైతే కొత్తగా రెక్కలువచ్చినంత సంతోషంగా ఉందిప్పుడు. తనొక్కడే అయితే ఈపాటికి భార్యదగ్గరికి ఎగిరి వెళ్ళిపోయివుండేవాడు. కానీ రాగన్న తన పక్కనున్నాడుగా? అతని సమస్య ఇంత సులభంగా పరిష్కారమవడం చూసి రాగన్నకుకూడా చాలా సంతోషమేసింది. భుజంగరావుగారిని రాయబారం పంపడానికి తనెన్ని అవస్థలు పడాల్సివచ్చిందో పురుషోత్తమ

రావుతో వర్ణించి వర్ణించి చెప్పాడు. ఆ తర్వాత "ఆయన చెప్పారు కదా అని నిన్ను మీమామగారింటికి పంపిస్తున్నాను కానీ లేకపోతే ఆయనే నీదగ్గరికి వచ్చేలా చేసుండేవాణ్ని" అని డంబాలు పలికాడు రాగన్న. అక్కడికెళ్లగానే నీ భార్యను చూసి మురిసిపోయి పళ్ళికిలించకు. కాస్త గంభీరంగా ఉండి అల్లుడి బెట్టు చూపించు అని హితవుకూడా బోధించాడు.

అన్నిటికీ అంగీకారసూచకంగా తలూపాడు పురుషోత్తమరావు. అతనిదృష్టిలో రాగన్న ఇప్పుడు సాక్షాత్తు పురుషోత్తముడే! అతన్ని ఇంటిదాకా సాగనంపి తను మామగారింటివైపు బయల్దేరాడు పురుషోత్తమరావు.

* * *

రంగయ్య ఇంట్లో మళ్ళీ రాత్రికి అందరూ సమావేశమయ్యారు. రాగన్న కనుక్కొచ్చిన విషయాలు తెలుసుకోవాలని రంగయ్య, అతని స్నేహితులు చాలా ఆత్రంగా ఉన్నారు. కానీ రోడ్డు వెడల్పు చేసే విషయాన్నిగురించి మునిసిపల్ కార్పొరేషన్‌వాళ్ళు అసలు ఆలోచించలేదన్న సంగతి వినగానే నిరాశతో నీరు కారిపోయారు.

"పొద్దున్నసగా వెళ్ళినవాణ్ని సాయంకాలంవరకూ అక్కడే ఉండిపోయాను. మొత్తం ఆఫీసంతా తిరిగి ప్రతివాళ్ళనూ అడిగాను. కానీ ఎవరూ 'మాకు తెలీదంటే మాకు తెలీదు' అన్నారు. అసలు అలాంటి ఉద్దేశమేమైనా ఉంటేగా తెలియడానికి? పూర్వం ఎప్పుడో ఓసారి అలాంటి ఆలోచన వచ్చిందట కానీ ఎవరూ ఆవిషయంలో అంతగా శ్రద్ధ వహించకపోవడంవల్ల దాన్నంతటితోనే వదిలేశారట! ఈ విషయం ఒక ఆఫీసరుగారు చెప్పారు నాతో. ఇక అక్కడుండి చేసేదేముందని కాళ్ళీడ్చుకుంటూ ఇంటికొచ్చాను" అంటూ తను పడని అగచాట్లగురించి ఎంతో ఇదిగా చెప్పాడు రాగన్న.

"అలా అయితే జనం అనుకుంటున్నది నిజం కాదా రాగన్నగారూ? బజారులో ఎవరినోట విన్నా ఇదేమాట. మరినిప్పులేందే పొగెలా వచ్చిందంటారు?" అని రంగయ్య అన్నప్పుడు "చూడండి రంగయ్యగారూ! ఇలాంటి వార్తలన్నీ ఎక్కడినుంచి పుట్టుకొస్తాయో, ఎక్కడ అంతరించిపోతాయో చెప్పడం కష్టం. అందుకనేగా 'జగన్నాథుని నోరు మూయించగలమేమో కానీ జనం నోళ్ళు మూయించలేం' అనేది? ఎవరో ఓమాట అనుంటారు. అది అలాగే వార్తగా మారి ప్రజల్లో పాకిపోయింది. అసలు మనుషులే అలాంటిదేం లేదని చెప్పిన తర్వాత కూడా ఇంకా ఆ మాటను నమ్ముతున్నారా మీరు" అన్నాడు రాగన్న.

అది వినగానే రంగయ్య మొహం పాలిపోయింది. 'ఇప్పుడు తనకున్న మూడు దుకాణాలను ప్రభుత్వం కూలగొట్టి నష్ట పరిహారం చెల్లిస్తే ఆ డబ్బుతో ఇంకాస్త వెనక్కి నాలుగైదు దుకాణాలు కట్టించి అద్దెకిస్తే నెలకు ఎంతలేదన్నా రెండు వేలైనా వస్తాయని మనసులో అప్పుడే లెక్కలు వేసేసుకున్నాడతను. అదంతా ఇప్పుడు తలకిందులయిపోయింది' కదా?' అని అతని బాధ. తక్కినవాళ్ళు కూడా రంగయ్యలాగే దిగాలుపడి కూర్చుండిపోయారు. రాగన్న వాళ్ళందరి మొహాల కేసి ఓసారి చూశాడు. ఆ తర్వాత చేతి

లోని గ్లాసును నోటికి కానించి పెదాలు చప్పరిస్తూ "అరె ... అందరూ ఇలా దిగాలుపడిపోయారేమిటి ఒక్కసారిగా? ఆ ఆఫీసర్లు కాదన్నంతమాత్రాన మన రోడ్డు వెడల్పు కాకుండా పోతుందా? అయ్యో పట్టు చూడాలిగానీ, ఇలా మొహాలు వేళ్ళాడేసుకుంటే పనులు జరుగుతాయా? మీరు నా మాట వింటానంటే..." అంటూ తన మాటను సగంలోనే ఆపి వాళ్ళనే పరీక్షగా చూస్తూ గ్లాసు కింద పెట్టాడు. ఆ ముగ్గురిలోనూ మళ్ళీ చైతన్యం వచ్చింది. రాగన్న దగ్గర ఏదో ఉపాయం ఉన్నట్టు పసిగట్టి వెంటనే అతని గ్లాసు నింపుతూ "చెప్పండి స్వామీ... ఏం చేయమంటారో చెప్పండి. మీరెలా చెబితే అలా చేస్తాం" అన్నాడు రంగయ్య.

రాగన్న వాళ్ళకు ఉపదేశించడం ప్రారంభించాడు.

"ప్రజలకు అవసరమైన సౌకర్యాలన్నీ ప్రభుత్వం చేస్తుంది. నిజమే! కానీ అన్నీ మనం అడక్కుండానే అమర్చిపెట్టదు. కొన్ని అత్యవసరమైన సౌకర్యాలు మాత్రమే ప్రభుత్వం కంటికి కనిపిస్తూ వుంటాయి. అందే సూక్ష్మం. అన్నీ ముఖ్యమైనవన్నీ 'ఉన్నాయా లేదా' అని ప్రభుత్వ అధికార్లు వచ్చి కనుక్కొని వెళుతూ ఆ వివరాలన్నీ ప్రభుత్వానికి అందించి వాటిని కార్యరూపం దాల్చేలా చూడాలి. అయితే అలాంటి అధికార్లు మనలో ఎంతమంది ఉన్నారంటారు? ఉన్నా ఒకరిద్దరు వాళ్ళు చెప్పినవన్నీ ప్రభుత్వం చేస్తుందన్న గ్యారంటీ ఏమిటి? డబ్బుకొరత అనేది ప్రజలకేకాదు, ప్రభుత్వానికి కూడా ఉంటుంది. అలాంటప్పుడు కొన్ని కార్యాలను వాయిదా వేస్తుంటుంది. కానీ ప్రజలు 'తమకీ సౌకర్యం కావాలి' అని పట్టుబట్టితే, ఒత్తిడి చేస్తే అప్పుడు ప్రభుత్వం వాళ్ళకు లొంగిపోయి ఆ కార్యాలను తప్పనిసరిగా చేబడుతుంది. ప్రభుత్వమంటే దేవుడన్నమాట! దేవుడు తనంతట తానుగా భక్తుల దగ్గరికి వచ్చి వరమీయడుగా? భక్తులే వాణ్ని వేడుకోవాలి. పూజించాలి! స్తుతించాలి. అప్పుడు దేవుడికి దయకలిగి భక్తుల అభీష్టాన్ని నెరవేరుస్తాడు! ఈ ప్రభుత్వమూ అంతే! ప్రజలు ఊరుకుంటే అదీ ఊరుకుంటుంది. ప్రజలు మేల్కొని ఆందోళనలు లేవదీస్తే అదీ స్పందిస్తుంది. కాబట్టి ఇక్కడి ప్రజలంతా కలిసి రోడ్డు ఇరుకుగా ఉన్నందువల్ల తమకెంత ఇబ్బందిగా ఉందో దానివల్ల ఎన్ని రోడ్డు ప్రమాదాలు జరుగుతున్నాయో ప్రభుత్వానికి తెలియపరచి రోడ్డు వెడల్పు చేయమని కోరుకోవాలి. ఒత్తిడిచేయాలి. ఇక్కడ రోడ్డు వేసినప్పటి పరిస్థితిని వివరించి అది ఎంత అవసరమో తెలియచెప్పాలి. రైల్వేలైను నగరాన్ని సరిగ్గా మధ్యకు విభజించినందువల్ల రెండు ప్రదేశాలనూ కలిపే దారి ఇదొక్కటే కాబట్టి నగరం విస్తరించిన కొద్దీ ముందు ముందు జనసంచారం, వాహనాల రాకపోకలు మరీ పెరిగిపోతాయి. ఇప్పుడే ఈ రోడ్డును వెడల్పు చేయకపోయినట్టయితే, ఇక్కడ జరిగే యాక్సిడెంట్లకు లెక్కవుండదు. ఈ అన్ని కారణాలను కూలంకషంగా పరిశీలించాలని ప్రభుత్వానికి విన్నపం పంపుకోవాలి. ఇందుకుసంబంధించిన అధికార్లను ఇక్కడికి పిలిపించి ప్రత్యక్షంగా చూపించినట్టయితే ఆ అవసరం వాళ్ళే గుర్తిస్తారు."

రాగన్న ఇవన్నీ విడమరచి చెబుతుంటే వాళ్ల మత్తుగా మూసుకుపోతున్న

కళ్ళను బలవంతాన తెరుస్తూ అతని మాటలు వింటూ కూర్చున్నారు. రాగన్న గ్లాసు కింద పెట్టగానే రంగయ్య ఉత్సాహంగా దాన్ని నింపుతూ "తీసుకోండిసార్ తీసుకోండి. అందుకనే మిమ్మల్ని పిలిచింది మేము. ఎంత చక్కగా చెబుతారో చూడండి మీరు? మీకు తెలిసినన్ని విషయాలు ఈ పేటలో ఇంకెవరికి తెలుసంట!" అన్నాడు.

రంగయ్య పక్కనున్న మూదలి గిరియప్ప తను తెచ్చిన ఫలహారాల పొట్లాలను విప్పి అందరి ముందుంచాడు. రంగయ్య తన గ్లాసులో ఉన్నదంతా ఒక్క గుక్కలో తాగేసి "అయితే ఒక విజ్ఞాపన పత్రాన్ని రాసివ్వండి సార్! రేపే మేము వెళ్ళి మినిస్టర్లను కలుసుకుని ఇచ్చేస్తాం'. అన్నాడు రెట్టించిన ఉత్సాహంతో.

రాగన్న పెద్దగా నవ్వేశాడు.

అతనలా నవ్వడం చూసి రంగయ్య "ఎందుకలా నవ్వుతారు? తాగిన మైకంలో ఏదో వాగుతున్నాడను కున్నారా? లేక ఆ పని మా వల్ల కాదనుకున్నారా? ఎవర్ని కలుసుకోవాలో చెప్పండి ఇప్పుడే కలుసుకుంటాం" అంటూ మీసాలు మెలేశాడు.

అతని ఆ అవతారం చూసి రాగన్నకు నవ్వాగలేదు. నవ్వుతూనే "మీరెవరినైనా కలుసుకోగలరు రంగయ్యగారూ... మీకు ఆ పలుకుబడి ఉంది. కానీ ఇప్పుడు మనకు కావలసింది పలుకుబడి కాదు. ఉపాయం... ఉపాయం కావాలండీ!" అన్నాడు నొక్కి పలుకుతూ.

"అలా చెబితే మాకేమర్థమవుతుందండీ? కాస్త విడమరచి చెప్పండి అర్థమయ్యేలా. మిమ్మల్ని కాక ఇంకెవరి నడుగుతాం మేం మాత్రం?" అన్నాడు మూదలి గిరియప్ప.

"అంతగా విడమరచి చెప్పేందుకు ఇందులో ఏముందని? ఇలాంటి పనుల్ని మీరే స్వయంగా చేయకూడదు. ఎవరిచేతనైనా చేయించాలి. ఎందుకంటారేమో..." అన్ని వాళ్లు 'ఎందుకని' అడక్కముందే తనే చెప్పడం ప్రారంభించాడు రాగన్న.

"ఇప్పుడు రోడ్డు వెడల్పు చేస్తే పడగొట్టేది మీ ఇళ్లే. అవునా? మరి ఎవరైనా తమ ఇల్లు తామే పడగొట్టుకోవాలని కోరుకుంటారా ఎక్కడైనా?" అని అంటూండగానే రంగయ్య కల్పించుకొని "అందులో తప్పేముంది సార్! మేము అభ్యంతరం చెప్పకపోతే వాళ్ళపని ఇంకా తేలిక కాదూ!" అన్నాడు. అతను నెల రోజుల క్రితం తన దుకాణంలో అద్దెకుంటున్నవాడితో 'అద్దె ఎక్కువ చేయండి లేకపోతె ఖాళీ చేయండి'. అన్నందుకు ఆ దుకాణాదారు మండిపడి 'నేను అద్దె ఎక్కువగా ఇవ్వనూ లేను... ఇప్పుడు కొట్టు ఖాళీ చేయనూలేను' అని ఖచ్చితంగా చెప్పేశాడు. అది తలుచుకుంటేరంగయ్యకు ఇప్పటికీ అతన్ని నమిలి మింగేయాలన్నంత కోపంగా ఉంది. అందుకే దుకాణాలు పడగొట్టడానికి అంత ఆతృతగా ఉన్నాడు రంగయ్య.

"అది నిజమే రంగయ్యగారూ, కానీ అలా అని నలుగురికీ తెలియకూడదుగా! తెలిస్తే ఇందులో ఏదో కిటుకుందని అందరికీ అనుమానం వస్తుంది. అసలు పని జరగడమేగా మీకు కావలసింది? అది ఎవరివల్ల జరిగితేనేం? అందుకని నామాట వినండి. ఈ పేటలో ఉన్న జనమంతా కలిసి రోడ్డు వెడల్పు చేయమని ప్రభు

త్యాగాన్ని కోరాలి. మీరు మాత్రం పైపైకి దాన్ని ప్రతిఘటిస్తున్నట్టుగా నటించాలి. 'నష్టపరిహారం ఇచ్చేస్తే అయిపోతుందా ? ఎంత డబ్బిచ్చేస్తే మాత్రం మాకు మళ్ళీ ఇలాంటి స్థలం దొరుకుతుందీ? మా పొట్టకొట్టేయాలి' అని వాపోవాలి. అప్పుడింకా ఎక్కువ నష్టపరిహారం అడగడానికి వీలుంటుంది. ఇంకో చోట ప్లాట్ కూడా సంపాదించుకోవచ్చు. అవన్నీ జరిగితే అప్పుడు దుకాణాదార్లకు కూడా మీమీద ఏ మాత్రం అనుమానం రాదు. పైగా వాళ్ళతోబాటు మీకు కూడా నష్టం వచ్చినట్టు భావించి మీ పట్ల సానుభూతిగా ఉంటారు. అంతేకాక 'వెనకవైపు కొత్త దుకాణాలు కట్టించిన తరువాత మళ్ళీ మీకే అద్దెకిస్తానని, వాళ్ళకు నచ్చచెబితే వాళ్లూ నోరు మూసుకుని ఊరుకుంటారు. అలా చెప్పకపోయినట్టయితే ఇక కోర్టు కెక్కుతారు. మిమ్మల్ని కూడా నానా తిప్పలూ పెడతారు. అప్పుడు మీ పని కూడా సక్రమంగా జరగదు. ఒకసారి ఎలాగోలా వాళ్ళ నిక్కణ్ణుంచి కదిలించగలిగారంటే ఇక ఫరవాలేదు. ఆ తర్వాత మీరు కొత్త దుకాణాలు కట్టించినా తిరిగి వాళ్ళకే అద్దెకియ్యాలన్న రూల్సేమీలేవు... అంటే ఒక్క దెబ్బతో రెండు పిట్టలన్నమాట ! రెండూ కాకపోయినా ఒకటైతే పడిపోవడం ఖాయం. అయితే ఒక విషయం మాత్రం మీరెప్పుడూ మరచిపోకూడదు. అదేమిటంటే ఏ పని చేసినా చాటున ఉండి చేయాలిగానీ పబ్లిగ్గా మాత్రం చేయకూడదు" అని మళ్ళీ హితబోధ చేశాడు రాగన్న.

రంగయ్య బృందానికి కూడా అది సబబుగానే తోచింది కానీ తాము చేయవలసిన పనేమిటో బోధపడలేదు. అమాటే రాగన్నని అడిగాడు రంగయ్య స్నేహితుడు వీరన్న.

"మీరు చేయవలసిన పనంటారా? కాసేపాగండి, చెబుతాను" అంటూ ఒక్క నిమిషం ఆలోచిస్తున్నట్టు నటించి "ఇలాంటి పనిచేయడానికి ఎవరు సమర్థులు ? అని ముందు కనుక్కోవాలి. కనుక్కుని వాళ్లను పట్టుకోవాలి. వాళ్ళను ముందు పెట్టుకుని మీరువాళ్ళచాటున దాగి వుండాలి కానీ మీరున్నారన్న జాడకూడా ఎవరికీ తెలియకూడదు" అన్నాడు తేలిగ్గా.

ఎంతో పెద్ద సమస్యని అతనంత తేలిగ్గా తీసుకుని మాట్లాడడం రంగయ్యకి నచ్చలేదు.

"వీరన్నా...నీకేం తెలీదు...ఊరుకో అంత తేలిగ్గా ఎవరో ఒకరు దొరికిపోతారనుకుంటున్నావుకదూ ? అలా ఎవర్ని పడితే వాళ్ళను ఆ పనికి వాళ్ళను నియమించుకుంటారేమిటి ? దానికంతా చాలా నమ్మకస్తులైన వాళ్లు కావాలి. కదూ రాగన్నగారూ...?" అన్నప్పుడు రాగన్న ఔనన్నట్టుగా తలూపాడు.

"చెప్పు వీరన్నా మరి! అలాంటివాళ్లు నీ ఎరుకలో ఎవరైనా ఉన్నారా?" అని రంగయ్య వీరన్నను ప్రశ్నించాడు.

వీరన్న కాసేపు ఆలోచించి "అబ్బే ఎవరూ లేరు మీమాట నిజమే! అలాంటి వాళ్ళు దొరకడం కష్టమే!" అన్నాడు.

అందరూ కలిసి మళ్ళీ రాగన్ననే సలహా అడిగారు తను రెండుమూడు రోజులు ఆలోచించుకుని కొందరి పేర్లు సూచిస్తానని చెప్పాడు రాగన్న "కానీ ఎవరు దొరికినా అటూఇటూ తిరగడానికి వాళ్ళకూ, వీళ్ళకూ ముట్టజెప్పడానికి

"కొంత ఖర్చవుతుంది...మరి ఆఖర్చు..." అని అతనింకా దీర్ఘం తీస్తుండగానే రంగయ్య చటుక్కున "ఆ బెంగ మీకక్కర్లేదు...అదంతా మేంచూసుకుంటాంలెండి" అన్నాడు.

రాగన్నకు కావలసింది కూడా అదే! సమావేశం ముగిసిన సూచనగా రాగన్న చివరిగా రెండుమాటలు చెప్పాడు

"ఇదుగో జాగ్రత్తగావినండి. ముందే చెప్పేస్తున్నాను. ఈ వరస దుకాణాల యజమానులందరూ కలిసికట్టుగానే ఉండాలి.

అందరూ ఒకేమాటమీద నిలబడాలి. తలోమాట మాట్లాడితే ఆతర్వాత చాలా ఇబ్బందులొస్తాయి. అలాగే ఖర్చు మాటకూడా.

దీనికయ్యే ఖర్చంతా ఒక్కరే భరించనక్కర్లేదు. నెలనెలా తలాకాస్త వేస్తూంటే అదో ఫండుకింద తయారవుతుంది. అయితే ఇదంతా చాలా జాగ్రత్తగా జరగాలి. ఏమాత్రం ఆచూకి తెలియకూడదు, అలా తెలిసిన రోజున మన ప్లానంతా చెడిపోతుంది."

రాగన్న మాటలకు అందరూ అలాగే నన్నట్టు తలలూపారు.

అయితే, రాగన్న తన పేరుమాత్రం ఎట్టి సందర్భంలోనూ బయటికి రాకూడదనీ, వచ్చినట్టయితే తను అనవసరంగా అందరి విరోధాలకూ గురికావలసి వస్తుందనీ మరీమరీ చెప్పాడు. వాళ్ళు తాగుడుమైకంలో ఆమాటను మరిచిపోతారేమోనని నాలుగైదుసార్లు నొక్కినొక్కి చెప్పాడు. తనపేరు బయటికివస్తే అసలు బండారం బయటపడిపోతుందని అతని భయం!



## 6

విఘ్నేశ్వర యువకసంఘం అధ్యక్షుడు రాధాకృష్ణను కలుసుకుందామని రాగన్న వెళుతూండగా దారిలో నారాయణరావుగారు కనిపించారు. 'అరె! తన పనికి ఈయన చక్కగా పనికివస్తారన్న విషయాన్ని తనింతవరకూ ఆలోచించనేలేదే!' అనుకున్నాడు. అలా అనుకోవడమే ఆలస్యం గబగబా ఆయనకు ఎదురు వెళ్ళాడు. అదివరకు ఆయన కనిపిస్తేనే దూరంగా పారిపోయేవాడల్లా ఇప్పుడు చిరునవ్వుతో రెండుచేతులూ జోడించి "నమస్కారం సార్" అన్నాడు.

డెబ్బయి అయిదేళ్ళ వయసు పైబడ్డ నారాయణరావుగారికి ఈమధ్య కళ్ళుసరిగ్గా కనిపించడంలేదు. అందుకనే బాగా దగ్గరగా వచ్చి గుచ్చిగుచ్చిచూస్తూ "అరె... రాగన్నవికదూ! బాగున్నవా? చాలారోజులకు కనిపించావే!" అని ఆయనే పలకరించారు.

"మీ దయవల్ల బాగానే ఉన్నానండీ! మీరు బాగున్నారా? మీ యింటికి రావాలని ఎన్నోసార్లనుకున్నాను కానీ ఏదో ఒక పని తగిలి రాలేకపోయాను. అన్నట్టు మీ ఆరోగ్యం ఎలా ఉంది? ఆ మధ్య కళ్ళు సరిగ్గా కనిపించడంలేదన్నారు. ఇప్పుడు బాగా కనిపిస్తున్నాయా!" అంటూ

అప్యాయంగా కుశలప్రశ్నలు వేసేసరికి నారాయణరావుగారు సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయారు. ఈ మధ్య ఎవరూ ఆయన్ని ఇంత ఆప్యాయంగానూ, ఆత్మీయంగానూ కుశల ప్రశ్నలు వేయలేదు.

"ఏదో ఇలా ఉన్నాను. అయినా ముసలితనం వచ్చేసిందిగా - ఏదో ఒక నలత ఉంటూనే ఉంటుంది ఎప్పుడూ... అయినా ఇంకెన్నాళ్లలే నాలుగురోజులు ఓర్చుకుంటే అయిపోతుంది" అన్నారు.

"ఛ! అలా అనకండి సార్. మీరు పెద్దలు. మాలాంటి వాళ్ళకి బుద్ధిచెప్పడానికి మీలాంటివాళ్ళు తప్పక ఉండాలి. అందుకోసమైనా మీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోవాలి" అన్నాడు రాగన్న.

నారాయణరావుగారు ఇంతటి ఆప్యాయతకు తట్టుకోలేక పోయారు. రాగన్నను ఇంటికి రమ్మని బలవంతం చేశారు. అందుకోసమే ఎదురుచూస్తున్న రాగన్న ఆయన వెనకాలే నడిచాడు.

స్వాతంత్ర్య సంగ్రామ కాలంలో నారాయణరావుగారు విరివిగా పాల్గొన్నారట! అజ్ఞాతంగా ఉంటూనే రాత్రికి రాత్రి ప్రయాణం కట్టి ఊరూరూ తిరిగి ప్రజలను పోగుచేసేవారట! కరపత్రాలు అచ్చు వేయడం, వాటిని అందరికీ పంచిపెట్టడం-మొదలైన పనులన్నిటినీ ఎంతో సమర్థవంతంగా నిర్వహించేవారట! జైలుకైతే ఆయన లెక్కలేనన్నిసార్లు వెళ్ళారట! జైల్లో గొప్పగొప్పదేశనాయకులతో కలిసి వుంటూ, దేశపరిస్థితుల గురించి చర్చిస్తూ వుండేవారట! వాళ్లందరూ ఈయన్ని సలహాలు కూడా అడుగుతూండేవారట! ఇప్పుడు అధికారంలో ఉన్న వాళ్లల్లో చాలామంది ఆయన శిష్యులేనట! స్వాతంత్ర్యం లభించిన తర్వాత నాయకులు అధికారాల కోసం కుక్కల్లా కాట్లాడుకుంటూంటే విసుగుపుట్టి రాజకీయ సన్యాసం స్వీకరించారట!

ఈ మాటలు ఎంతవరకూ నిజమో ఎవరికీ తెలియదు. కానీ నారాయణరావుగారు దేశనాయకులతో కలసి తీయించుకున్న ఫొటోలు వాళ్ళు ఆయనకు రాసిన ఉత్తరాలూ బోలెడున్నాయి ఆయనదగ్గర. ఎవరైనాఇంటికివస్తే అవన్నీ తప్పకుండా చూపించి, గాంధీజీని తను కలుసుకున్న అనేక సందర్భాలను గంటల తరబడి వర్ణిస్తారు. 'అప్పుడు మేమంతా కన్న కలలేమిటి? ఇప్పుడు జరుగుతున్నదేమిటి?' అంటూ నిట్టూర్పులు విడుస్తారు. అయితే ఆయనలో ఒక బలహీనత ఉంది. అదేమిటంటే ఎదుటి మనిషికి తన మాటల్లో ఆసక్తి ఉందా లేదా అన్నది కూడా ఆలోచించకుండా గంటల తరబడి అలా మాట్లాడుకుంటూ పోవటం! చెప్పినవాటినే మళ్ళీ మళ్ళీ - చెప్పడం! వాళ్ళింటికి వెళ్ళినప్పుడల్లా అవే మాటలు మళ్ళీ మళ్ళీ విని విసుగెత్తిపోయి చివరికి వెళ్ళడమే మానుకున్నారు అందరూ. ఆయన ఎదురుపడితే ఎక్కడ పట్టుకుంటాడోనని భయపడి తప్పించుకు పారిపోతారు. కొత్త మనుషులు తారసపడక, పాతవాళ్ళురోతపడి పారిపోతూంటే తన సాహసాల గురించి చెప్పుకోడానికి మనుషులే దొరకడంలేదే! తను అందరికీ అంత అక్కర్లేని మనిషైపోయానా?- అంటూ తనలో తానే బాధపడుతూ రోజులు వెళ్ళదీస్తున్నారు నారాయణరావుగారు. స్వాతంత్ర్యయోధుల విశ్రాంతి వేత

నం ఈయనకు లభిస్తూండడంతో భుక్తికి లోటులేకుండా గడిచిపోతుంది. ఉదయం, సాయంకాలం భార్యను ఎదురుగుండా కూర్చోపెట్టుకుని భగవద్గీత చదివి వినిపిస్తారు. ఏం తోచనప్పుడు రాట్నం ముందేసుక్కూర్చుంటారు.

నారాయణరావుగారితో కలిసి వాళ్ళింటికెళ్ళిన రాగన్నకు మొట్టమొదట మూలనున్న రాట్నం కనిపించింది, అది కూడా ఈయనలాగే ముసలిదైపోయింది. అనిపించి అతనికి నవ్వొచ్చింది. అయినా పైకి నవ్వక "ఇప్పటికీ నూలు వడుకుతున్నారా సార్?" అని అడిగాడు

"నూలు వడక్కపోతే నాకుతోస్తుందా నాయనా! నాకూ నా రాట్నానికి ఒకేసారి విశ్రాంతి" అన్నారు నారాయణరావుగారు

రాగన్న ఆశ్చర్యపోయినవాడిలా 'అబ్బ! ఈ కాలంలో కూడా మీ లాంటి వాళ్ళుంటారా అని ఆశ్చర్యమేస్తుంది సార్! ప్రజలిప్పుడు అసలు గాంధీజీనే మరిచిపోయారు. అలాంటప్పుడు ఆయన చెప్పిన సూక్తులు ఎవరు గుర్తు పెట్టుకుంటారు? ఇప్పుడు మిమ్మల్ని చూస్తుంటే ఆయన ఎలా ఉండేవారో, ఏమేమి చెప్పేవారో అర్థమవుతుంది" అన్నాడు.

నారాయణరావు గారు ఆనందంతో పొంగిపోయారు. అయినా "ఆ మహాత్ముడెక్కడ, నేనెక్కడ? ఆయన పాధధూళి లోని ఒక అణువుకి సరితూగగల అర్హత కూడా నాలో లేదు" అన్నారు.

ఆ తర్వాత తనను తాను మరచిపోయి గాంధీజీ గుణగానం చేస్తూ కూర్చుండిపోయారు. మొట్ట మొదటి సారి తను గాంధీని కలుసుకున్న సందర్భం, ఆ తర్వాత జరిగిన సంఘటనలు అన్నీ ఏకరువు పెట్టడం మొదలెట్టారు.

ఈయన మాటల ప్రవాహానికి అంతంటూ ఉందా-అనిపించింది రాగన్నకు. అయినా తప్పని సరిగా వింటూ కూర్చున్నాడు. మధ్యలో రెండుమూడుసార్లు అడ్డుతగలడానికి ప్రయత్నించాడు కానీ అతనివల్ల సాధ్యం కాలేదు. చివరి కొకసారి ఎప్పుడో ఆయన మాటలు కొంచెం ఆపినట్టు కనిపించగానే "మీరిదంతా ఓ పుస్తకంగా రాసిపెట్టాలి సార్! ఇలా ఊరికే నోటితో చెబితే నాలాంటివాళ్ళు కొంతమంది విని మరిచిపోతారు. ఏం లాభం చెప్పండి? పుస్తకంగా అచ్చువేస్తే మీ ఘనత అందరికీ తెలిసే అవకాశముంటుంది." అన్నాడు రాగన్న ఆయన్ని మరింత ప్రోత్సహిస్తున్నట్టుగా.

"నేనూ అనుకుంటూనే ఉన్నాను రాగన్నా... ఎన్నాళ్ళనుంచో ఆ ఆలోచన నా మనసులో ఉన్నా ఎందుకనో ఇంకా వీలుపడలేదు. తిరిగి పనిచేయడం అలవాటైన నాకు ఓ చోట కూర్చుని రాయడమంటే కుదరకుండా ఉంది. ఎలాగైనా వీలు చేసుకుని రాయాలి." అన్నారు నారాయణరావుగారు ఉత్సాహంగా.

'అబ్బ! ఎంత ఆశ! ఈ ముసలాడు ఇంకా ఎంత కాలం బతకాలనుకుంటున్నాడో!' అనుకున్నాడు లోలోపల రాగన్న. 'ఉపోద్ఘాతం చాలు. ఇక అసలు విషయం ప్రారంభిద్దాం' అనుకుని "మీరిలా ఇంట్లో ఊరికే కూర్చోకూడదు సార్! ఏదైనా పని చేస్తూ ఉండాలి. కనీసం అధికారంలో ఉన్నవారికి సలహాలైనా ఇస్తూ ఉండాలి" అన్నాడు.

'తనకూ, తన మాటకూ విలువనిచ్చే మనుషులింకా ఉన్నారు కదా' అని నారాయణరావుగారు ఎగిరి గంతేసేసంత

చతుర ... లీల



పనిచేసి "దానికేం... ఇవ్వడానికి నేను రెడీయే! కానీ నా సలహాలను ఎవరు పాటిస్తారు చెప్పు?" అన్నారు ఒక్కసారిగా ఆవరించిన నిస్పృహతో.

"ఎందుకు పాటించరు సార్? మీ మాట కాదనగలిగే ధైర్యం ఎవరికుందసలు? బయట పెద్దపెద్ద ఘనకార్యాల మాట అటుంచి ఇక్కడ పేటలోని ప్రజలకు ఉపయోగపడే చిన్నచిన్న పనులైనా చెయ్యొచ్చుగా? 'ఇక్కడివాళ్ళకి ఫలానా సౌకర్యం కావాలి.' అని మీరడిగితే అప్పుడు అధికారులు కళ్ళుతెరిచి ఇటుకేసి దృష్టి సారిస్తారు. అదే మాలాంటి సామాన్యులు అడిగితే ఇటు కన్నెత్తయినా చూడరు" అన్నాడు రాగన్న.

ఇక్కడి వాళ్ళకు కావలసిందేమిటో దానికి తను ఏ విధంగా సాయపడగలడో అర్థంకాక తికమక పడిపోయారు నారాయణరావుగారు. ఆ తర్వాత ఆ మాట రాగన్ననే అడిగారు.

"ఇప్పుడిక్కడి వాళ్ళకి కావలసిన సౌకర్యమేమిటి ?"

"అవసరాలకేం తక్కువ సార్...ఆలోచించి చూస్తే ఎన్నయినా ఉంటాయి. మాటవరసకి చెబుతున్నాను. పార్కు ముందున్న రోడ్డు చూడండి ఎంత ఇరుకుగా ఉందో? అక్కడ యాక్సిడెంట్ జరగని రోజంటూలేదు. అయినా రోడ్డును కాస్త వెడల్పు చేయమని అడిగేవాళ్ళే లేరు ఇక్కడ" అన్నాడు యధాలాపంగా అంటున్నట్టు.

నారాయణరావుగారు కూడా ఆ రోడ్డును

ఎన్నో వేలసార్లు చూశారు. అంత చిన్నరోడ్డుని దాటలేక నానా అవస్థలూ పడేవారు. ఆ రోడ్డును కాస్త వెడల్పుచేస్తే బాగుంటుందేమో అని ఆయనకు కూడా అనేకసార్లు అనిపించింది. కానీ ఇన్నేళ్ళుగా లేనిది ఇప్పుడు తను చెప్పినంత మాత్రాన అయిపోతుందా? - అన్న అనుమానం వేసింది ఆయనకు, తన అనుమానాన్ని రాగన్నతో అన్నారు కూడా.

"అవుతుందోలేదో మీరలా చూస్తూ వుండండి సార్. మీరు ఊరకే ముందు నిలబడితే చాలు. మిగతా పనంతా మేం చూసుకుంటాం. మీరు మమ్మల్ని వెంట బెట్టుకుని వెళ్ళి ప్రెసిడెంటుగారినీ, మినిస్టరు గారినీ చూస్తేచాలు. తక్కిందంతా దానంతటదే జరిగి పోతుంది!" అని రాగన్న ఆయనకు ధైర్యం చెప్పాడు.

ఎన్నోఏళ్ళ తరువాత తానిప్పుడు నాయకుడవబోతున్నందుకు ఆయనకు ఒక్కసారిగా ముప్ఫయ్యేళ్ళ వయస్సు తగ్గిపోయినంత సంతోషమూ, ఉత్సాహమూ కలిగాయి.

"మనం మొదలుపెట్టే వేళ మంచిదై ఆ పనికాస్త నిర్విఘ్నంగా జరిగిపోతేచాలు నేను పిలిచినంత మందిని పోగుచేయడానికి చూస్తాను" అని చెప్పేసి లేచాడు రాగన్న ఎందులోనూ తలదూర్చని నారాయణ రావుగారు ఈపని కోసం నిలబడితే ఆపని తప్పక జరిగితీరుతుందని ఆయన్ని చూసిన మరుక్షణమే అనిపించింది రాగన్నకు. అయితే ఈగొడవంతా నాకెందుకులే అని ముసలాడు ఎక్కడ తప్పుకుంటాడో అన్న భయం మనసులో పీకుతుండడం వల్ల ఆయన్ని కాకా పట్టడం కోసం ఇంత ఓపిక పట్టాడంతే! ఇక ముసలాడు తప్పించుకోలేడనుకుని సంతోషంగా ఈల వేసుకుంటూ అక్కణ్ణించి బయల్దేరాడు రాగన్న.

రాధాకృష్ణను మంచిచేసుకోవడానికి రాగన్న అట్టే కష్టపడనవసరం లేకపోయింది. ఎందుకంటే నలుగురికీ ఉపయోగపడే పని ఏదన్నా చేసి అందరిలోనూ మంచిపేరు సంపాదించాలన్న తహతహ అతనిలో బాగా ఉంది. అందుకనే ఎవరైనా, ఏదైనా మాటఅంటే చాలు అప్పటికప్పుడే ఆపని చేయడానికి సిద్ధపడిపోయేవాడు రాధాకృష్ణ. తండ్రి సంపాదించిన ఆస్తిఉండి పైన ఇంటిఅద్దె వస్తూండడంతో జీవితం సాఫీగా జరిగిపోయేదనికి. అందుకనే కాలేజీచదువు పూర్తికాగానే విఘ్నేశ్వర యువక సంఘం స్థాపించేశాడు. నెమ్మదిగా మితంగా మాట్లాడే రాధాకృష్ణ అంటే శాంతప్ప బ్లాక్‌లోని కుర్రాళ్లందరికీ గౌరవం. పెద్దవాళ్లుకూడా అతన్ని మెచ్చుకుని మంచి కుర్రాడంటారు. వచ్చే ఎన్నికల్లో నిలబడి గెలిచేందుకు ఇప్పట్నుంచీ ఎత్తువేస్తున్నాడని కొందరు గిట్టని వాళ్లంటారు. ఆ మాట అతని చెవిలో కూడా పడినా పట్టించుకోకుండా ఊరుకున్నాడు. అంతేకానీ ఎవరినీ ఏమీఅనలేదు. సంఘంలో ఉన్న ఇతర కుర్రాళ్లు ఆ ప్రస్తావన తెచ్చి "నిజంగానే ఉద్దేశముందా?" అని అడిగినప్పుడు "ఇప్పుడైతే ఆ ఉద్దేశంలేదు కానీ ఇకముందెపుడైనా కలిగితే అప్పుడు నేనే మీతో చెబుతాగా!" అనేశాడు. ఇంతవరకూ అతను ఏ రాజకీయ పార్టీలోనూ చేరలేదు. ప్రస్తుతం అతనికి ఉన్న ధ్యేయమల్లా కీర్తిని సంపాదించడం ఒకటే! ఆ విషయాలన్నీ బాగా తెలిసినవాడవడంచేత రోడ్డుపనిని అతనికి

అంటిగంటివచ్చిన్న ఆలోచన రాగన్నకు వచ్చింది.

రోడ్డు వెడల్పు చేయబోతున్నారన్న వార్త రాధాకృష్ణకూడా విన్నాడు. ఇంకా కొన్నిరోజుల్లోనే పని మొదలెడతారన్న మాటకూడా తెలిసినందువల్ల పురపాలక సంఘమే దీనికి పూనుకుందని అతను అనుకున్నాడు. రాగన్న వచ్చిచెప్పేదాకా తానూ అందులో ప్రముఖపాత్ర వహించవలసివుంటుందని అతను ఊహించనేలేదు. తనంతట తానుగా వచ్చిన ఈ అవకాశాన్ని జారవిడుచుకోవడం ఇష్టంలేక రాగన్న చెప్పగానే వెనకాముందూ ఆలోచించకుండా సరేననేశాడు. "ఎన్నేళ్ళయినా సరే మీపేరు శాశ్వతంగా నిలిచిపోతుంది. ఫలానావారివల్ల ఈరోడ్డు ఇంత విశాలంగా తయారయిందని అందరూ చెప్పుకొంటారు" అని రాగన్న అంటూంటే రాధాకృష్ణ లోలోపలే పొంగిపోయి తనకీ అవకాశం కలిగిస్తున్నందుకు అతని వైపు కృతజ్ఞతాపూర్వకంగాచూశాడు.

పురపాలక సంఘాధ్యక్షుడినీ, మంత్రి గారినీ కలుసుకుని విజ్ఞాపన పత్రం సమర్పించే బృందానికి నారాయణరావుగారు నాయకత్వం వహిస్తారు. ఇంకా ఎవరెవరుంటే బాగుంటుందో మీరే నిర్ణయించుకోండి. అని చెప్పి రాగన్న తను ప్రస్తుతం అజ్ఞాతంగా ఉండి పనులు జరిపిస్తాననీ, అయితే విజ్ఞాపన పత్రాలను మాత్రం తానే తయారు చేస్తాననీ అన్నాడు. పత్రికలతో పాఠకుల ఉత్తరాల శీర్షికకు మాత్రం అతని పేరు మీదే ఉత్తరాలు రాస్తానని రాగన్న అనగానే రాధాకృష్ణకు కీర్తి తన కాళ్ళ దగ్గరికి వచ్చేసినంత సంతోషమైంది.

అసలు అన్నిటికీ రాగన్నే ముందుండి తను అతన్ని అనుసరించవలసి వుంటుందేమోనని మొదట్లో భయపడిన రాధాకృష్ణకు అతను అజ్ఞాతంగా ఉంటానని చెప్పగానే కొండంత బరువు దిగినట్టయింది. తనకు కావలసింది కూడా అదే! ఎందుకంటే ఆ చుట్టుపక్కల ఎవరికీ రాగన్నపట్ల ఏమంత మంచి అభిప్రాయంలేదు. అలాంటప్పుడు అతనితో కలిసి తిరిగితే తనని కూడా అదే దృష్టితో చూస్తారేమోనని అతని భయం. అంతేకాక ఈ పనివల్ల వచ్చే మంచిపేరంతా తనకొక్కడికే చెందాలి; అందులో మరొకరికి వంతు ఉండకూడదు అన్నది అతనికి లోలోపలఉన్న ఆశయం అందుకనే మాతో మీరు కూడా రావాలి' అని మాట వరసకైనా అనలేదు రాధాకృష్ణ. నోరు తెరచి చెప్పుకోక పోయినా అసలు ఆంతర్యం ఇద్దరికీ తెలుసు.



## 7

రాగన్న తనను కలుసుకుని వెళ్ళిన తర్వాత రెండు మూడు రోజులకల్లా రాధాకృష్ణ విఘ్నేశ్వర యువక సంఘం ఆధ్వర్యాన ఒక సభని ఏర్పాటు చేశాడు. పురపాలక సంఘ సభ్యుడిని కూడా ఆహ్వానించాడు. తనకు చెందిన ప్రదేశంలో తనకి తెలియకుండానే సభ ఏర్పాటు చేసినందుకు ఆ సభ్యుడైన శంకరయ్యకి చాలా అసం

తృప్తి కలిగింది. అసలు మొదటినుంచి అతనికి రాధాకృష్ణ ఏదో ఒక పనిచేస్తూ అందరి మెప్పు పొందడం కంటగింపుగానే ఉండేది. రానురాను అతను తనకువిరోధిగా ఎన్నికల్లో నిలబడగలిగిన స్థాయికి ఎక్కడ ఎదిగిపోతాడోనన్న భయంకూడా లోలోపల బాధిస్తుండడమే దీనికి కారణం. ఇక అప్పుడైతే తనని సంప్రదించకుండానే పెద్దపెద్ద వాళ్ళందర్నీ పిలిచి సభఏర్పాటు చేయడమే కాకుండా తనకు ఏ మాత్రం ప్రత్యేకత నివ్వకుండా అందరితో పాటు మామూలుగా ఆహ్వానించినందుకు అతనికి చాలా కోపం వచ్చేసింది. అక్కడికి వెళితే రాధాకృష్ణకు ప్రాధాన్యత నిచ్చినట్లవుతుంది. కాబట్టి తను వెళ్ళకూడదు అని మొదట ఆలోచించినా ఆ తర్వాత వెళ్ళకపోతే జనం తనను అపార్థం చేసుకుంటారేమో అన్న భయంతో వెళ్ళడానికే నిశ్చయించుకున్నాడు. రాధాకృష్ణ ఇలాంటి వాటిల్లో అనుభవం లేనివాడు. అందుకని ఎలాగైనా ఆ సభను తన వైపునకు తిప్పుకోవచ్చును అన్న ఉద్దేశం కూడా అతనిలో లేకపోలేదు.

ఆ రోజు సభకు దాదాపు యాభై మంది దాకా హాజరయ్యారు. విశ్వేశ్వర యువకసంఘ సభ్యులు కొందరు వాలంటీర్లలా బయట నిలబడ్డారు. సభకు అధ్యక్షత వహించ వలసిందిగా రాధాకృష్ణ వచ్చి నారాయణరావుగారిని కోరగానే ఆయన వచ్చి తనకోసం వేసిన కుర్చీలో కూర్చున్నారు. ఒకసారి వచ్చిన వాళ్ళందర్నీ పరికించి చూశారు. తను సభలకు అధ్యక్షత వహించి పాతికేళ్ళపైనే అయింది అనుకుంటూ ఒకసారి తలమీది ఖద్దరు టోపీని సర్దుకున్నారు. ఆ స్థానం తనకు దక్కుతుందేమో అని ఆశపడిన శంకరయ్యకు ఈ ముసలాడొచ్చి ఆ అవకాశం కొట్టేశాడే అని కోపంవచ్చి ఒక మూలగా వెళ్ళి ముడుచుకుని కూర్చున్నాడు.

సభ ప్రారంభమవగానే అసలు ఆరోజు సభ ఎందుకు ఏర్పాటైందో కారణం వివరించాడు రాధాకృష్ణ. గడిచిన పదేళ్ళలో నగరంలోని ఈ ప్రదేశం బాగా విస్తరించి పోతున్న సంగతి ప్రస్తావించి, "నగర విస్తరణకు అనుగుణంగా పురపాలక సంఘం ప్రజలకు సౌకర్యాలు సమకూర్చడంలేదు. బసవపురానికీ, శాంతప్ప బ్లాక్‌కి కలుపుతున్న రోడ్డు చాలా చిన్నది. అక్కడ ఎప్పుడూ ఏదో ఒక యాక్సిడెంట్ జరుగుతూనే ఉంటుంది. కాబట్టి ఆ రోడ్డును వెడల్పు చేయించమని మనం ప్రభుత్వాన్ని కోరాలి. అందుకు మీ సహాయ సహకారాలు ఎంతైనా అవసరం" అని చెప్పి కూర్చున్నాడు. వెంటనే ముగ్గురు, నలుగురు లేచి నిలబడి "రాధాకృష్ణ మాటలు సబబుగానే ఉన్నాయి' అని చెప్పి కూర్చున్నారు. ఇదంతా చూసి శంకరయ్య లోలోపలే ఈర్ష్యపడసాగాడు. నిన్న మొన్న పుట్టి పెరిగిన కుర్రాడు ఏదో చెప్పడంచే-వచ్చిన వాళ్ళందరూ కూడా ఆ మాటలను సమర్థించడం అతను సహించలేకపోయాడు. లేచి నిలబడి రాధాకృష్ణను ఎదిరించి మాట్లాడాలని అనుకున్నాడు కానీ 'అతన్ని ఎదిరించే హడావిడిలో పడి తను చేయబోయే పనేమిటి?' అన్న ఆలోచన రాగానే నోరు మూసుకు కూర్చున్నాడు. సరిగ్గా అప్పుడే శంకరయ్య అవస్థను గమనించినవాడిలా రాధాకృష్ణ "పురపాలక సంఘ సభ్యుడు శ్రీ శంక

రయ్యగారు ఇలా వేదిక మీదికొచ్చి తమ అమూల్యమైన సలహాలను అందిస్తారని ఆశిస్తున్నాను' అన్నాడు. శంకరయ్య విధి లేక లేచి నిలబడి చుట్టూ చూశాడు. వేదిక దగ్గరికెళ్ళి ''ఇక నేను కొత్తగా చెప్పవలసిందేముంది? అందరూ అంటున్నట్టు మన రోడ్డును తప్పక వెడల్పు చేయాల్సిందే! ఈ విషయం నేను మా మీటింగులో ప్రస్తావించి ఈ పని జరిగితీరాల్సిందేనని ఒత్తిడి చేస్తాను'' అన్నాడు. చప్పట్లుమార్మోగాయి. 'ఎలాగైతేనేం చప్పట్లు కొట్టించుకోగలిగాను కదా!' అని లోలోపలే సంతృప్తి పడి వచ్చి కూర్చున్నాడు శంకరయ్య.

బయట నిలబడిన కుర్రాళ్ళు శంకరయ్య మాటలు విని ముసిముసిగా నవ్వుకున్నారు. అతను ఇంతవరకూ ఒక్కసారైనా పురపాలక సంఘం మీటింగులో మాట్లాడిన పాపాన పోలేదు. ఇంకముందు కూడా మాట్లాడతాడన్న నమ్మకమూ లేదు. ఆ సంగతి అక్కడ సమావేశమైన వాళ్ళందరికీ తెలుసు.

శంకరయ్య తరువాత ఇంకెవరూ మాట్లాడ్డానికి ముందుకు రాలేదు.

''ఇంకెవరైనా మాట్లాడదల్చుకున్న వాళ్ళు మాట్లాడవచ్చు'' అన్నారు అధ్యక్ష పీఠాన్ని అలంకరించిన నారాయణరావు గారు.

బయటనిలబడిన కుర్రాళ్ళలో ఒకతను గబగబా లోపలికొచ్చి ''ఇక్కడ సభలో నిలబడి మాట్లాడినందువల్ల ఒరిగేదేమీ ఉండదు. కాబట్టి రోడ్డు వెడల్పు చేయడం కోసం సత్యాగ్రహం చేయడానికైనా మనం సిద్ధపడాలి. మా విఘ్నేశ్వర యువకసంఘ సభ్యులందరం అందుకు రెడీ!'' అని ఆవేశంగా మాట్లాడి మళ్ళీ బయటికి వెళ్ళిపోయాడు. అందరూ అతని మాటలకు దిగ్భ్రాంతులయ్యారు.

''ఛ! ఛ! ఇప్పుడే ఎందుకు ఆమాట'' అన్నారెవరో.

''ఇప్పుడే సత్యాగ్రహం మాట ఎత్తకూడదు మనం. అంతగా అవసరమైతే ఆ తర్వాత ఆలోచించి ఓ నిర్ణయానికి వద్దాం. ప్రస్తుతం మనం చేయవలసిన ముఖ్యమైన పనులు ఏమిటంటే – కొంత మంది సరైన మనుషులను ఎన్నుకుని ఒక బృందాన్ని ఏర్పాటు చేయడం; ఆ తర్వాత ఆ బృందం వెళ్ళి పురపాలక సంఘం అధ్యక్షుణ్ణీ, మంత్రిగారినీ కలుసుకోవడం. మనకు ఈ రోడ్డు విశాలం కావడం ఎంత అవసరమో వాళ్ళకి గట్టిగా తెలియచెప్పాలి, వాళ్ళు ఒకసారి ఇక్కడికి వచ్చి చూసి పరిస్థితి ఏమిటో తెలుసుకుంటే బాగుంటుంది. ఇక్కడికి వచ్చి చూసిన తర్వాత కూడా వాళ్ళు పట్టించుకోకపోయినట్లయితే అప్పుడు మనం చేపట్టవలసిన కార్యక్రమం గురించి ఆలోచిద్దాం'' అన్నారు నారాయణరావుగారు

దాంతో సత్యాగ్రహం మాట విని భయపడిపోయిన వాళ్ళందరికీ మళ్ళీ ధైర్యం వచ్చింది.

''నారాయణరావుగారు మన అందరికంటే పెద్దవారు. ఆయన చెప్పినట్టే చేద్దాం'' అని ఎవరోలేచి ఆయన మాటను బలపరిచారు అందరికీ ఆ పద్ధతే నచ్చింది.

బృందంలో ఎవరెవరుండాలన్న విషయం చర్చకు వచ్చింది. నారాయణరావు గారు, రాధాకృష్ణ, శంకరయ్య – వీళ్ళు కాక మరో ఏడుగురిని ఎన్నుకుని పది మందిగల బృందాన్ని తయారుచేసుకున్నారు. రెండుమూడు రోజుల్లోనే

ఆ బృందం విజ్ఞాపన పత్రాన్ని సమర్పించడానికి బయలుదేరాలని తీర్మానించబడింది బయట నిలబడిన వాళ్ళలో చంద్ర, నంజుండలు కూడా ఉన్నారు. సభ పూర్తికాగానే వాళ్ళు రాగన్న ఇంటికేసి బయలుదేరారు.

*　　　*　　　*

నారాయణరావు గారి నాయకత్వంలో బృందం ముందుగా పురపాలక సంఘాధ్యక్షుణ్ణి కలుసుకుంది. ఆయన అంతా సాంతంగా విని సంగతులన్నీ తెలుసుకున్నారు. విజ్ఞాపన పత్రాన్ని ఒకటికి రెండు సార్లు చదివి "నాలుగైదు సంవత్సరాల క్రితం ఆ రోడ్డును వెడల్పు చేయాలని అప్పటి కమీషనర్ సలహా ఇచ్చారు. ఆ తర్వాత దాని గురించిన ప్రస్తావనే తీసుకురాలేదు ఎవరూ. అప్పటి పురపాలక సంఘాధ్యక్షుడు కూడా ఆ విషయం ఆలోచించలేదనుకుంటా! ఇప్పుడు మీరు రావడం మంచిదే అయిందిలెండి. ఇప్పటికైనా ఆ పని జరుగుతుంది" అన్నారు.

బృందంలో ఉన్నవారి ముఖాలు వికసించాయి.

అంతలో "కాని..."అని ఆయన ఏదో చెప్పబోయి మళ్ళీ ఆగిపోయేసరికి అందరూ ఆయనకేసే చూడసాగారు.

'నేనిలా చెబుతున్నానని మీరు మరోలా భావించకూడదు మరి...ఉన్న విషయం చెబుతున్నానంతే! ఆ రోడ్డు వెడల్పు చేయాలంటే దానికి ఎన్నో సమస్యలున్నాయి! ఎందుకంటారా రోడ్డుకిరువైపులా ఇళ్ళూ, దుకాణాలూ ఉన్నాయి" అని ఆలోచిస్తూ చెబుతున్న ఆయన మాటలకు అడ్డుతగిలి "అబ్బే...మొత్తంరోడ్డంతా అలా లేదు సార్.ఒకవైపు మాత్రం ఎక్కువగా ఉన్నాయి అంతే! ఇంకోవైపు పార్కు, ఖాళీ స్థలమూ ఉన్నాయి" అన్నారెవరో మధ్యలో.



"ఉండొచ్చనుకోండి. ఆఖాళీ స్థలమైనా మనదికాదుగా? ఎవరిదో అయివుంటుంది. రెండు వైపులా ఆక్వైర్ చేసుకోవలసి వుంటుంది రోడ్డుకోసం. అంటే ఖర్చుచాలా అవుతున్నదన్నమాట! నేనైతే ఈ ప్రపోజల్‌ను ప్రభుత్వానికి పంపిస్తాననుకోండి. కానీ డబ్బుతో కూడిన వ్యవహారం కాబట్టి వాళ్ళేమంటారో మరి! ఎందుకైనా మంచిది మీరే ఓ సారి వెళ్ళి మంత్రిగారిని కలుసుకోండి" అని సలహా ఇచ్చారు పురపాలక సంఘాధ్యక్షులు.

"మీరు చెప్పినట్టే మేము వెళ్ళి మంత్రిగారిని కలుసుకుంటామనుకోండి. అయినా మీరు కూడా కాస్త శ్రద్ధ తీసుకుంటే ఈ పని జరక్కపోదు. ఎలాగైనా దయ. తలచాలి" అంటూ నారాయణరావుగారు రెండు చేతులూ జోడించారు. అధ్యక్షులుగారు చప్పున ఆ చేతులను పట్టుకొని "చ! చ! ఎంతమాట. తమరింతగా చెప్పాలా! మీరు ఆజ్ఞాపించాలి. మీ ఆజ్ఞను శిరసావహించడం మా ధర్మం. కానీ సంగతిఇలా ఉందని చెప్పానంతే!" అన్నారు.

దాంతో తాము తలపెట్టిన మొట్టమొదటి పనే విజయవంతంగా ముగిసినందుకు అందరికీ చాలా సంతోషం కలిగింది.

మునిసిపల్ అడ్మినిస్ట్రేషన్ మంత్రిగారు కూడా బృందాన్ని సాదరంగానే ఆహ్వానించారు. "మీరు తలపెట్టిన పని జరిగి తీరాల్సిందే! ఈ విషయంలో భిన్నాభిప్రాయాలకు తావేలేదు" అన్నారు మంత్రి గారు. "కానీ ఆర్థికశాఖ ఏమంటుందో చూడాలి!" అని కాసేపు ఆలోచించి తరువాత "అయినా అధికారులతో కలిసి నేనోసారి ఆ రోడ్డును విజిట్ చేస్తానండి" అని హామీ ఇచ్చారు.

* * *

బృందం వెళ్ళివచ్చిన సంగతి అందరికీ తెలుసు కాబట్టి-ఫలితం తెలుసుకోవడానికి అందరూ రాధాకృష్ణ ఇంటికి రావడం మొదలెట్టారు. మరో వారంరోజుల్లో అతని పేరుతో అనేక ఉత్తరాలు వివిధ పత్రికల్లో ప్రచురింపబడ్డాయి. ఇక అక్కడితో రాధాకృష్ణపేరు పేటపేటంతా మార్మోగిపోయింది. ఉన్నట్టుండి తనపేరు ఇంత ప్రసిద్ధిలోకి రావడానికి కారణం నాగన్నే అని రాధాకృష్ణకు తెలుసు. అందుకే అతనంటే గౌరవం అధికమైంది. ప్రతి దానికీ నాగన్ననే సలహాలు అడగడం ప్రారంభించాడు. ఎవరూలేని సమయం చూసి నాగన్న అప్పుడప్పుడు రాధాకృష్ణ ఇంటికి వచ్చి పోతుండేవాడు.

శాంతప్ప బ్లాక్‌లోని గొప్ప గొప్ప వ్యక్తులందరూ ఇప్పుడు రాధాకృష్ణ ఇంటికి రాకపోకలు ప్రారంభించారు. విఘ్నేశ్వర యువకసంఘం ప్రెసిడెంటు కూడా అతనే కావడంతో-తన ఇంట్లోని ఓగదిని సంఘం కోసం కేటాయించి దానికి 'ఆఫీస్' అన్నబోర్డు తగిలించాడు. ఆ పేరుకు తగ్గట్టుగా అందులో కొత్త ఫర్నీచరు, నేలకు కార్పెట్-అన్నీ అమర్చాడు.

* * *

రంగయ్య, వీరన్న, మూడల గిరియప్ప-మొదలైన వాళ్ళందరూ ఈ అభివృద్ధిని గమనిస్తూనేవున్నారు. ఇవన్నీ నాగన్నవల్లే జరుగుతున్నాయని గ్రహించి అతను అడక్కముందే నోట్లుతీసి అతని జేబులో కుక్కుతున్నారు. అంతేకాక అతని సలహావల్లనే దుకాణాల యజమానులందరూ కలిసి అనధికారంగా ఒక

సంఘాన్ని స్థాపించుకున్నారు. పైకి చూడ్డానికి మాత్రం తమకు తీరని నష్టం వచ్చేసిందని వాపోయేవారు. రంగయ్య ఆ సంఘంలో సభ్యులుగా ఉన్న వారి పేర్లు చెప్పినప్పుడు ఒక విషయం రాగన్న గమనించాడు. ఒకవేళ తను సరిగ్గా వినిపించుకోలేదేమోనని మరో సారి పేర్లు చదివి వినిపించమన్నాడు. అతని అనుమానం నిజమే అయింది. ఒక వరస దుకాణాల యజమానులు మాత్రమే అందులో చేరారు. రోడ్డు కటువైపున్న వాళ్లెవరూ ఆ సంఘంలో లేరు. ఎందుకయి వుంటుంది? అని కాసేపు ఆలోచించాడు రాగన్న. రోడ్డు వెడల్పు చేయవలసిన చోట నాలుగైదు ఫర్లాంగుల వరకూ ఎదురు వైపు ఉండేది పార్కు. ఇంకాస్త పైకివెళితే మంతెనకిటుగా ఒక పద్దెనిమిది కట్టడాలు, వాటి పక్కన ఒక పెద్ద గుంట. ఆ కట్టడాల్లో దుకాణాలు మూడో, నాలుగో ఉన్నాయంతే! ఇక తక్కినవన్నీ ఇళ్ళే. పార్కుకిటుగా ఎవరిదో విశాలమైన ఖాళీ స్థలం. ఆ ఖాళీ స్థలం యజమాని ఎవరో కాని ముందు వైపున మూడు కొట్లు కట్టించి, మిగిలిన స్థలాన్ని అలా ఖాళీగానే వదిలేశారు. ఆ స్థలం ఎవరిదో రాగన్న-రంగయ్య నడిగి తెలుసుకున్నాడు. అది శ్రీరంగమ్మ అనే ఆవిడది. ఆవిడకు భర్త కానీ, పిల్లలు కానీ ఎవరూ లేకపోవడంతో ఆ స్థలం మీద ఏమంత ఆసక్తి చూపించక నిర్లక్ష్యంగా అలాగే వదిలేసింది. ఆస్థలానికి అవతల పదిహేను, ఇరవై దుకాణాలున్నాయి. వాటి వెనుక భాగాన ఒక రైస్‌మిల్ ఉంది. పూర్వం రోడ్డుపక్కగా ఆ మిల్ తాలూకు షెడ్‌లుండేవి. ఆ మిల్లు యజమాని రామయ్య ఆ షెడ్లను కూలగొట్టించేసి వరుసగా దుకాణాలూ, మేడమీద ఇళ్ళూ కట్టించేశాడు. మిల్లులోని ఆఫీసు వగైరాలను మేడమీదికి తరలించి, ఆ భాగాన గోడౌన్లు కట్టించాడు. రామయ్య బిల్డింగు తర్వాత మూడురోడ్లు కలిసే ఒక కూడలి. రోడ్డు వెడల్పు చేయాలంటే రామయ్య కట్టించిన దుకాణాలన్నీ నేల మట్టం అయిపోతాయి. వాటిని గనుక కూలగొట్టేస్తే వాటి వెనకాల అసలు ఖాళీ స్థలమంటూ లేనేలేదు. మిల్లులోకి లారీలు వచ్చిపోయేందుకూ, సరుకు దింపడానికీ కొద్దిపాటి స్థలం మాత్రం మిగులుతుందంతే! అక్కడ ఏవిధమైన కట్టడం కూడా కట్టించడానికి వీల్లేదు. పరిస్థితి ఇలా ఉండగా మంచి లాభం వచ్చే దుకాణాలను పడగొట్టడానికి రామయ్య ఎలా ఒప్పుకుంటాడు? కాబట్టి తమ సంఘంలో చేరమని అతన్ని మేము అడగనూలేదు. అతను రానూ రాడు అని రంగయ్య రాగన్నకు వివరంగా చెప్పాడు. అదీకాక తాము చేస్తున్న పనిని అతనికి తెలియకుండా రహస్యంగా ఉంచుతున్నామని కూడా అన్నాడు—ఇదంతా తెలిసిన రాగన్నకు 'ఫరవాలేదే ... రంగయ్య కూడా తెలివిగలవాడే!' అనిపించింది. 'ఆ మాత్రం వ్యవహార జ్ఞానం లేకపోతే ఇంత గొప్పవాడుఅయ్యేవాడేనా?' అని అనుకున్నాడు.

ఈ విషయం తెలిసి రామయ్య లోలోపల తన పలుకుబడిని ఉపయోగించి ఈ పనికి ఎక్కడ అడ్డు తగులుతాడో అన్న భయం కూడా రాగన్నకు లోలోపల పీకుతూనే ఉంది. ఎన్నికలప్పుడు ఒకరికి తెలియకుండా మరొకరికి డబ్బిచ్చి అందరినీ మంచి చేసుకున్నందువల్ల అతనికి



విరోధులెవరూ లేరు. తన ఇల్లు నేలమట్టం కాకుండా ఉండేందుకు అతను ఆ పలుకుబడిని ఉపయోగిస్తాడన్న అనుమానం రాగన్నకు కలిగింది.

ఈ సారి రాధాకృష్ణను కలుసుకున్నప్పుడు రాగన్నకు తన అనుమానం నిజమైందే అని రూఢి అయింది. నారాయణరావు బృందం వెళ్ళి అధికార్లను కలిసి రావడం, ఆ తర్వాత పత్రికల్లో ఉత్తరాల శీర్షికనే లేఖలు అచ్చవడం — ఇవన్నీ చూసి రామయ్య రాధాకృష్ణకు కబురు పంపించాడట! వినాయక చవితి ఉత్సవాలకూ, శ్రీ రామ నవమి ఉత్సవాలకూ రామయ్య ధారాళంగా విరాళాలు ఇస్తూ వుండడంవల్ల రాధాకృష్ణకు అతనంటే ఎంతో గౌరవం. రాధాకృష్ణకు ఉత్సవాలు చేయడం ప్రారంభించిన కొత్తలో రెండు సంవత్సరాలు మొత్తం ఖర్చంతా రామయ్య భరించాడు. ఆ తర్వాత మిగిలినవాళ్ళుకూడా చందాలు ఇవ్వడం ప్రారంభించేసరికి- అవసరమైనంతవరకే ఆయనదగ్గరినుంచి తీసుకునేవాడు రాధాకృష్ణ. తను ఏ పని చేయడానికి తలపెట్టినా దానికి రామయ్య అండదండలుంటాయన్న ధైర్యం ఉంది. రాగన్న సలహా విని రోడ్డు పనిని తన భుజాలమీది కెత్తుకున్నప్పుడు దానివల్ల రామయ్యకు ఇబ్బంది కలుగుతుందేమో అన్న ఆలోచనే అతనికి రాలేదు. కానీ రామయ్య తనని రమ్మని కబురంపగానే విషయం కొంతవరకూ ఊహించగలిగాడు. అందుకనే రెండుమూడు రోజులపాటు అక్కడికి వెళ్ళకుండా తప్పించుకున్నాడు. కానీ నాలుగైదుసార్లు రామయ్య మనిషి వచ్చి తిరిగి పోతుంటే ఇహ తప్పించుకోలేక వెళ్ళాడు.

రామయ్య రాధాకృష్ణను సాదరంగానే ఆహ్వానించాడు. అపురూపంగా వచ్చిన అతిథిలాగాచూసుకొన్నాడు. ఇదంతాచూసి రాధాకృష్ణ మాత్రం లోలోపల చాలా ఇబ్బందిగా ఫీలయ్యాడు. రామయ్య మొదట్లో మామూలుగా మాట్లాడాడు. విఘ్నేశ్వర యువక సంఘం సంగతులన్నీ అడిగి తెలుసుకున్నాడు. "ఏమైనా

సహాయం కావాలంటే అడగండి....ఏ మాత్రం మొహమాట పడకండి" అన్నాడు. అలాగే తన కష్ట సుఖాలను కూడా చెప్పుకొంటూ రెండేళ్ళ క్రితం దుకాణాలు కట్టించడానికి చేసిన లక్షల అప్పు ఇంకా అలాగే ఉందనీ, ఆ దుకాణాల నుండి వచ్చే అద్దె వడ్డీలకు కూడా సరిపోవడం లేదనీ వాపోయాడు. ఎరక్క ఆ వ్యవహారంలో తల దూర్చానని బాధ పడ్డాడు.

రాధాకృష్ణ ఏమనాలో తోచక మౌనంగా వింటూ కూర్చున్నాడు.

"ఇప్పుడు మీరంతా పూనుకుని రోడ్డు వెడల్పు చేయాలని ప్రయత్నిస్తున్నారు. ఆ పని తప్పని నేననడం లేదు. ప్రజల సౌకర్యార్థం అది చాలా అవసరమే. కానీ ఒక పనివల్ల పదిమందికి మంచి జరిగితే ఒకరికైనా కీడు జరుగుతుంది. అది వారి కర్మ. ఎవరేం చేయగలరు?" అంటూ తనకు జరగబోయే ఇబ్బందిని పరోక్షంగా తెలియచేశాడు.

రాధాకృష్ణకు ఉభయసంకటం వచ్చి పడింది. ఇప్పుడు కనుక తను వెనుకంజ వేస్తే అందరూ నవ్వుతారు. కీర్తి రావాలని ఆశపడి మొదలెట్టిన కార్యం వల్లే ఇప్పుడు అపకీర్తి వస్తుంది. అలా కాక తను తలపెట్టిన పనిని పూర్తి చేయిస్తే రామయ్యకు తీరని నష్టం కలుగుతుంది. అసలు తననీనాడు ఇలా నలుగురూ గుర్తించగలిగిన స్థాయికి చేరుకోగలిగాడంటే అది రామయ్య చలవే! మరి ఇప్పుడు చూస్తూ చూస్తూ తానే అతన్ని కష్టాలపాలు చేయగలడా?

రామయ్య రాధాకృష్ణ మొహంకేసి తదేకంగా చూస్తూ కూర్చున్నాడు.

"ఏం చెబితే సరిపోతుందా..." అని కాసేపు ఆలోచించి రాధాకృష్ణ చివరికి తనంతట తానుగా ఇందులోకి దిగలేదనీ, అందరూ వచ్చి అడిగితే కాదనలేక పోయాననీ సంజాయిషీ చెప్పుకొన్నాడు.

రామయ్య మరేం మాట్లాడ లేదు. ఇద్దరూ కాసేపలాగే మౌనంగా కూర్చుండి పోయారు.

ఆ తర్వాత ఇక ఏం చేయడానికీ తోచక రాధాకృష్ణ లేచి ఇంటికి బయలుదేరాడు. అతన్ని గేటు వరకూ సాగనంపడానికి వచ్చిన రామయ్య "మిమ్మల్ని అనవసరంగా ఇబ్బంది పెట్టినందుకు క్షమించండి. నా గురించి కూడా కొంచెం ఆలోచించమని చెప్పడానికే పిలిపించాను మిమ్మల్ని" అని చెప్పి వెనక్కి తిరిగి ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

రాధాకృష్ణ తన సంఘ సభ్యులందర్నీ సమావేశపరిచి ఈ సంగతంతా చెప్పేసరికి వాళ్ళు మండిపడి "ఏం డబ్బిచ్చి మనల్ని కొనాలని చూస్తున్నాడా ఆ రామయ్య? వాడి మాటలు విని మనం ఇప్పుడు వెనకడుగు వేస్తే నలుగురిలోనూ తలెత్తుకుని తిరగలేం" అని ఆవేశంగా కేకలు పెట్టారు. చివరికిచేపట్టిన కార్యాన్ని కొనసాగించ డానికే నిర్ణయించు కున్నారందరూ.

రాధాకృష్ణ ద్వారా ఈ సంగతులన్నీ రాగన్నకు తెలిశాయి. అతనికి రోడ్డు విషయం తట్టినప్పుడు అందరిలా రామయ్య తన చేతికందే మనిషి కాదనే అతని జోలికి పోలేదు. 'ఇప్పుడు అతను కూడా తన దగ్గరికి వస్తే ఇంకా బాగా లాభం పొందొచ్చు' అన్న ఆలోచన వచ్చి ఎంతో సంతోషం కలిగింది రాగన్నకు. కాని ఆ సంతోషాన్ని పైకి వ్యక్తం చేయ

కుంటా "ఆ విషయంలో మీరేం దిగులు పడకండి రాధాకృష్ణగారూ...ఆ రామయ్య గాడు ప్రస్తుతం మనల్ని అపార్థం చేసుకో వచ్చు, కానీ ఆ తర్వాత అన్నీ సర్దుకుంటాయి లెండి" అని రాధాకృష్ణకు ధైర్యం చెప్పాడు.

ఆరోజు రాత్రి రంగయ్య ఇంట్లో జరిగిన పానగోష్ఠిలో రాగన్న ఆ ఉదయం జరిగిన సంగతి చెప్పి "ఆ రామయ్య బాగా పలుకుబడిగల మనిషి. మనం ఇంత వరకూ సాధించినదంతా అతని పలుకుబడివల్ల ఎక్కడ బూడిదలో పోసిన పన్నీరయిపోతుందోనని భయంగా ఉంది. దీనికేదో మార్గం చూడక తప్పదు" అన్నాడు ఆ తర్వాత ఆ మార్గం కూడా తానే సూచిస్తానన్నాడు.

"ఏమో రాగన్నగారూ... అంతా మీ చేతుల్లోనే ఉందిప్పుడు" అని భారమంతా అతనిమీదే మోపేశారు అందరూ.



## 8

మంత్రిగారు తానే స్వయంగా వచ్చి అక్కడి పరిస్థితిని పరిశీలించ గలనని చెప్పి రెండు మూడు నెలలు గడిచిపోయాయి కానీ అటువైపు ఎవరూ వచ్చే సూచనలు కూడా కనిపించలేదు. విఘ్నేశ్వర యువకసంఘ సభ్యులు ఎంత లేదన్నా ఒక ఏడెనిమిదిసార్లు వెళ్ళి పురపాలక సంఘాధ్యక్షుణ్ణి కలుసుకుని వచ్చినా ప్రయోజనం లేకపోయింది. "ఇదిగో...అదిగో..."అంటూ రోజులు గడుపుకుంటూ వస్తున్నారే తప్ప కార్యరంగంలోకి ఎంతకీ దిగడంలేదు. అది చూసి నారాయణరావుగారికి కూడా బెంగ పట్టుకుంది. ఓసారి ముందుకు అడుగు పెట్టిన తర్వాత, ఇప్పుడు అడుగు వెనక్కి తీసుకోడానికి కూడా వీల్లేదు. 'తన చివరి రోజుల్లో మొదలు పెట్టిన ఈ పని పూర్తవకుండానే ఉండిపోతుందేమో' అన్న భయం పట్టుకుందాయన్ని. నాలుగైదు మార్లు రాధాకృష్ణ ఇంటికి కూడా వెళ్ళొచ్చాడు.

రాధాకృష్ణ కొంతమందిని వెంట బెట్టుకుని మళ్ళీ ఒకసారి మంత్రిగారిని సందర్శించి వచ్చాడు. అయినా పరిస్థితిలో మార్పేమీ రాలేదు. ఇలా జరగడానికి రామయ్య పలుకుబడే కారణమేమో అన్న ఊహ వచ్చింది రాగన్న, రాధాకృష్ణలకు మాత్రమే! అయితే రాగన్న ఆ విషయాన్ని నోరు తెరిచి ఎవరికీ చెప్పలేకపోయాడు. ఎందుకంటే ఈ రోడ్డు వెడల్పు చేసే పథకం చేపట్టినప్పటినుంచీ అతనికి హాయిగా గడిచిపోతోంది. ఇప్పుడు ఊరుకుని ఆ విషయాన్ని అంతటితో విరమించుకుంటే తన పాలిటి కల్పవృక్షం కూలిపోతుంది. ఆ తర్వాత చిల్లర డబ్బులకు కూడా వాళ్ళనూ, వీళ్ళనూ బతిమాలాలి. అదీకాక, రంగయ్య, అతని స్నేహితులు తనను ఊరికే వదలరు అన్న విషయం ఆలోచించి నారాయణరావుగారింటికి బయలుదేరాడు.

రోడ్డు పని తల పెట్టకపోవడానికి రామయ్య పలుకుబడే కారణం అన్న సంగతిని రాగన్న చెప్పగానే నారాయణ

రావుగారికి కూడా పట్టలేనంత కోపం వచ్చింది. 'ఎవరేమయి పోతే మనకేం? మనం మాత్రం బాగుంటే అంతే చాలు' అనుకునే వాళ్ళు మహా స్వార్థపరులు అని బాగా తిట్టారు. అయినా గాంధీజీ ప్రసాదించిన అస్త్రం తన దగ్గరుండగా ఇలాంటి స్వార్థపరులకు భయపడి తను ఊరికే కూర్చోవడమా ? అలా ఎప్పుడూ జరగదు. సత్యాగ్రహం చేసే తీరతానని ప్రతిజ్ఞ బూనారు నారాయణరావుగారు.

తను వచ్చిన పని నెరవేరిందని సంతోషించి రాగన్న అక్కణ్ణించి బయల్దేరి తిన్నగా రాధాకృష్ణ దగ్గరికెళ్లాడు.

నారాయణరావుగారు సత్యాగ్రహానికి సిద్ధంగా ఉన్నందువల్ల ఈ అవకాశాన్ని జారవిడుచుకోకూడదనీ, ఒకవేళ భయపడి మనం ఈ అవకాశాన్ని జారవిడుచుకుంటే – శంకరయ్య తన స్వార్థంకోసం దాన్ని చక్కగా ఉపయోగించుకుని ముందుకు రాగలడనీ రాగన్న హెచ్చరించాడు. శంకరయ్య కల్పించుకో బోతున్నాడన్న మాట వినగానే రాధాకృష్ణ చటుక్కున "అయితే ఆయనతో బాటు సత్యాగ్రహానికి నేనూ సిద్ధమే" అన్నాడు.

నారాయణరావుగారు తన నిర్ణయాన్ని తెలుపుతూ మంత్రిగారికి రాసిన ఉత్తరానికి మూడో రోజునే జవాబు వచ్చేసింది.

'వేరే అత్యవసరమైన పనులు తగలడంవల్ల మీ పని వెంటనే చేయలేకపోయాం. మీలాంటి పెద్దలు ప్రజలక్షేమం కోసం తలపెట్టిన కార్యాలను నెరవేర్చడం మా కర్తవ్యం కాబట్టి వారం రోజుల్లో, పరిశీలన కోసం అక్కడికి వస్తున్నాం' అని రాసివున్న ఉత్తరాన్ని నారాయణరావుగారు కనీసం పదిసార్లయినా చదివి వినిపించారు అందరికీ.

మరో రెండు రోజుల్లో ఈ వార్త శాంతప్ప బ్లాకంతా వ్యాపించి చాలాయేళ్ళ తరువాత అక్కడ వాళ్ళందరి దృష్టి ఆయన కేసే మరలేలా చేసింది. ఇంకో రెండు రోజులు గడిచిపోయేసరికి పురపాలక సంఘాధ్యక్షులు రాధాకృష్ణకు ఉత్తరం రాస్తూ మంత్రి గారితో పాటుతను కూడా పరివారంతో సహా వస్తున్నట్టు తెలియచేశారు.

* * *

రోడ్డు పరిశీలన కోసం బయలుదేరిన మంత్రిగారి కారు రైల్వే బ్రిడ్జి దగ్గరికొచ్చేటప్పటికి విపరీతమైన ట్రాఫిక్ వల్ల అయిదారు నిమిషాలసేపు ముందుకు కదలడానికి వీల్లేకుండా అక్కడే నిలిచిపోయింది. దాంతో ఎవరూ వివరించకుండానే అక్కడి పరిస్థితి అర్థమైపోయింది మంత్రిగారికి. అప్పటికే పురపాలక సంఘాధ్యక్షులూ, ఇతర అధికారులూ అందరూ పార్కు దగ్గరికి చేరి మంత్రిగారి రాకకోసం ఎదురు చూస్తున్నారు. మంత్రిగారు వచ్చాక అందరూ కలిసి రోడ్డు పరిశీలనకు బయలుదేరినప్పుడు వాళ్ళను చూడ్డం కోసం జనం గుంపులు గుంపులుగా వచ్చి చేరారు. అంత జనం ఒక్కసారిగా అక్కడ చేరేసరికి వాహనాల రాకపోకలకు అంతరాయం ఏర్పడి చివరికి పోలీసులొచ్చి కల్పించుకోవలసి వచ్చింది. మంత్రిగారు ఆ రోడ్డు పొడుగునా అటూ ఇటూ తిరిగి చూశారు. ఆయన సూచిస్తున్న విషయాలను అధికారులు నోట్ చేసుకుంటూ నడుస్తున్నారు. వంతెన దగ్గరికి వచ్చే



సరికి అక్కడ కొత్తవంతెన నిర్మించాలన్న విషయం మంత్రిగారు గమనించినవారై "సర్వే పూర్తయిన వెంటనే కొత్త వంతెన నిర్మించాలని కోరుతూ ఉత్తరం రాయడానికి నాకు గుర్తుచేయండి" అని తన ఆప్తకార్యదర్శికి చెప్పారు.

పరిశీలన పూర్తయిన తర్వాత అందరూ పార్కులో చేరి, రోడ్డును ఎక్కణ్నించి మొదలెట్టి, ఎంతవరకు వెడల్పు చేయాలి, అన్న అంశాన్ని చర్చించారు. వంతెన కటు వైపుగా ఒక ఫర్లాంగు వరకూ రోడ్డు వెడల్పు చేస్తే చాలు, ఇక అక్కణ్నించి రోడ్డు విశాలంగానే ఉండడం వల్ల అక్కడ చేయనక్కర్లేదు. వంతెన కిటువైపుగా నాలుగు ఫర్లాంగుల వరకూ అందే రామయ్య రైస్‌మిల్ వరకూ మాత్రమే వెడల్పు చేస్తే చాలనీ కమీషనర్‌గారు సూచించగా 'అలాగే' అన్నట్టు మంత్రిగారు తలూపారు. రైస్‌మిల్ ఆవరణ ముగిసే చోట ఒక సర్కిల్ ఉండి అక్కణ్నించి మూడు వైపులకూ రోడ్డు ఉండడం చేత అక్కడ వాహనాల రద్దీ అంతగా ఉండదనీ, కాబట్టి అంతవరకే రోడ్డు వెడల్పు చేస్తే చాలనీ చెప్పినందుకు నారాయణరావుగారూ, ఇతర పెద్దలూ ఒప్పుకున్నారు. చివరికి అలాగే నిర్ణయం అయిపోయింది కూడా! ఇకపోతే 'ఎన్ని అడుగులు వెడల్పు చేయాలి' అని మంత్రిగారు అడిగినప్పుడు ఒక్కొక్కరు ఒక్కో విధంగా అభిప్రాయం వెలిబుచ్చారు. రోడ్డు వెడల్పు చేయటం ఒకటే ముఖ్యం కాదు. అది ఒకే లెవెల్‌లో ఉండ

డం కూడా అవసరం కాబట్టి పాస్తున్న చోట ఇరవైనుంచీ ఇరవై అయిదు అడుగుల వరకూ స్థలం కలుపుకోవాలనీ, అవతలివైపు పదిహేను నుంచీ ఇరవై అడుగుల వరకూ వెడల్పు చేస్తే - అప్పుడు ఎన్ని వాహనాలైనా హాయిగా సంచరించవచ్చునని మంత్రిగారు ఉద్ఘాటించారు.

మంత్రిగారే అలా ఒక అభిప్రాయం వ్యక్తపరిచిన తర్వాత దానికిక తిరుగు లేదుకదా! మారు మాట్లాడకుండా అందరూ ఒప్పుకున్నారు. అంతలో ఎవరో అక్కడ ఒక మార్కెట్ నిర్మించడం ఎంతైనా అవసరమనీ, ఏ కూరగాయలు కావాలన్నా, ఓ పళ్ళు తేవాలన్నా రెండు మూడు మైళ్ళవరకూ వెళ్ళవలసి వస్తుందనీ విన్నవించుకున్నారు. ఇక్కడే గనుక మార్కెట్ నిర్మిస్తే ఇక్కడి వాళ్ళకేకాక బసవపురం, ఇంకా ఇతర ప్రాంతాల ప్రజలక్కూడా చాలా సౌకర్యంగా ఉంటుందని అన్నారు. మంత్రిగారు కమీషనర్ గారికేసి చూశారు. కమీషనర్ గారు నోరు తెరిచేంతలోనే-ఈ అవకాశం పోగొట్టుకోకూడదని భావించి శంకరయ్య "ఇక్కడో మార్కెట్ నిర్మించాలని నేను కూడా మీటింగుల్లో ఒత్తిడి చేస్తూనే ఉన్నాను సార్!" అన్నాడు. అంత చెప్పేటప్పటికే అతనికి చెమటలు పట్టేశాయి. కండువాతో మొహం తుడుచుకుంటూ తను మంత్రిగారితో మాట్లాడడాన్ని జనం గమనించారో లేదో అన్నట్టు ఒకసారి అందర్నీ చూశాడు.

"అయితే దానికో స్థలం చూడండి" అని మంత్రిగారు శంకరయ్యతో చెప్పారు.

అంతలో ఆయనదృష్టి శ్రీరంగమ్మకు చెందిన స్థలం మీద పడింది.

"చూడండి. అక్కడ అంత ఖాళీ స్థలం ఉందికదా-దాన్ని అక్వైర్ చేసుకోవచ్చునను కుంటా!" అన్నారు.

మళ్ళీ అందరూ అంగీకార సూచకంగా తలూపారు.

మంత్రిగారు బయలుదేరారు. కారెక్కే ముందు కమీషనర్ గారి కేసి తిరిగి "త్వరగా సర్వే చేయించి ఆక్వైర్ చేసుకున్నస్థలానికి ఎంత నష్టపరిహారం చెల్లించవలసి వుంటుందో రిపోర్టు తయారుచేసి నాకు పంపండి నెలరోజుల్లోగా ఆ రిపోర్టు నాకు అందాలి" అని చెప్పారు.

ఆయన వెళ్ళిపోగానే అక్కడ చేరిన వాళ్ళందరూ ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

* * *

ఇదంతా జరిగిన నాలుగైదు రోజులకే రోడ్డును సర్వే చేయడానికి ఓ ఏడెనిమిది మంది టేపులు పట్టుకుని వచ్చేశారు. టేపులు చూడగానే-అప్పుడే తమ ఇళ్ళు పడగొట్టేస్తున్నట్టుగా గాభరా పడిపోయారు కొంతమంది. సర్వే చేయడానికొచ్చిన వారిని నానారకాల ప్రశ్నలు వేసి విసిగించారు. దుకాణాదార్లయితే భూమీ, ఆకాశం ఏకమై పోతున్నట్టు గొడవచేసి 'ఇక తమ గతేమిటా' అని నెత్తిన చెయ్యి పెట్టుకుని కూర్చున్నారు.

దుకాణాలు ఖాళీ చేయమని ఉత్తర్వులు వచ్చేలోగా మరో చోటు చూసుకోవడం మంచిదని కొందరు ఆలోచిస్తే, మరి కొందరు 'ఆఁ... వీళ్ళొచ్చి సర్వే చేసినంత మాత్రాన దుకాణాలు పడగొట్టేస్తారా ఏమిటి? ఇలా ఎన్నో చోట్ల సర్వే చేయించారు కానీ అక్కడేం జరిగిందని? అసలుపని మొదలు పెట్టినప్పుడు చూసు

కుందాం. అందరి గతి ఏమవుతుందో మన గతీ అంతే!' అని పైకి డంబాలు పలికినా లోలోపల వాళ్ళకి భయంగానే ఉంది. ఆ భయాన్ని వాళ్ళు ఎంతో ప్రయత్నం మీద పైకి కనపడకుండా దాచుకుంటున్నారన్న విషయం వాళ్ళను చూసిన వారెవరికైనా ఇట్టే తెలిసి పోతుంది.

ఆ దుకాణాల యజమానులు పైకి ఎంత కంగారు నటించినా లో లో ప ల మాత్రం వాళ్ళకెంతో సంతోషంగా వుంది.

ఓ వారం రోజుల పాటు జరిగిన సర్వే పని పూర్తయ్యేదాకా-వచ్చిన వాళ్ళందరికీ జవాబులు చెప్పిచెప్పి రాధాకృష్ణ విసిగి పోయాడు. అంతే అయితే ఫరవాలేదు గానీ, ఆ రోడ్డుమీద తిరగడమే అతనికి పెద్ద కష్టమైపోయింది. ఏ దుకాణంలోకి వెళ్ళినా 'ఏమండీ...మా నోట్లో మట్టి కొడదామని చూస్తున్నారా?' అని ఎత్తి పొడిచేవాళ్ళే. కొందరేమో "చేసే మంచి పని ఎలాగా చేస్తున్నారు...ఆ చేత్తోనే దుకాణం పెట్టుకోడానికి మాకు వేరేచోటు కూడా చూపించండి" అని ప్రాధేయ పడేవారు.

"చూద్దాంలెండి. వెనకాల మళ్ళీ దుకాణాలు కట్టించినప్పుడు మీకే ఇవ్వమని వారికి చెబుతాను" అని చెప్పి తప్పించుకునేవాడు రాధాకృష్ణ.

వాళ్ళ కళ్ళు తుడవడానికే అలా అన్నా తన మాటలో తనకే నమ్మకం లేదు.

దుకాణాదార్లు కూడా అతని మాటలు నమ్ముకుని కూర్చోలేదు. అద్దె చాలా తక్కువగా ఇస్తున్నారు కాబట్టి, తామంటే దుకాణాల యజమానులకు ఏమాత్రం ఇష్టం లేదన్న విషయం వాళ్ళకూ తెలుసు. ఎప్పుడు వీళ్ళ పీడ విరగడైపోతుందా-అని కాచుక్కూర్చున్న ఆ యజమానుల కాళ్ళమీద పడి వేడుకున్నా-కొత్తగా కట్టబోయే దుకాణాలను తమకు ఇవ్వరని కూడా తెలుసు. ఒకవేళ వాళ్ళు ఇచ్చినా అంత అద్దెలు తాము భరించలేరు-ఈ విషయాలన్నీ విన్న తర్వాత రాధాకృష్ణకు ఒక విధంగా చూస్తే వాళ్ళకీ పరిస్థితి రావడానికి పరోక్షంగా తనే కారణమేమోననిపించింది. తను ఈ వ్యవహారంలో జోక్యం చేసుకోకపోయినా బాగుండేదేమోననుకున్నా- 'తను కాక పోతే శంకరయ్యే పూనుకునేవాడు' అన్న సంగతి గుర్తుకు రాగానే అదంతా మరిచి పోయాడు. త న కు తెలియకుండానే అతనిలో 'శంకరయ్య తనకు ప్రత్యర్థి' అన్న భావం పాతుకుపోయింది.

* * *

పళని రాగన్నను బాకీ అడగడం ఏనాడో మానేశాడు, ఇతర దుకాణాదార్లకు పట్టిన గతే తనకూ పట్టవచ్చని కంగారు పడిపోయాడు. రాగన్నను మంచి చేసుకుంటే తన చిన్న కిళ్ళీకొట్టును వాళ్ళ స్థలంలోనే పెట్టుకోనిస్తాడేమో - అన్న ఆశతో రాగన్న కొట్టు దగ్గరికి వచ్చీ రాగానే, అతనడక్కముందే సిగరెట్టు పెట్టె తీసి అందించేవాడు. వాడి అవస్థ చూసి రాగన్నకు జాలేసి కొంతైనా డబ్బు ఇద్దామనే జేబులో చెయ్యి పెట్టేవాడు కానీ ఆ చెయ్యి అలాగే వెనక్కి వచ్చేసేది. "తను కష్టాల్లో ఉన్నప్పుడు తనను చూసి ఎవరూ జాలిపడలేదు. మరిఇప్పుడు తాను మాత్రం ఎందుకు జాలిపడాలి ?" అనుకుని అలాగే వెళ్ళిపోయేవాడు. ఒక రోజు అతను సిగరెట్టు కోసం వచ్చి

న్నప్పుడు పళని చేతులు నులుముకుంటూ తన కోరికను అతని ముందుంచాడు.

"ఆ సమయం వచ్చినప్పుడు చూద్దాం లే, ఇప్పుడేం తొందర?" అని రాగన్న అనగానే తనకు స్థలం దొరికినా దొరక వచ్చన్న ఆశ అతని మనసులో మొలకెత్తింది.

'ఈ పేటలో జరుగుతున్న వ్యవహారాలన్నీ తనకు ఉద్వాసన చెప్పడానికే!' అని శంకరయ్య చాలా భయపడిపోయాడు. తను కూడా వాళ్ళల్లో ఒకడని నిరూపించుకోవడానికి వాళ్ళతో కలసి మెలిసి తిరిగినా ఎవరూ తననసలు పట్టించుకునేవారే లేరు. ఇది అతని భయాన్ని మరింత ఎక్కువ చేసింది. చివరికి అద్దెకున్న దుకాణాదార్లను అందరూ నిర్లక్ష్యం చేయడం చూసి తను వాళ్ళకు మార్గదర్శకుడవ్వాలని నిశ్చయించుకున్నాడు.



# 9

రెండు మూడు నెలలు గడిచిపోయాయి.

ఆ రోడ్డు ఎప్పటిలాగే ఉంది. అది వెడల్పయ్యే సూచనలుకూడా కనిపించడం లేదు. అలా జరగడానికి కారణం — రామయ్యేనన్న పుకారు అంతటా వ్యాపించింది. బృందం మళ్ళీ ఆఫీసుల చుట్టూ తిరిగింది.

'మా వల్ల ఆలస్యమేమీ జరగలేదు. మేము మంత్రిగారికి రిపోర్టు ఎప్పుడో పంపించేము' అన్నారు కమిషనర్ గారు.

మళ్ళీ వెళ్ళి మంత్రిగారిని కలుసుకున్నప్పుడు ఆయన ఆ ఫైలు ఆర్థిక శాఖలో ఉన్నట్టు చెప్పి, ఆర్థికశాఖమంత్రి గారిని త్వరలోనే కలుసుకుని మాట్లాడ తానని చెప్పారు.

ఈ పని అసలు జరగనే జరగదేమో అన్న భయం పట్టుకుంది నారాయణరావు బృందానికి. కానీ అద్దెకున్న దుకాణా దార్లకు మాత్రం ఈ సంగతి ఎంతో ఊరట కలిగించింది. అదంతా తానే చేశానని గొప్పలు చెప్పుకున్న శంకరయ్య 'ఇక మీరేం దుకాణాలు ఖాళీ చేయాల్సిన అవసరం లేదు' అని వాళ్ళకు అభయం ఇచ్చేశాడు.

వ్యవహారం బెడిసి కొడుతుందేమోనని భయపడుతున్న రంగయ్యకూ, అతని మిత్ర బృందానికీ రాగన్న ఎన్నో విధాలుగా ధైర్యం చెబుతున్నాడే కానీ రాను రాను అతనిలో కూడా అనుమానం నానాటికీ బలపడిపో సాగింది. అసలు రోడ్డు వెడల్పయినా కాకపోయినా మొత్తానికి ఏదో విధమైన కార్యకలాపాలు జరుగుతూంటే అతనికి నిశ్చింతగా ఉండేది. ఆ పేరు చెప్పుకొని తాను హాయిగా బతికిపోయేవాడు. కానీ ఏమీ జరక్కుండా స్తబ్దంగా ఉండిపోతే ప్రజలు తనను నమ్మేదెలా? వాళ్ళను మభ్యపెట్టేదెలా? ఇక తను మళ్ళీ చిల్లర డబ్బులకోసం వాళ్ళనీ, వీళ్ళనీ ఆశ్రయించాలి కాబోలు! ఇప్పుడు ఏంచేయడం?" అని మద్ద, సంజుండలతో కలిసి సమాలోచన జరిపాడు. వాళ్ళు మాత్రం ఏం ఉపాయం చెప్పగలరు అతనికి? అతను చెప్పినపని చేయడమే తెలుసుకానీ వాళ్ళకు సొంతంగా ఆలోచించి సలహా ఇచ్చేటంతటి తెలివి

తేటలు లేవు.

"మీ బుర్రే మొండికేసిందంటే ఇక మేమేపాటి రాగన్నా!" అనేశారు.

"ఛీ! మీ వల్ల ఒక్క పైసా ప్రయోజనం కూడాలేదు నాకు. ఊరికే మిమ్మల్ని పట్టుకుని నేను ఏడవాలంతే!" అని రాగన్న విసుక్కునేసరికి— 'అతని మనసు బాగాలేదని' గ్రహించి వాళ్ళు అక్కణ్ణించి చల్లగా జారుకున్నారు.

'తనను ఇంకా కొంతకాలంపాటైనా పోషిస్తుందనుకున్న రోడ్డు ఇలా మధ్యలోనే తనను వదిలేస్తుందనుకోలేదు' అనుకుంటూ సిగరెట్టు వెలిగించి ఆ రోడ్డుకేసే చూస్తూ నిలబడ్డాడు రాగన్న. దాదాపు పది పదిహేను నిమిషాలు గడిచాయేమో ఇంతలో జనమంతా ఉన్నట్టుండి రైల్వే బ్రిడ్జికేసి పరుగెత్తుతూండడం కనిపించింది. ఎవర్నో ఆపి ఏం జరిగిందని అడిగాడు రాగన్న. "ఏమో... నాకూ తెలీదు అందరూ పరుగెడుతూంటే నేనూ చూద్దామని వెళ్తున్నాను" అంటూ ఆ వ్యక్తి మళ్ళీ పరుగెత్తసాగాడు. కుతూహలం ఆపుకోలేక తనూ గబగబా నడిచి అక్కడికి చేరుకున్నాడు. వంతెన మీద అటు చివరన వందల కొద్దీ జనం పోగయిపోయారు చూస్తుండగానే. రాగన్న అందర్నీ తోసుకుంటూ వెళ్ళి చూసేసరికి ఒక ట్రాఫిక్ పోలీసువాడు నెత్తురు మడుగులో పడివుండడం కనిపించింది... కాస్త దూరంలో ఒక లారీ ఆగివుంది. ఆ లారీ డ్రైవర్ని జనం పారిపోకుండా గట్టిగా పట్టుకున్నారు. మరి కాసేపట్లోనే పోలీసులొచ్చి జనాన్ని చెదరగొట్టి ఆ డ్రైవర్ని తమ అధీనంలోకి తీసుకున్నారు.

"యాక్సిడెంట్ ఎలా జరిగింది?" అని రాగన్న అక్కడ చేరిన వాళ్ళను అడిగాడు. అసలు నిజంగా జరిగిందేమిటో ఎవరికీ సరిగ్గా తెలీదు. కొంచెం దూరాన ఎవరో ఒక వ్యక్తి చుట్టూ చాలామంది జనం పోగయివుండడం చూసి తనూ అక్కడికి వెళ్ళాడు. అక్కడ జరిగిన సంఘటనని అందరికీ వివరిస్తున్నాడతను. ఆ ట్రాఫిక్ పోలీసువాడు మామూలుగా ట్రాఫిక్ కంట్రోల్ చేస్తున్నాడట! ఒక వైపు వాహనాలన్నిటినీ ఆపుచేసి రెండవ వైపు వాటిని వదిలేసరికి రెండు మూడు కార్లను ఓవర్ టేక్ చేయాలని ప్రయత్నించిన లారీవాడు తిన్నగా ఆ పోలీసు వాడిమీదినుంచే వెళ్ళిపోయాడట! ఆ దృశ్యం చూసి పోలీసులే కన్నీరు కార్చారు. అలాంటి రోడ్డు ప్రమాదాలు, చావులు వాళ్ళకేమీ క్రొత్తకాకపోయినా తమ తోటి ఉద్యోగి— అదీ ఉద్యోగ నిర్వహణలో ఉన్నప్పుడే ఇలా దుర్మరణం పాలవడం వాళ్ళను కదిలించేసింది. అడ్డూ, ఆపూ లేకుండా జనం అక్కడ పోగైపోతున్నా వాళ్ళను వారించే స్థితిలో కూడా లేరు వాళ్ళు. ట్రాఫిక్ పోలీస్‌కే ఈ గతిపడితే ఇక మామూలు మనుషుల సంగతేమిటి?— అని భయభ్రాంతులైపోయారు ప్రజలు. ఆ పోలీసువాడి శవాన్ని చూస్తుంటే కడుపు తరుక్కుపోయింది అందరికీ. అతనుమంచి వయసులో ఉన్నవాడు. పాపం పెళ్ళయిందో లేదో అని ఒకరంటే, మరొకరు 'పెళ్ళయి పిల్లలున్న వాడయితే అతని పెళ్ళాం, పిల్లల గతేమిటి?' అన్నారు. ఇలా ఎవరికి తోచినట్టు వాళ్ళనుకోసాగారు. ఆదృశ్యాన్నిక చూడలేక రాగన్న అక్కడినుంచి వచ్చేశాడు.

ఆరోజు సాయంకాలం రంగయ్య కలి

సినప్పుడు ముందు యాక్సిడెంట్ సంగతే ప్రస్తావన కొచ్చింది. రాగన్న మరణించిన పోలీసువారి గురించి సానుభూతిగా మాట్లాడి "మొత్తానికి ఈ రోడ్డుపని ఒక మనిషిని బలి తీసుకుంది" అన్నాడు.

ఆ మాటకు నిర్ఘాంతపోయి రంగయ్య "ఏమన్నావు?" అని అడగ్గానే "పాపం! ఇంకా చిన్నవాడు జీవితంలో ఇంకా ఎన్నో చవి చూడాల్సినవాడు ఇలా అర్థాంతరంగా పోవడమేమిటి చెప్పండి, అదే అంటారు చూడండి. ఏదైనా పని మొదలుపెట్టే ముందు అది బలి కోరుతుందని. ఆ మాట ఎంత వరకూ నిజమోకానీ మన రోడ్డయితే ఆ కుర్రాణ్ని బలి తీసుకున్నమాట నిజం. ఇక మన పని నిరాటంకంగా సాగిపోతుందిలెండి" అన్నాడు.

రాగన్న మేధాశక్తికి రంగయ్య అబ్బుర పడిపోయాడు. ఆ మర్నాడు అన్ని పత్రికల్లోనూ అక్కడ జరిగిన ప్రమాదం తాలూకు ఫొటోలూ, వార్తలూ ప్రచురించబడ్డాయి. డ్యూటీలో ఉన్న పోలీసువాడిని అతని డ్యూటీయే బలితీసుకున్న ఆ వార్తను పాఠకుల హృదయాలు కరిగిపోయేలా వర్ణించారు విలేకరులు. ఒక పత్రికైతే ఇంకో అడుగు ముందుకెళ్ళి అసలీ ఘోరం జరగడానికి ఆ రోడ్డు మరీ అంత ఇరుకుగా ఉండడమే కారణమనీ, ఇకనైనా అధికారులు కళ్ళు తెరిచి తగిన జాగ్రత్తలు తీసుకోకపోతే మరెన్నో ప్రాణాలు బలయిపోయే అవకాశం ఉందనీ' అధికారవర్గాన్ని విమర్శించింది.

రాగన్న ఆ పత్రిక పట్టుకుని నారాయణరావుగారి దగ్గరికి వెళ్ళాడు. అంతకు ముందే ఆ వార్తలన్నీ చదివిన నారాయణరావుగారు రాగన్నని చూడగానే "ఛ! ఛ! ఎంత ఘోరం?" అని నొచ్చుకున్నాడు.



"అన్యాయం, చాలా అన్యాయం" అని ఆ పోలీసు వాడిని గురించి తెగ బాధపడి పోయారు.

"చూశారా సార్......మనమంతగా గొంతులు చించుకున్నా ప్రయోజనం లేక పోయింది. అప్పుడేగనుక రోడ్డును వెడల్పు చేసి వుంటే ఇప్పుడీ దారుణం జరిగేది కాదు గదా!" అన్నాడు రాగన్న ఆవేశంతో.

"అవును నిజమే. కానీ ఈ మాట అధికారుల చెవికెక్కాలి కదా!" అన్నారు నిస్పృహతో నారాయణరావుగారు. ఆ తర్వాత "ఇక ఇలా చూస్తూ ఊరుకుంటే లాభంలేదు రాగన్నా......సత్యాగ్రహం చేయాల్సిందే!" అన్నారు మళ్ళీ.

ఆ మాటకు రాగన్న బదులు చెబుతూ సత్యాగ్రహం మాట ఇప్పుడే తలపెట్టనవసరంలేదు. నారాయణరావుగారూ...! నిన్నటి ప్రమాదంలో చనిపోయింది ఒక పోలీసువాడు కాబట్టి దానికి మొత్తం పోలీసు డిపార్టుమెంటే బాధపడుతోంది. ఇకముందు అలాంటి దుర్ఘటనలు జరక్కుండా ఉండడానికి తగిన జాగ్రత్తలు తీసుకుంటుందన్న నమ్మకం నాకుంది. ఇప్పుడు వెళ్ళి మనం ఎవరినైనా పెద్ద పోలీసాఫీసరును కలుసుకుంటే ఆయన మనకు సహాయం చేస్తారు. ఇక్కడ రోడ్డువెడల్పు చేయడం ఎంత అవసరమో మంత్రిగారికి తెలియచేస్తారు. అలాగే రైల్వే బ్రిడ్జి గురించి రైల్వే శాఖను కోరినాకోరవచ్చు. కాబట్టి మనం ఈ అవకాశాన్ని జారవిడుచుకోకూడదు' అని తన మనసులో ఉన్న ఆలోచనని చెప్పాడు.

నారాయణరావుగారికి కూడా ఈ పద్ధతి నచ్చింది.

"సరే అయితే అలాగే చేద్దాంలే!" అన్నారు.

రాగన్న అక్కణ్నించి బయల్దేరి రాధాకృష్ణ దగ్గరికివెళ్ళి అతనితో కూడా ఈ విషయాలన్నీ చెప్పాడు.

* * *

నారాయణరావు బృందంవెళ్ళి ఐ.జి.పిని కలుసుకుంది. ఆ బృందం వారు చెప్పిన మాటలు విని ఐ.జి.పి. ఆశ్చర్యపోయారు. 'అసలు తమ శాఖకు చెందని విషయాలను తనతో చెబుతున్నారేమిటి వీళ్ళు?' అనుకున్నారు. ఒక్క క్షణం ఏం జవాబు చెప్పాలో తోచలేదు ఆయనకు. వాళ్ళను ఆట పట్టించాలని ఆలోచన వచ్చింది కానీ నారాయణరావుగారి ముఖం చూసి ఊరుకున్నారు. అయినా కొంచెం గంభీరంగానే అన్నారు."నాకూ దీనికీ సంబంధమే లేదు. మరి నేను మీకే విధంగా సాయపడగలనంటారు?"

"వంతెన మీద యాక్సిడెంటులో పోలీసు చనిపోయిన విషయాన్ని పాయింటుగా తీసుకుని రోడ్డు వెడల్పు చేయడానికి ఆ శాఖ వారిమీద ఒత్తిడి తీసుకురావచ్చు. అక్కడి ట్రాఫిక్‌ను కంట్రోల్ చేయడానికి ఆ రోడ్డును వెడల్పు చేయడం తప్ప మరో మార్గం లేదని హెచ్చరించవచ్చు" అన్నారు నారాయణరావుగారు.

అదీ నిజమేననిపించింది ఐ.జి.పి.గారికి ఆ రోజు ప్రమాదం జరిగిన చోటికి తనూ వెళ్ళాడు. అంతే కాకుండా మరణించిన పోలీసువారి కుటుంబానికి నష్టపరిహారం ఇప్పించాలని కూడా అనుకున్నాడు. ఆ తర్వాత అక్కడ ట్రాఫిక్‌ను కంట్రోల్ చేయడానికి మరింత కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేయవలసిందిగా కింది అధికారు

లకు ఉత్తర్వులిచ్చి వచ్చేశాడు. అంతేకానీ ఆ రోడ్డువైపునకు తన దృష్టి పోలేదు.

మొదట ఆ విషయాన్ని తనతో ప్రస్తావించినప్పుడు తనకిందులో ఏమీ సంబంధంలేదని అనిపించింది కానీతర్వాత ఇప్పుడు ఆలోచిస్తే తను ఇందులో చేయవలసిన సహాయం ఎంతైనా ఉందనిపించింది.

"క్షమించండి ముందు మీ మాటల్లోని అంతరార్థం గ్రహించ లేకపోయాను. మీరు చెప్పినదాంట్లో ఎంతో నిజముంది. నేను చేయగలిగిన సహాయం చేయడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను' అన్నారు.

రెండు మూడు రోజుల్లోగా శాంతప్ప బ్లాక్‌లోని ప్రజలకు ఒక ఆశ్చర్యకరమైన వార్త తెలిసింది. అదేమిటంటే బస్సులు, లారీలు వగైరా భారీ వాహనాలు వంతెన మీద సంచరించకూడదని పోలీసు శాఖ నిషేధించిందన్నది. ఆ వాహనాలన్నీ ఇకముందు మైలు దూరం చుట్టు తిరిగి ఇంకో వంతెనమీద నుంచి రావాలి. హఠాత్తుగా వచ్చిన ఈ రూల్సువల్ల బస్‌స్టాపులన్నీ మారిపోయి జనం తికమక పడిపోయారు. దాంతో మొత్తం పేటంతా గగ్గోలెత్తి పోయింది. ప్రజలు తమ ఇబ్బందులను తెలియచేస్తూ పురపాలక సంఘానికీ, రోడ్డు రవాణా సంస్థకూ ఉత్తరాలు రాశారు. కొందరు పత్రికల్లో కూడా ఉత్తరాల శీర్షికకింద ఉత్తరాలు రాశారు.

మరో వారం రోజులు తర్వాత పోలీసు శాఖ ప్రజల సౌకర్యార్థం ఆ నిషేధాజ్ఞను కొంచెం సడలించింది. సిటీ బస్సులు మాత్రం వంతెన మీదుగా వెళ్ళవచ్చని ఆర్డర్సు వచ్చాయి. మిగిలిన భారీ వాహనాల విషయంలో మాత్రం ఎవరెంత ప్రాధేయపడినా నిషేధాజ్ఞను సడలించలేదు.

ఏ కారణంవల్లనైతేనేం మొత్తానికి మరో రెండు వారాల్లో రోడ్డు వెడల్పు చేసే పనిని మొదలుపెట్టే సూచనలు కనిపించాయి. రోడ్డు కిరువైపులా ఇరవై గజాల స్థలాన్ని అక్వైర్ చేసుకుని దానికి నష్టపరిహారం చెల్లించ బడుతుందనీ, అందుకని మూడు నెలల్లోగా దుకాణాదార్లందరూ తమతమ దుకాణాలను ఖాళీ చేయాలనీ అందరికీ నోటీసు లొచ్చాయి.

ఏడెనిమిది నెలలుగా మాటల్లోనే ఉండిపోయిన విషయం ఇప్పుడు చేతలదాకా వచ్చింది. రంగయ్య, అతని మిత్రబృందమూ కన్న కలలన్నీ నిజమయ్యాయి. కానీ పైకి మాత్రం అద్దెకున్న దుకాణాదార్ల పరిస్థితికి జాలిపడుతున్నట్టుగా నటించి మొసలికన్నీరు కార్చారు.

"అయ్యో... మీకెంత కష్టం వచ్చిపడింది. ప్రభుత్వం వారే ఆర్డర్లు పంపించిన తర్వాత ఇక మేం మాత్రం ఏం చేయగలం చెప్పండి? ఇప్పటి నుంచీ చూసుకుంటే గడువు పూర్తయేసరికి మీకు వేరే చోట దుకాణాలు అద్దెకు దొరకొచ్చు!"

వాళ్ళ మాటలన్నీ నిజమే కాబోలనుకున్నారు దుకాణాదార్లు.

"మీరు మమ్మల్ని అన్యాయం చేయకూడదు సుమండీ... కొత్త దుకాణాలు కట్టించిన తర్వాత మళ్ళీ మాకే ఇవ్వాలి" అని ప్రాధేయ పడ్డారు.

"ఆఁ... అదంతా ఎప్పటి మాటో! ప్రస్తుతం మీరయితేవేరే చోట చూసుకొనడమే మంచిది" అన్నారు యజమానులు.

తమ దుకాణాలు వెంటనే ఖాళీచేయాలా లేక ఇంకా కొంత కాలం గడపడానికి

వీలవుతుందా-అని దుకాణదార్లు ఎవరెవరినో అడిగి చూశారు. శంకరయ్య తమకు సాయపడ గలడేమో అని ఆశతో ఆయన వెంట తిరిగారు. ఓ రోజు శంకరయ్య 'ఇక లాభం లేదని' వాళ్ళతో తేల్చి చెప్పేశాడు. తను ఇద్దరు ముగ్గురు ప్లీడర్లను కలుసుకుని సలహా అడిగాననీ, వాళ్ళు చెప్పిందేమిటంటే-ప్రజలకు ప్రయోజన కరమైన పనులు తలపెట్టినప్పుడు ప్రభుత్వం ప్రయివేటు స్థలాలను కానీ, ఇళ్ళనుకానీ స్వాధీనం చేసుకోవచ్చనీ, ఆ విషయంలో అభ్యంతరం చెప్పడానికి వీల్లేదని అన్నారనీ, ఒకవేళ ప్రభుత్వం నష్ట పరిహారంగా ఇచ్చేడబ్బు తక్కువని తోస్తే అప్పుడు మాత్రం కోర్టుకు వెళ్ళే అవకాశం ఉందని తెలిపారనీ చెప్పాడు శంకరయ్య.

ఈ దుకాణాదార్లందరూ తప్పనిసరిగా తమ దుకాణాలను ఖాళీ చేయాలి కాబట్టి. వాళ్ళు ఈ పేట వదిలి దూరంగా వెళ్ళిపోతే అప్పుడు వాళ్ళ ఓట్లు తనకి ఎలాగా అవసరం ఉండదు. అందుకని వాళ్ళ కోసం పాటుబడడం ఒట్టి దండగ- అని ఆలోచించి శంకరయ్య వీలయినంత వాళ్ళ నుంచి తప్పుకు తిరగడం మొదలెట్టాడు. రాధాకృష్ణ ఒంటరిగా కాకుండా ఒక సంఘాన్ని స్థాపించుకుని రోడ్డువెడల్పు చేయడం కోసం పాటు బడుతున్నాడు గనుక-వచ్చే ఎన్నికల్లో అతను పోటీ చేస్తే ఆ సంఘం వాళ్ళందరూ సహాయ పడతారు కాబట్టి, తనుకూడా అలాంటి సంఘాన్నొకదాన్ని స్థాపించుకుంటే బాగుంటుందని ఆలోచించాడు శంకరయ్య. ఆలోచించడం తరువాయి వెంటనే దానికి పూనుకున్నాడు. కొంతమంది కుర్రాళ్ళను అప్పటికప్పుడే పోగుచేశాడు కూడా. సంఘం ఖర్చులన్నీ శంకరయ్యే భరించ గలడు కాబట్టి అతి స్వల్ప వ్యవధిలోనే చాలామంది కుర్రాళ్ళు చేరిపోయారు సంఘంలో.



# 10

అందరికిలాగే తనకూ నోటీసు వచ్చే సరికి రామయ్య బెంబేలెత్తిపోయాడు. మొదట్లో ఇదంతా ఒట్టి బెదిరింపు అని నిర్లక్ష్యంగా ఊరుకున్నాడు. ఒకవేళ అది నిజమే అయినా - డబ్బూ, పలుకుబడీ ఉంటే ఏదైనా సాధించ వచ్చని అతని నమ్మకం. ఇంత వరకూ ఆ నమ్మక ప్రకారమే అంతా జరిగింది కూడా! అయితే ఇప్పుడు మాత్రం అది తలకిందులయ్యే సరికి అతని ధైర్యం సడలి పోయింది. దానికోసం అతను ఇంత వరకూ చాలా డబ్బు ఖర్చు పెట్టాడు. దాంతో తనకు రాబోయే ఆపదను కొన్నాళ్ళ వరకూ ఆపగలిగాడు. కానీ పూర్తిగా నివారించలేక పోయాడు. ఇప్పుడు కూడా మరింత డబ్బు ఖర్చుపెడితే ఇంకా కొంత కాలం వాయిదా పడేలా చేసుకోవచ్చేమో కానీ దానివల్ల ఒరిగేదేమిటి? పూర్తిగా నివారించలేడు కదా! అలా అని ఊరికే చేతులు ముడుచుకుని కూర్చోవానికి కూడా వీల్లేదు. అలా కూర్చుంటే ఇన్నాళ్ళుగా చేసిన ప్రయత్నాలన్నీ విఫలమవ

డమే కాక తను ఎంతో కష్టపడి సంపాదించిన ఆస్తిని చేతులారా నాశనం చేసుకోవలసి వస్తుంది. కొత్తగా కట్టించిన మేడ నేలమట్టం కావడాన్ని ఊహించుకుంటేనే రామయ్యకు ఏడుపొచ్చినంత పనయింది. ప్రభుత్వం నష్టపరిహారం ఇచ్చినా తిరిగి ఇళ్ళూ, దుకాణాలూ నిర్మించుకోడానికి తగినంత స్థలం లేదు. అదే అతని బెంగ.

రెండు మూడు రోజుల పాటు అన్ని పనులూ మానుకునే ఈ విషయం గురించే తీవ్రంగా ఆలోచించాడు రామయ్య. మరో సారి రాధాకృష్ణను పిలిపించి మాట్లాడి చూద్దామనిపించింది. అయితే దానివల్ల ప్రయోజనమేమీ ఉండదనిపించింది. తనకు సహాయం చేయాలన్న ఉద్దేశం నిజంగా రాధాకృష్ణకు ఉన్నట్టయితే ఎప్పుడో ఆ పని నుంచి విరమించుకుని వుండేవాడు. తను అతన్ని ఇంటికి పిలిపించి తన ఇబ్బందులన్నీ ఏకరువు పెట్టిన తర్వాత కూడా ఇలా ముందుకు సాగి కొత్త కొత్త కార్యక్రమాలు తలపెట్టే వాడు కాదు. ఇలా వుండగా ఇప్పుడు మళ్ళీ అతన్ని పిలిపించి మాట్లాడితే మాత్రం ప్రయోజనం ఏముంటుంది? అనిపించింది రామయ్యకు. అసలు ఇందులో అందరికన్నా ముఖ్య పాత్ర వహిస్తున్న వారెవరా అని ఆలోచిస్తే నారాయణరావు గారు గుర్తుకొచ్చారు. కానీ ఆయన తన మాట వినరు, ఎలాంటి ప్రలోభాలకూ లొంగని మనిషి ఆయన. ఇకపోతే ఈ రోడ్డు వెడల్పు చేస్తారన్న వార్త వ్యాపించినప్పటినుండీ ఈ విషయం గురించి ఎవరెక్కువ ఆసక్తి వహిస్తున్నారు అన్నది అప్పుడప్పుడు రామయ్య తెలుసుకుంటూనే ఉన్నాడు. దానికోసం కొందరు మనుషలను కూడా నియమించుకున్నాడు. రాగన్న అప్పుడప్పుడు రాధాకృష్ణ ఇంటికి వెళుతుంటాడనీ, నారాయణరావు గారిని కూడా తరచూ కలుసుకుంటూ వుంటాడనీ, రంగయ్యతో కూడా అతన్ని చాలా సార్లు చూశామనీ చెప్పారు వాళ్ళు. రాగన్న ఎలాంటి మనిషో రామయ్యకు బాగా తెలుసు. చిల్లర డబ్బుల కోసం అతను అలాగా జనంతో కలిసి తిరగడాన్ని తాను ఎన్నోసార్లు చూశాడు. డబ్బిస్తే చాలు ఎలాంటి పని చేయడానికైనా వెనకాడడు అని వాళ్ళూ వీళ్ళూ అనుకుంటూ వుంటే విన్నాడు. ఒకవేళ అతనివల్ల తన పని సులువవుతుందేమోనన్న ఊహ మనసులో మెదిలింది. కానీ తనలాంటి డబ్బూ, పలుకుబడిగల మనిషి వల్లే జరగలేని పని ఆ అణాకానీ మనిషి వల్ల జరుగుతుందా అన్న అనుమానం వచ్చి ఊరుకున్నాడు. ఆ తర్వాత బాగా ఆలోచించి చూస్తే ఇలాంటి పనులకు అలాంటి మనుషులే అవసరమని తోచింది రామయ్యకు. వెంటనే రాగన్నకు కబురంపాడు. ఒకవేళ అతనివల్ల పని జరగకపోయినా తనకు జరిగే నష్టమేమీ ఉండదన్న సంగతి అతనికి తెలుసు.

రామయ్య మనిషి వచ్చినప్పుడు రాగన్న ఇంట్లోనే ఉన్నాడు. రామయ్య దగ్గరినుంచి పిలుపు వస్తుందని రాగన్న ఎప్పుడో ఊహించాడు. 'రేపో మాపో' రావచ్చని ఎదురు చూశాడు కూడా. కానీ డబ్బున్న మనిషి కాబట్టి మొదట్లో తన లాంటి వాళ్ళ అవసరం అతనికి కలగదు. ఇతర ప్రయత్నాలేవీ ఫలించనప్పుడు ఇక చివరి ప్రయత్నంగా తనని పిలిపిస్తాడని అతనికి బాగా తెలుసు. అందుకే ఇప్పుడు

మనిషి వచ్చి పిలవగానే ఏ మాత్రం ఆశ్చర్యపోకుండా నిర్వికారంగా అతని వెంట నడిచాడు.

రామయ్య ఇంట్లో అతనికి ఘనమైన స్వాగతం లభించింది. అపురూపమైన ఆతిథ్యం లభించింది. "షావుకారుగారి పిలుపొచ్చిందంటే ఈ పేదవాడిపై భాగ్యదేవత కరుణించినట్టే!" అని నాటకంలోని డైలాగులా అన్నాడు రాగన్న.

అందులో ఇమిడివున్న అంతరార్థాన్ని ఇట్టే గ్రహించేశాడు రామయ్య. అయినా ఏమీ ఎరగని వాడిలా అతన్ని తన గదిలోకి తీసికెళ్ళి మంత్రాలోచనలు మొదలెట్టాడు. రామయ్య చెప్పిన మాటలన్నీ సావధానంతో విన్న రాగన్న "ఏదైనా మార్గం ఆలోచిద్దాం షావుకారుగారూ. మీరు నా మీద నమ్మకం ఉంచి నా సహాయం కోరుతున్నారూ అంటే నేను కాదనగలనా చెప్పండి? చూద్దాం లెండి! అన్నిటికీ ఆ భగవంతుడే ఉన్నాడు. ఓ వారం రోజులు నాకు టైమిచ్చారంటే నింపాదిగా ఆలోచించి మీకేదైనా ఉపాయం చెబుతాను" అని చెప్పి అక్కణ్నించి వచ్చేశాడు రాగన్న.

రెండు మూడు రోజులు ఎంతగా బుర్ర పాడుచేసుకుని ఆలోచించినా అతనికే ఉపాయమూ తట్టలేదు. అయినా తనిప్పుడు చేస్తున్న పని తనకే విచిత్రంగా తోచింది. రామయ్య బిల్డింగున్న వైపు రోడ్డు వెడల్పు ఇప్పుడున్నంత వరకే ఉండాలి. ఎదుటి వైపు మాత్రం రోడ్డు వెడల్పు కావాలి. అసలీ రామయ్య ఆనాడే తన సహాయం కోరివుంటే ఈపాటికి ఏదో ఒక ఉపాయం ఆలోచించేవాడే. కానీ ఇప్పుడు అందరికీ నోటీసులు కూడా వచ్చేశాక తనుమాత్రం ఏం చేయగలడు? అసాధారణమైన అద్భుత సంఘటన ఏదన్నా జరిగితే తప్ప ఆ ప్రభుత్వం ఆర్డర్ను మార్చడానికి ఎవరివల్లా సాధ్యంకాదు. అయితే అలాంటి అద్భుత సంఘటనను సృష్టించడం ఎలా? ఎంత బుర్ర బద్దలుకొట్టుకున్నా అతనికేమీ తోచలేదు. 'ఒకరికంటే ఇద్దరు మేలు' అన్నట్టు ఇంకెవరితోనైనా కలిసి ఆలోచిస్తే ఏదన్నా తట్టవచ్చేమోననిపించి 'అలాంటివాళ్ళెవరున్నారు?' అని మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. కొత్తవాళ్ళను కలుపుకొని వాళ్ళకి మొదట్నుంచీ కథంతా చెప్పి తంటాలుపడేకంటే 'అన్నీ తెలిసిన పాతవారయితేనే నయం' అనుకుంటూ వుంటే చట్టున రాధాకృష్ణ గుర్తొచ్చాడు. రామయ్యకు విరుద్ధంగా పనిచేయవలసి వస్తున్నందుకు రాధాకృష్ణ లోలోపల పడుతున్న ఆవేదన, ఒక్కోసారి 'తనీ పనిలోంచి విరమించుకుంటే బాగుణ్ణన్న' అతని ఆలోచన–ఇవన్నీ తనకు తెలుసు కాబట్టి ఇప్పుడు తనతో చేయి కలపగలవాడు అతనొక్కడే అనుకుని వెంటనే అతన్ని కలుసుకోడానికి బయలుదేరాడు రాగన్న.

అతను వెళ్ళేసరికి రాధాకృష్ణ యువక సంఘంలోని సభ్యులతో ఏదో విషయం గురించి చర్చిస్తున్నాడు. అక్కడికెళ్ళి కూర్చున్న కాసేపటికే వాళ్ళు మాట్లాడుకుంటున్న విషయం ఏమిటో రాగన్నకు తెలిసిపోయింది.

"వినాయక చవితి ఇంకా నాలుగు నెలలుందికదా! మీరిప్పుడే పని మొదలు పెట్టేశారేమిటి?" అని అడిగాడు రాగన్న.

"మేమెప్పుడూ నాలుగు నెలలముందే పని మొదలుపెడతాం. లేకపోతే అన్నీ

ఏర్పాట్లూ పూర్తి చేసుకోవడం కష్టం" అన్నాడు రాధాకృష్ణ.

పార్కులో వినాయకుణ్ని కూర్చోబెట్టి తొమ్మిది రోజులపాటు కార్యక్రమాలను ఏర్పాటు చేయడంవరకే తను చూశాడు కానీ దానికి వాళ్ళెన్నిరోజుల ముందుగావే పని ప్రారంభిస్తారని మాత్రం అతనికి తెలీదు. కార్యక్రమాలకు పెద్దపెద్ద సంగీత విద్వాంసులు, కళాకారులను ముందే బుక్ చేసుకుంటే తప్ప దొరకరనీ, లేకపోతే వేరేచోట ఒప్పేసుకుంటారనీ, అందుకని అందరికన్నా ముందేవెళ్ళి తను వాళ్ళకు అడ్వాన్సులిచ్చి బుక్ చేసుకుంటాననీ వివరించాడు రాధాకృష్ణ. అడ్వాన్సులు ఇచ్చేందుకు డబ్బు కావాలి కాబట్టి చందాలు వసూలుచేసే కార్యక్రమం కూడా అప్పుడే ప్రారంభించవలసి వుంటుందన్నాడు. ఆ చందాలు వసూలు చేయడానికి కరపత్రాలు అచ్చేయించాలి. అసలీ పాటికి ఆ పని పూర్తయిపోవలసింది - అని కూడా చెప్పాడు. ప్రతి సంవత్సరకంటే ఈ సంవత్సరం ఉత్సవాలు ఇంకా భారీ యెత్తున జరపాలని అందరూ చాలా ఉత్సాహ పడుతున్నారని కూడా చెప్పాడు.

"ఎందుకని? ఈ సంవత్సరం ఏమంత ప్రత్యేకత!" అని అడిగాడు రాగన్న.

"ప్రత్యేకత ఏముంది. ఎప్పుడూ చేసేదేగా? మట్టి వినాయకుడికి బదులు రాతి వినాయకుణ్ని కూర్చోబెడతామా ఏమిటి!" నవ్వుతూ అన్నాడు రాధాకృష్ణ.

రాగన్న బుర్రలో హఠాత్తుగా మెరుపు మెరిసింది. 'అవును నిజమే! ఎందుకు కాకూడదు?' అనుకున్నాడు మనసులో.

ఆ తర్వాత రాధాకృష్ణ చెప్పిన మాటలేవీ అతని బుర్రకెక్కలేదు. తనని ఇన్నాళ్ళుగా వేధిస్తున్న సమస్యకు పరిష్కారం దొరికినట్టయి తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

రాధాకృష్ణ మిత్రులందరూ వెళ్ళిపోయాక రాగన్న అతన్ని పార్కులోకి తీసుకొచ్చాడు. పార్కంతా ఓసారి కలయ తిరిగి బయటికొచ్చి రోడ్డుమీద నిలబడ్డాడు. పార్కు అంచు ఇళ్ళ లెవల్‌కు ఉండకుండా మరో పది అడుగుల దూరందాకా రోడ్డుమీదికి చొచ్చుకు వచ్చింది. పార్కు దాటిన తర్వాత కూడా రోడ్డు వంకరగానే ఉంది. పోనుపోను ఇళ్ళు వెనక్కి ఉండి, రామయ్య బిల్డింగు ఇంకా కొంచెం వెనక్కి ఉంది. ఆ బిల్డింగు లెవెల్ పార్కులోకి ఎంతవరకూ వస్తుందోనని చూపులతోనే అంచనా వేశాడు రాగన్న. ఎంత లేదన్నా పది హేను, ఇరవై అడుగులదాకా ముందుకు చొచ్చుకు వచ్చింది పార్కు. అంతే స్థలాన్నిగనుక రోడ్డుకు కలుపుకుంటే రామయ్య బిల్డింగు యథాప్రకారంగా ఉండగలదని తోచింది రాగన్నకు.

రాగన్న ఎందుకిలా హైరానా పడుతున్నాడో అర్థంకాక రాధాకృష్ణ అతనికేసే అయోమయంగా చూస్తూ నిలబడ్డాడు.

తన ఆలోచనలన్నీ ఒక కొలిక్కి వచ్చిన తర్వాత రాగన్న నింపాదిగావచ్చి నిలబడి సిగరెట్టు వెలిగించుకున్నాడు.

'చుట్టుపక్కల ఎవరన్నా చూస్తున్నారేమో'నని ఒకసారి చుట్టూ కలయచూసి 'ఎవరూ లేరని' నిర్ధారణ చేసుకున్న తర్వాత రాగన్న రాధాకృష్ణకు దగ్గరగా జరిగాడు.

"మనిద్దరం తల్చుకుంటే రామయ్యగారి బిల్డింగు నేలమట్టం కాకుండా చూసుకోవచ్చు" అన్నాడు గబుక్కున.

రాధాకృష్ణ కుతూహలం ఆపుకోలేక మరింత దగ్గరగా జరిగాడు.

రాగన్న చెప్పడం మొదలెట్టాడు. "రోడ్డు వెడల్పు చేయిస్తే మనం అను కున్న పని సాధించినట్టవుతుంది. కానీ రామయ్య ఇష్టా, మతాచారాలకు హాని జర క్కుండా ఉండేలా ఆ పని సాధ్యమయే టట్టయితే ఇంకా మంచిది కదా! అయితే దానికి కొంచెం శ్రమపడాలి. రాతితో వినాయకుడి విగ్రహాన్ని చెక్కించి వినా యక చవితి రోజున పార్కులో దాన్ని మెడవరకూ పాతిపెట్టి పైనుంతా కాస్త మట్టి చల్లేయాలి. అప్పుడు ఇక్కడ వినా యకుడు ఉద్భవించాడని ప్రచారం చేస్తే అందరూ తేలిగ్గా నమ్మేస్తారు. రామయ్య బిల్డింగు లెవెల్‌కు సరిగ్గా విగ్రహాన్ని పాతిపెట్టాలి. తెల్లవారిన తర్వాత విగ్రహం నలుగురి కంటా పడగానే మనం గబగబా వచ్చి మట్టినంతా తవ్వి విగ్రహాన్ని పైకి తీసి పూజలూ, పున స్కారాలూ ప్రారంభించాలి. వినాయకుడు ఉద్భవించాడన్న వార్త అంతలోనే ఊరంతా పాకిపోయి జనం తండోపతండా లుగా వచ్చేస్తారు. ఒకసారి అక్కడ వినాయకుడ్ని స్థాపించామంటే ఇక అక్కడి నుంచి దాన్ని కదిలించడానికి ఎవరి తరమూ కాదు. అలా కదిలించడం మహా పాపమని అందరికీ తెలుసు. కాబట్టి ఎవరూ దానిజోలికి పోరు. ప్రజల నమ్మ కానికి అడ్డు తగిలే సాహసం ప్రభుత్వానికి కూడా లేదు గనుక అది కళ్ళు మూసు కుని కూర్చుంటుంది. ఇదంతా చాలా రహ స్యంగా జరిగిపోవాలి. ఒకవేళ పొరపాటున ఒక్క పిసరంతమాట బయటికిపొక్కిందా ఇక మన పని అయినట్టే! అలా కాకుండా ఉద్భవ విగ్రహానికి గుడికట్టాలి. స్థలం మంజూరు చేయమని అడిగితే ఇప్పుడున్న పరిస్థితిలో అసలు కుదరదు పొమ్మం టారు. అదీకాక రామయ్యకు సాయపడ డానికే మనమీ ఎత్తు వేశామని విమర్శి స్తారు కూడా. కాబట్టి మనం చాలా రహ స్యంగా ఎవరికీ ఏ అనుమానం రాకుండా పని పూర్తిచేసేయాలి. అప్పుడు అటు రామయ్యకు సహాయం చేసినట్టు ఉంటుంది. అతనివల్ల మనకు బోలెడంత ప్రయోజనమూ కలుగుతుంది. వచ్చే ఎన్నికల్లో మీరు గనుక నిలబడితే ధన సహాయం, జనసహాయం రెండూ లభిస్తాయి అతనివద్ద నుంచి ఆ తర్వాత మీ పేరు మార్మోగిపోయి మీరు గెలుస్తారనడంలో ఎలాంటి సందేహంలేదు" ఇది రాగన్న రాధాకృష్ణకు చేసిన ఉపదేశం.

శ్రీ కృష్ణుడి ఉపదేశం విన్న అర్జునుడు కర్తవ్యోన్ముఖుడైనట్టు రాధాకృష్ణ కూడా రాగన్న ఉపదేశానికి ముగ్ధుడైపోయి అన్ని టికీ అంగీకరించేశాడు.

ఆ మర్నాడు రాగన్న రాధాకృష్ణను వెంటబెట్టుకుని రామయ్య ఇంటికి వెళ్ళాడు. రాధాకృష్ణను చూడగానే రామయ్య ఫరవా లేదు రాగన్న తన పనిలో మెల్లిమెల్లిగా విజయం సాధిస్తున్నాడు అనుకున్నాడు.

రాగన్న తను వేసిన ప్లానంతా అతనితో చెప్పగానే అతను పొంగిపోయి "అబ్బ! మీరింత తెలివిగల వారని నేనను కోలేదు సుమండీ!" అన్నాడు.

ఇక ఆ స్థలం శాశ్వతంగా నాదే అయి పోతుందన్న ఆనందంలో "మీ రన్ని ఏర్పాట్లూచేయండి... ఖర్చు ఎంతైనా నేను భరిస్తాను" అన్నాడు సంతోషంతో



రామయ్య.

"విగ్రహాలను చెక్కే శిల్పులనెవరి నైనా కలుసుకుని మాట్లాడివచ్చి ఖర్చుల వివరాలు చెబుతా లెండి!" అని చెప్పి రాగాన్న వచ్చేశాడు.

రాధాకృష్ణ మౌనంగా అతన్ని అను సరించాడు.

* * *

ప్రఖ్యాత శిల్పి రామాచారి దగ్గరకు ఇద్దరూ కలిసి వెళ్ళారు. తన పనిలో పూర్తిగా లీనమైపోయిన రామాచారి వీళ్ళను చూసి తన చేతిలోని పరికరాలను కిందపెట్టి, కళ్ళజోడు సవరించుకున్నాడు.

"ఒక విగ్రహానికి ఆర్డరిద్దామని వచ్చా మండీ!" అన్నాడు రాగన్న.

"అయితే లోపలికి రండి" అంటూ లోపల గదిలోకి తీసుకు వెళ్ళాడు రామాచారి. అక్కడ సగం సగం తయారైన విగ్రహాలు చాలా ఉన్నాయి వాళ్ళిద్దరినీ కూర్చోమని చెప్పి తను రొంటిన దోపుకున్న ముక్కు పొడుం డబ్బీని బయటికి తీశాడు రామాచారి చిటికెడు పొడుం పీల్చి ముక్కు తుడుచుకుని "ఆ... ఏమిటో ఇప్పుడు చెప్పండి" అంటూ కింద చతికిల బడ్డాడు.

అక్కడున్న విగ్రహాల్లో వినాయకుని విగ్రహం ఎక్కడైనా కనిపిస్తుందేమోనని గాలిస్తున్న రాధాకృష్ణ 'మా కొక విగ్రహం కావాలి చేసిపెడతారా?' అని అడిగాడు రామాచారి వైపు దృష్టి మరల్చి.

"అలాగేలెండి. మీకెన్ని రోజుల్లో

కావాలి" అని రామాచారి అడగ్గానే "మూడు నెలలకు ఇస్తే చాలు. ఆపైన ఇంకో పదిహేను రోజులు ఎక్కువైనా పరవాలేదులెండి" అన్నాడు రాగన్న.

నేలమీద కూర్చున్న రామాచారి ఆ మాట వినగానే తేలుకుట్టిన వాడిలా చటుక్కున లేచి నిలబడి కాస్త కోపంగా "ఏమిటిసార్ మీరనేది. ఒక విగ్రహం చెక్కడమంటే అంత తేలికనుకుంటున్నారా మా కళ గురించి మీకు తెలిసింది. అంతవరకే! ఊఁ... ఏం చేస్తాం లెండి, మీకు చెప్పినా అర్థంకాదు. అంత త్వరగా చేసివ్వడం నావల్ల కాదు. వెళ్ళి వేరే ఇంకెవరినైనా చూసుకోండి" అని ఇక మాట్లాడేదేమీ లేనట్టు అవతలి గదిలోకి వెళ్ళి పోవడానికి ఉద్యుక్తుడయ్యాడు.

అతను చెప్పినట్టు రాగన్నకు శిల్పకళ గురించి ఏమీ తెలియదు. తెలుసుకునే అవసరం కూడా అతనికి లేదు. అసలు అతను శిల్పిని చూడడం, మాట్లాడడం జీవితంలో ఇదే మొదటిసారి. ఒక్క విగ్రహం చెక్కడమంటే ఏం పెద్ద కష్టం! మహా అంటే నెలరోజుల్లో చెక్కిపారేయవచ్చు. అనుకున్నాడంతే! కానీ ఇప్పుడు చూస్తే ఈ రామాచారి ఇంకో చోటికి పొమ్మని నిర్మొహమాటంగా చెప్పేస్తున్నాడు. మరి ఇతనివల్ల కానిపని ఇంకొకరివల్ల అవుతుందని గ్యారంటీ ఏముంది?– అని ఆలోచించి "మీరలా అనేస్తే ఎలాగండీ! మాకు అర్జెంటుగా కావాలి కాబట్టే మీ దగ్గరికి వచ్చాం. మీకెంత కావాలంటే అంత డబ్బు ఇస్తాం" అన్నాడు రాగన్న ఏ మాటకైనా రామాచారి లొంగుతాడన్న ఆశతో.

చివరి మాట విని కాస్త మెత్తపడ్డాడు రామాచారి.

"గుడి ఎక్కడ కట్టిస్తున్నారు మీరు? సాధారణంగా అందరూ గుడి కట్టడం ప్రారంభించకముందే వచ్చి విగ్రహాలకు ఆర్డరిస్తూ వుంటారు. మరి మీరు చూస్తే అర్జెంటు అంటున్నారు, గుడి పూర్తిగా తయారయి పోయిందా ఏమిటి" అని సాధారణంగా అందరినీ అడిగే ప్రశ్నలే అడిగాడు. కానీ రాగన్న మాత్రం ఆ ప్రశ్నకు కంగారు పడిపోయాడు. 'ఈ ఆచారి ఎందుకిలా అడుగుతున్నాడు? ఇతనితో అసలు సంగతి చెప్పడమా, మానడమా? చెబితే ఒకవేళ రహస్యం బయటపడి పోతుందేమో? కానీ శిల్పికి ఈ విషయం తెలియకుండా దాచడం మంచిది కాదు. అందుకని పూర్తిగా నిజం కాకుండా. కాస్త మలుపు తిప్పి చెప్పేస్తే సరి అని ఆలోచించి "చూడండి శిల్పిగారూ... మా శాంతప్ప బ్లాక్‌లో ఒక్క గుడి కూడాలేదు. ఏదైనా పండగలప్పుడు గుడి కెళ్ళాలంటే ఆడవాళ్ళూ, పిల్లలూ రెండు మూడు మైళ్ళ దూరం వరకూ నడిచి వెళ్ళాలి. కాబట్టి మా పేటలోనే ఒక గుడి కట్టాలని మేమంతా నిశ్చయించుకున్నాం. అయితే గుడి కట్టడానికి స్థలం ఒకే పెద్ద సమస్యగా ఉంది మాకిప్పుడు, ఒక చిన్న పార్కుంది... ఆ పార్కులో కట్టాలంటే లైసెన్స్ దొరకదు. ఇవన్నీ ఆలోచించి మేము ఒక ఉపాయం కని పెట్టాం. వినాయక చవితి రోజున ఆ పార్కులో వినాయకుడు ఉద్భవమైనట్టుగా పుకారు పుట్టిస్తే తప్పని సరిగా అక్కడ గుడిని కట్టనిస్తారు. ఉద్భవ మూర్తిని కదలించ కూడదు కనుక అప్పుడు ఎవరూ నోరు మెదపడానికి

వీలుండదు. ఆ తర్వాత నింపాదిగా మేం గుడి కట్టిస్తాం. మా పేటలో గుడి ఉండి తీరాలంటే ఇంతకంటే వేరే మార్గం కనిపించటం లేదు. కాబట్టి మీరు మాకీ సహాయం చేసి పుణ్యం కట్టుకోవాలి" అని అసలు సంగతి ఏమేమో కలిపి చెప్పేశాడు రాగన్న.

అతని మాటలింకా పూర్తి కాకుండానే రామాచారి గయ్యిన లేచాడు.

"ఏదో విగ్రహం కావాలన్నారు కదా అని మిమ్మల్ని లోపలికి రానిచ్చిందే పొరపాటయి పోయింది. ఇలాంటి దొంగ పని చేయడానికి నా సహాయమే కావలసొచ్చిందా మీకు? అలాంటి పని చచ్చినా చేయను నేను. కావాలంటే మీరు గుడి కట్టండి. ఆ తర్వాత మీ దగ్గర ఒక్క పైసా కూడా తీసుకోకుండా విగ్రహం తయారు చేసిస్తాను. సరేనా? దేవుణ్ని చూసిన ఎవరైనా సరే... 'ఈ విగ్రహం ఎవరు తయారు చేశారు?' అని అడిగినప్పుడు 'ఫలాన రామాచారి' అని నా పేరు చెప్పుకుంటే నాకంతేచాలు ఏ కళాకారుడైన కోరుకునేది అంతేకదా! అలాకాక మీరిప్పుడు చెప్పిన ప్రకారం గుట్టుచప్పుడుకాకుండా విగ్రహం మీకిస్తే ఆ తర్వాత అది నేనే చెక్కానని చెప్పుకోడానికి కూడా నాకు ఆస్కారముండదు. కాబట్టి ఇలాంటి దొంగ పనిలోకి నన్ను లాక్కండి బాబూ...మీకు దండం పెడతా. ఇక్కణ్నుంచి దయచేసి వెళ్ళిపోండి.నన్ను ఊరికే బలవంత పెట్టకండి" అని ఆవేశం పట్టలేకగబగబా అనేశాడు రామాచారి.

'ఈ కాలంలోకూడా డబ్బుకు లొంగని మనుషలుంటారా?' అని ఆశ్చర్యమేసింది రాగన్నకు. ఇలాంటి విషయం అనుభవంలోకి రావడం కూడా ఇదే మొదటిసారి అతని జీవితంలో.

అయితే ఇప్పుడు శిల్పిని మెచ్చుకుంటూ తిరిగెళ్ళేటట్టు లేదుకదా వ్యవహారం? ఎలాగైనా పని పూర్తి చేసుకునే ఇక్కణ్నుంచి కదలాలి.లేకపోతే తనదాకా వచ్చిన డబ్బు చేతికందకుండాపోతుంది– అన్న ఆలోచన రాగానే, రాగన్న లేచి చటుక్కున్న రామాచారిముందు సాష్టాంగ పడిపోయి అతని కాళ్ళు రెండూ గట్టిగా పట్టేసుకున్నాడు. "మీరు సరేనని ఒప్పుకునేదాకా మీ కాళ్ళు వదలను. మేమేం మోసంచేసి ఈ పనిచేయడం లేదు కదా! ఒక మంచిపని చేద్దామనే ఉద్దేశంతోనే చేస్తున్నాం. మరీ అత్యవసరమైనప్పుడు అబద్ధం ఆడినా తప్పులేదని శాస్త్రాలే చెబుతున్నాయిగదా – పెద్దలు మీకు తెలియంది ఏముంది? మా పేటలోని ప్రజలంతా అక్కడొక గుడి ఉండాలని కోరుతున్నారు. ఎలాగైనా కట్టిస్తామని మేము వాళ్ళకి మాటిచ్చాం. ఇప్పుడు మీరు కాదంటే వాళ్ళందరికీ ఎంత నిరాశ అయిపోతుందో ఆలోచించండి. ఎలాగైనా పని సాధించుకునే వస్తామని వాళ్ళకి మాట ఇచ్చి వచ్చిన మేము ఇప్పుడు వట్టి చేతులతో తిరిగెళితే వాళ్ళకు మొహమెలా చూపించడం? కావాలంటే ఇవే కాళ్ళతో తన్నండి, పడతాను. మీ పాదధూళి నా తలమీద పడి పునీతుణ్నవుతాను. కానీ మీరు మా కోరిక మన్నించేదాకా నేను మాత్రం మీ కాళ్ళు వదలను" అన్నాడు మొండిగా.

ఆ శిల్పి అసలేం జరుగుతోందో అర్థం కాని అయోమయ పరిస్థితిలో పడిపోయాడు. ముందు తన కాళ్ళను విడిపించుకుందామని ఎంతగా ప్రయత్నించినా



రాగన్న చేతి పట్టునుంచి విడిపించుకోవడం అతనివల్ల కాలేదు.

"అయ్యో!.....ఇదేమిటండి....ఇలా బలవంతం చేస్తే ఎలా? అబ్బ! వదలండీ" అని ఎంత బతిమాలుకున్నా, రాగన్న తన పట్టు సడలించలేదు.

"మీరు సరేనంటేనేగాని వదలను" అని ఒకటే మంకుపట్టు పట్టాడు.

ఇదంతా చూస్తున్న రాధాకృష్ణ కూడా ఏం చేయాలో తోచని విచిత్ర స్థితిలో పడిపోయాడు.

చివరికి కాళ్ళనొప్పులు భరించలేక రామాచారి "సరేబాబూ....మీ మాటే కానివ్వండి. ముందు నా కాళ్ళు వదలండి" అనేసరికి 'హమ్మయ్య!' అనుకొని రాగన్న అతని కాళ్ళు వదిలేశాడు.

రామాచారి చటుక్కున గోడకానుకుని కూర్చుని మొహానికిపట్టిన చెమట బిందువులను తుడుచుకుంటూ "నన్నెందుకిలా ఇరకాటంలో పెడుతున్నారు బాబూ? అంత తక్కువ వ్యవధిలో నేను చెక్కలేనే...!" అన్నాడు నీరసించిన గొంతుతో.

"మీరు విగ్రహాన్ని అందంగా ఏమీ తీర్చిదిద్దనక్కర్లేదు. ఊరికే వినాయకుడి రూపురేఖలు ఒక శిలమీద కనిపిస్తేచాలు—ఉద్భవమూర్తి అంటే అలాగే ఉండాలి కదా మరి!" అన్నాడు రాగన్న.

రామాచారి నవ్వి "ఉద్భవించే దేవుడు కాస్త అందంగానే ఉద్భవించనిద్దురూ...? ఏ పనిచేసినా సక్రమంగా చేయాలికానీ అలా సగంసగం చేయకూడదు...అయినా మీ అదృష్టం బాగుందిలెండి. ఎవరో ఆర్డరిచ్చారని ఒక సంవత్సరం నుంచీ వినాయకుడి విగ్రహాన్ని చెక్కుతున్నాను. అదిక నెలరోజుల్లో పూర్తయిపోతుంది. దాన్ని మీకిచ్చి వాళ్ళకి ఇంకొకటి తయారు చేయాలి వాళ్ళు కట్టిస్తున్న గుడి కూడా పూర్తికావచ్చిందట పాపం! రాతిలో పగులు కనిపించిందనో లేక మరేదో అయిందనో అబద్ధం చెప్పి వాళ్ళను నమ్మించాలి. ఏమైనా నేనెప్పుడూ చేయని పనులన్నీ నాచేత ఇప్పుడు చేయిస్తున్నారు మీరు. ఆ విఘ్నేశ్వరుడే మీకిలా బుద్ధిపుట్టించాడేమో! అసలు మన చేతుల్లో ఏముందిలెండి అంతా

వాడి లీల!" అంటూ పైకిచూస్తూ దండం పెట్టాడు రామాచారి.

శిల్పిని ఒప్పించే పని అప్పటికి పూర్తి అయింది. "అయితే ఎంత డబ్బివ్వాలో ఎలా అడగడం? అడిగితే మళ్ళీ దానికి కూడా విసుక్కుపడతాడేమో!" అనే లోపల భయపడుతూనే మెల్లిగా ఆ విషయం ప్రస్తావించాడు రాగన్న. "ఈ విగ్రహంకోసం మీకు ఆర్డరిచ్చినవాళ్ళు ఎంత డబ్బిస్తామన్నారు?" అని యధాలాపంగా అడిగినట్టు అడిగాడు.

"వాళ్ళా? వాళ్ళు అయిదు వేలిస్తామన్నారు. అయినా డబ్బు కోసం చేసే పనా సార్ అది? నేను ఇద్దరు కుర్రాళ్ళకి జీతాలివ్వాలి ఇక నాకేం మిగులుతుందో మీరే ఆలోచించండి. ఒక సంవత్సరం పాటు ఒక విగ్రహం చెక్కేదానికన్నా ఎక్కడైనా పని చేస్తే అంతకన్నా ఎక్కువ ముడుతుందనుకుంటా! కానీ అలా పని చేయడానికి మనసొప్పదు. ఒకరి చేతికింద పని చేసేకంటే స్వతంత్రంగా బతుకుతూ గంజినీళ్ళు తాగినా తృప్తిగా ఉంటుంది" అన్నాడు.

రాగన్న ఆలోచించాడు. 'వాళ్ళు అయిదు వేలిస్తామంటే తాము దానికి రెట్టింపు ధర ఇవ్వాల్సిందే!' అనుకుని "అయితే మేం పదివేలిస్తాం. మీరు కాదనకుండా స్వీకరించాలి" అన్నాడు.

అంత డబ్బు తనకొద్దని రామాచారి వాదించినా వినకుండా బలవంతంగా అతన్ని ఒప్పించి, వినాయకచవితి ముందు రోజు రాత్రి వచ్చి విగ్రహాన్ని పట్టుకెళతామనీ, ఈ విషయాన్ని దయచేసి ఎక్కడా అనకూడదనీ హెచ్చరించి అక్కణ్నుంచి వచ్చేశారు వాళ్ళిద్దరూ.

దారిలో వెళుతూ రాగన్న రాధాకృష్ణతో మరో మాట చెప్పాడు. రామయ్యతో విగ్రహం ఖరీదు పదిహేనువేల రూపాయలని చెప్పాలనీ, ఈ పని చేసినందుకు అతను అయిదువేలు తమకు ముట్టచెప్పొచ్చనీ అప్పుడు తామిద్దరం చెరో అయిదువేలు తీసుకోవచ్చనీ చెప్పాడు.

రాధాకృష్ణ ఏం మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయాడు.



## 11

నోటీసులు అందుకున్న రెండు నెలలకల్లా మరోచోటికి మకాం మార్చేశారు కొందరు దుకాణాదార్లు. మరి కొందరేమో మొత్తం సామానులు తరలించకుండా వ్యాపారం నిలదొక్కుకునేంత వరకూ కొద్దిపాటి సరుకులు మాత్రం తీసుకెళ్ళి అక్కడ పెట్టారు.

దుకాణాదార్లందరూ దుకాణాలుఎత్తేసి వెళ్ళిపోతున్నారని తెలిసి అప్పుగా సరుకులు తీసుకుంటున్న ఖాతాదార్లందరూ మొహం చాటేయ సాగారు. ఇలా ఇటు డబ్బూ వసూలు కాక, అటు వ్యాపారమూ సరిగ్గా సాగక నానా అవస్థలూ పడసాగారు దుకాణాదార్లు. దుకాణాల్లో సరుకులు నిండుగా లేక బోసిగా వెలవెలపోతుంటే ఎవరూ రారని అక్కడికి సరుకులు చేరవేసేందుకు ఇంట్లో ఉన్న నగలన్నీ అమ్మో లేక బయటినుంచి అప్పులు

తెచ్చే గడుపుతున్నారు.

రంగయ్య, అతని మిత్రబృందం సమావేశమై 'రోడ్డుకు కలుపుకోగా మిగిలిన స్థలంలో ఏమేమి కట్టించుకోవచ్చో' ఆలోచించారు. ఇళ్ళు కట్టుకోవడానికి మరో చోట చవక ధరలో స్థలాలు దొరికే అవకాశం ఉండడంచేత ఇక్కడ మళ్ళీ దుకాణాలే కట్టించాలని నిశ్చయించుకున్నారు.

ఈలోగా రాగన్న చాలా మారిపోయాడు. అంతకుముందు చేసిన అప్పులన్నీ మెల్లిమెల్లిగా తీర్చేశాడు. అంతేకాక అతని వేష భాషల్లో కూడా బాగా మార్పొచ్చేసింది. మాసిపోయిన పాత బట్టలు తొడుక్కుంటున్నవాడల్లా ఇప్పుడు మడత నలగని ఖరీదైన బట్టలు తొడుక్కుంటున్నాడు. అతని ఇంటికి కూడా ఇప్పుడు బాగా కళ వచ్చింది. వెల్లవేసిన గోడలు, కిటికీలకూ, గుమ్మాలకూ కర్టెన్లు ఖరీదైన ఫర్నీచరూ అన్నీ వచ్చాయి. అతని భార్యా పిల్లలు మంచి బట్టలు కట్టుకుని కళకళలాడుతున్న మొహాలతో సంతోషంగా కనిపిస్తున్నారు. 'ఇవన్నీ ఎక్కడినుంచి వచ్చాయని' ఎవరైనా అడుగుతారేమోనని రాగన్న ఓ కట్టు కథ అల్లి తయారుగా ఉంచుకున్నాడు. తన స్వగ్రామంలో తనకు రావలసిన ఆస్తి పాస్తులను ఇన్నాళ్ళుగా తన దాయాదులే అనుభవిస్తున్నారనీ, తను కోర్టులో వేసిన కేసు గెలిచి అవన్నీ తనకు మళ్ళీ దక్కాయనీ చెప్పుకు తిరగసాగాడు. లక్షలు ఖరీదుచేసే తన ఆస్తిలో కొద్దిగా అట్టిపెట్టుకుని మిగతాది అమ్మేసి, తనుకూడా రెండుమూడు దుకాణాలు కట్టించాలనుకుంటున్నాననీ అతను చెబుతుంటే నిజమే కాబోలు అనుకున్నారు అందరూ. తన గత జీవితంలోని మచ్చను తుడిచేసుకునేందుకు అతను మరికొన్ని సంగతులను సృష్టించి చద్ద, నంజుండల ద్వారా ప్రచారం చేయించాడు. అసిస్టెంట్ తాసీల్దారుగా ఉన్న రాగన్నను తాసీల్దారుగా ప్రమోట్ చేసి ఎక్కడో దూరాన ఉన్న ఊరికి బదిలీ చేశారనీ, తరతరాలవరకూ కూర్చుని తిన్నా తరగిపోని ఆస్తి తనకుండి, ఒకరి కింద ఉద్యోగం చేయవలసిన కర్మ తనకెందుకని అతనా ఉద్యోగంమానేశాడనీఇప్పుడు ప్రజాసేవకే తన జీవితాన్ని అంకితం చేసేశాడనీ చెప్పడం మొదలెట్టారు వాళ్లు. అది విని కొందరు నవ్వుకున్నారు. ఒకప్పుడు అతనికి కొద్దో గొప్పో అప్పు ఇచ్చినవాళ్ల ఈ వదంతులు విని ఆశ్చర్య పోయారు. తమదగ్గర అతను అప్పు తీసుకున్నాడని చెప్పినా ఇప్పుదెవరూ నమ్మరు. పైగా తనంటే గిట్టక ఏవో కట్టుకథలల్లి చెబుతున్నారని రాగన్నే తిరిగి అన్నా అనొచ్చునని నోరుమూసుకుని కూర్చున్నారు. డిస్మిస్డ్ తాసీల్దార్, అని అప్పుడు ఎగతాళి చేసినవారు కూడా ఇప్పుడు అతన్ని రాఘవేంద్రరావుగారు అని మర్యాదగా పిలవసాగారు. రాగన్న రాఘవేంద్రరావుగా మారిపోయినప్పటి నుంచీ రాధాకృష్ణనూ రంగయ్యనూ, తదితరులనూ కలుసుకునేందుకు ఇదివరకటిలా చాటుమాటుగా కాక దర్జాగానే వెళ్లసాగాడు. అంతేకాక తనే వీళ్లందరికీ నాయకుడైనట్టు ఛాతీ విరుచుకు తిరగ సాగాడు. వాళ్లుకూడా తమకు తెలియకుండానే ఈ మార్పుకు అలవాటు పడిపోయారు.

* * *

పురపాలక సంఘంవారు సూచించిన

చోట రైల్వే బ్రిడ్జి కట్టించడానికి రైల్వే శాఖ అంగీకరించిందన్న మాట తెలిసినప్పటినుంచీ రోడ్డు వెడల్పుచేసే విషయంలో ఎవరికీ అనుమానం లేకపోయింది.

మరో నాలుగు రోజుల్లోనే ఇంజినీర్లూ, ఇతర బలగమూ ఆ రోడ్డుమీదికి రాకపోకలు ప్రారంభించారు. ముందు ముందు ఆ ప్రాంతం ఇంకా అభివృద్ధి చెంది, వాహనాల రద్దీ మరింత పెరిగే అవకాశం ఉండడంతో అక్కడ పెద్ద వంతెన కట్టించాలని తానే సలహా ఇచ్చాడని శంకరయ్య అనగానే అందరూ అతని మొహంమీదే నవ్వేశారు. రాను రాను ప్రజల్లో పలుకుబడి సన్నగిల్లడం చూస్తుంటే అతనికి లోలోపల చెప్పలేనంత బాధగా ఉంది. పురపాలక సంఘంలో తన సభ్యత్వం ఇంకా ఆరునెలలవరకు మాత్రమే. ఆ తర్వాత మళ్లీ ఎన్నికలు జరుగుతాయి. ఇలా ఎన్నికలు దగ్గర పడుతున్న సమయంలో జనానికి తనమీద గౌరవం తగ్గిపోవడం మంచిది కాదనిపించింది శంకరయ్యకు. ఎన్నికల్లో తను ఓడిపోవలసి వస్తుందేమోనన్న ఆలోచనే అతన్ని ఎంతగానో భయపెట్టేసింది. తిరిగి ప్రజల అభిమానం సంపాదించాలంటే ఏంచేయాలా అని తీవ్రంగా ఆలోచించాడు. చివరికి అతనికొక ఉపాయం తట్టింది. విఘ్నేశ్వర యువక సంఘం వారు వినాయక చవితి ఉత్సవాలు ఘనంగా జరపబట్టే కదా జనం ఆ రాధాకృష్ణను అంతగా అభిమానిస్తున్నారు? తను కూడా శాంతప్ప బ్లాక్ యువక సంఘం ఆధ్వర్యాన భారీ ఎత్తున వినాయక చవితి ఉత్సవాలు జరిపిస్తే అప్పుడు జనం తనను కూడా మెచ్చుకుంటారు. అభిమానిస్తారు. అనుని సంఘ సభ్యులందర్నీ సమావేశపరిచి ఈ సంగతి చెప్పాడు. అదివినగానే వాళ్ళు సంతోషంతో ఎగిరి గంతు వేశారు.

"మేమే ఈ సంగతి మీతో చెప్పాలనుకుంటున్నామండీ. ఆ రాధాకృష్ణకంటే మనం ఏం తీసిపోయామని? వాళ్ళకంటే గ్రాండ్‌గా చేసేద్దాం మనం" అన్నాడు రాధాకృష్ణ అంటే గిట్టని ఒక సభ్యుడు.

అక్కడికి దగ్గరలోనే ఉన్న ఓ ప్రైవేట్ స్కూల్లో ఉత్సవాలు జరిపించే ఏర్పాటు చేసుకోవచ్చనీ, ఆ స్కూలు కమిటీ ప్రెసిడెంటుగారు తనకు బాగా తెలిసినవారనీ, ఆయన తప్పకుండా అనుమతిస్తారనీ చెప్పాడు శంకరయ్య.

ప్రతిరోజు గొప్ప గొప్ప విద్వాంసుల పాట కచ్చేరీలూ, పేరు పొందిన నర్తకీమణుల నాట్యాలూ, ప్రసిద్ధి పొందిన నాటక సమాజాల నాటకాలూ ఏర్పాటు చేయాలని నిశ్చయించుకున్నారు.

కార్యక్రమాలన్నీ నిర్ణయించినతర్వాత కరపత్రాలను అచ్చువేయించి అందరికీ పంచిపెట్టేశారు శాంతప్ప బ్లాక్ యువక సంఘం సభ్యులు.

ఆ కరపత్రం చూసిన రాధాకృష్ణ-వాళ్ళు తమకంటే ఘనంగా ఉత్సవాలు ఏర్పాటు చేయడం చూసి తనకు తీరని అవమానం జరిగినట్టు భావించసాగాడు. ఆ రోజు సాయంకాలం రాగన్న తన దగ్గరికి వచ్చినప్పుడు తన బాధను వెళ్ళబోసుకున్నాడు. రాగన్న తేలిగ్గా నవ్వేసి "ఆమాత్రం అర్థం చేసుకోరేమిటండీ మీరు? మనం ఉత్సవాలు జరపబోయే చోట సాక్షాత్ వినాయకుడే ఉద్భవించబోతున్నాడు కదా-ఆ సంగతే మరిచిపోతే

ఎలా? వినాయకుడు ఉద్భవించాడని తెలిసే జనం ఇక్కడికే పరుగెత్తుకొస్తారు గానీ ఆ శంకరయ్య తలకిందులయి తపస్సు చేసినా అక్కడికి పోరు. తెలిసిందా ?" అన్నాడు.

అది విని మనసు కాస్త కుదుటపడింది రాధాకృష్ణకు.

అంతవరకూ విఘ్నేశ్వర యువక సంఘం సభ్యుల కెవరికీ చెప్పకుండా దాచిన వినాయకుడి విగ్రహం సంగతిని ఇప్పుడు చెప్పడానికిది మంచి సందర్భమని కూడా రాగన్న చెప్పడంతో అతని మనసు మరింత తేలిక పడింది. ఒక్కసారిగా రెండు సమస్యలు తీరిపోయినందుకు చాలాసంతోషించాడు రాధాకృష్ణ.

రాగన్నతో కలిసి పార్కులో వినాయకుణ్ని ఉద్భవింప చేస్తున్నట్టు విఘ్నేశ్వర యువక సంఘం సభ్యులకు చెప్పాలా, వద్దా-అని తను ఇదివరకు చాలాసార్లు ఆలోచించాడు. చివరికి ఏదీ నిర్ణయించలేక తనలో తనే చాలా బాధ పడ్డాడు కూడా రాగన్నను అడిగినందుకు అతను, "ఆ విషయం గురించి మీరిప్పుడేం బుర్ర పాడు చేసుకోకండి రాధాకృష్ణ గారూ! తగిన సమయం వచ్చినప్పుడు నేనే ఏదో ఉపాయం ఆలోచించి చెబుతాను' అనేవాడు.

'అతను ఏదైనా ఆలోచన చెప్పాడా సరేసరి. లేకపోతే తనకూ ఆ పనికీ ఏం సంబంధం లేదనే చెప్పేద్దాం' అనుకున్నాడు రాధాకృష్ణ. కానీ ఆ తర్వాత ఎప్పుడైనా రహస్యం బయట పడితే అప్పుడు తన పట్ల కూడా వాళ్ళకు అనుమానం కలుగుతుందేమోనన్న జంకు లోలోపల ఉండనే ఉంది అతనికి. అయితే ఇప్పుడు శంకరయ్య తనకు విరుద్ధంగా మరో సంఘం స్థాపించి తనకు పోటీగా వినాయక చవితి ఉత్సవాలు కూడా జరుపుతూ ఉండడంతో వాళ్ళ మీద దెబ్బ కొట్టడానికి తనీ ఉపాయం చేసినట్టు చెప్పవచ్చు.

శంకరయ్య సంఘం తాలూకు కరపత్రాలను చూసిన విఘ్నేశ్వర యువక సంఘం సభ్యులు కొందరు వెంటనే రాధాకృష్ణ దగ్గరికి, పరుగెత్తుకు వచ్చి "ఇప్పుడేం చేద్దామంటారు రాధాకృష్ణగారూ...?" అని అడిగారు కంగారుగా.

రాధాకృష్ణ కాసేపు ఆలోచిస్తున్నట్టు నటించి "మనం ఒక మీటింగు పెట్టి అన్ని విషయాలూ ఆలోచిద్దాం లెండి.' అన్నాడు

ఆ మర్నాడు సభ్యులందరూ సమావేశమయ్యారు.

రాధాకృష్ణ మీటింగులో మాట్లాడుతూ రాగన్న తనకు నేర్పిన మాటలన్నీ ఒక్క మాట కూడా పొల్లు పోకుండా వాళ్ళ ముందుంచాడు.

"ఇప్పుడు మనం ఒక విచిత్రమైన పరిస్థితిలో ఇరుక్కున్నాం. మన పేట పెద్దలైన శంకరయ్య గారే ఒక సంఘం స్థాపించి, అంతటితో ఊరుకోకుండా మనకు పోటీగా ఇప్పుడు వినాయక చవితి ఉత్సవాలుకూడా జరిపిస్తున్నారు. వాళ్ళకు బాగా డబ్బుంది. మనకంటే ఘనంగా కార్యక్రమాలు ఏర్పాటుచేశారు. మనకేమో ఈసారి అంతగా డబ్బు వసూలయ్యే అవకాశం లేదు. ఎందుకంటే ఇక్కడ దుకాణాదార్లందరూ చాలా క్లిష్టపరిస్థితిలో ఉన్నారు. అదీకాక వాళ్ళకీ పరిస్థితి రావడానికి మనమే కారణమన్న అభిప్రాయం



కూడా వాళ్ళల్లో బాగా నాటుకుపోయింది. కాబట్టి వాళ్ళీసారి మనకు ఒక్క పైసా కూడా ఇవ్వరు...పరిస్థితి ఇలా ఉండగా మనం మంచిమంచి కార్యక్రమాలు ఎలా ఏర్పాటు చేయగలం చెప్పండి? కాబట్టి అటు డబ్బూ ఎక్కువగా ఖర్చు కాకుండా, ఇటు మనుషులూ బాగా వచ్చేటట్టు చేయాలని ఆలోచిస్తుంటే–మన సంఘానికి శ్రేయోభిలాషులైన శ్రీ రాఘవేంద్రరావు గారు ఒక అమూల్యమైన సలహా ఇచ్చారు. అదేమిటంటే మనం ఒక వినాయకుడి విగ్రహాన్ని తయారు చేయించి పార్కులో ఒకపక్క పాతిపెట్టి అది అక్కడ భూమి లోంచి ఉద్భవమైనట్టు జనాన్ని నమ్మిస్తే, అప్పుడు అందరూ మన కార్యక్రమాలకే వస్తారు. ఆ తర్వాత వీలు చూసుకుని ఆ మూర్తి ఉన్నచోట ఒక గుడి కట్టించే ఏర్పాటు చేయాలి. దీనివల్ల అటు మన విరోధులను ఓడించినట్టవుతుంది, ఇటు మన పేటలో ఒక దేవాలయం నిర్మించినట్లూ అవుతుంది. ఉద్భవమూర్తి అంటే దేవాలయ నిర్మాణానికి అందరూ తప్పక విరాళాలిస్తారు. ఇక్కడో గుడి నిర్మిస్తామని మామూలుగా చెబితే మనకెవరూ సహాయం చేయరు. పార్కులో విగ్రహప్రతిష్ఠాపనకు అనుమతి కూడా లభించదు కాబట్టి, మనం రహస్యంగా చేయడం తప్పనిసరి అనిపిస్తుంది. మీరందరూ ఒప్పుకుంటే నేను శ్రీ రాఘవేంద్రరావుగారిని ఒప్పించి ఈ పనికి కావలసిన ఏర్పాట్లుచేసే బాధ్యతంతా ఆయనకే అప్పగిస్తాను. చివరి

మాట ఏమిటంటే మనం ఎలాగైనా కష్టపడి గుడి కట్టించామంటే మన విఘ్నేశ్వర యువక సంఘం పేరు శాశ్వతంగా నిలిచిపోతుంది. నేను కోరేదికూడా అదే..." అని చెప్పడం ముగించి కూర్చున్నాడు రాధాకృష్ణ.

వెంటనే కూర్చున్నవాళ్ళంతా లేచి గంతులేయడం మొదలెట్టారు. "ఎలాగైనా సరే, ఆ శాంతప్ప బ్లాక్ యువక సంఘం వారిని మట్టుపెట్టాలనేదే' వాళ్ళ ఆలోచన. అందుకనే వాళ్ళకు రాధాకృష్ణ మాటలు బాగా నచ్చాయి. మారు మాట్లాడకుండా అందరూ ఒప్పుకున్నారు.

దేవాలయం కట్టించేదాకా ఈ విషయం రహస్యంగా ఉంచడం చాలా అవసరమనీ ఏ మాత్రం బయటికి తెలిసినా ఎవరైనా ఆ విగ్రహాన్ని ఎత్తుకుపోయే ప్రమాదం ఉంది. కనుక ఎక్కడా ఎవరితోనూ ఈ సంగతి చెప్పకూడదనీ మరోసారి అందరినీ హెచ్చరించాడు రాధాకృష్ణ.

అతనికి నమ్మకం కలగడానికి అందరూ 'ఎలాంటి సందర్భంలోనూ, ఎక్కడా ఈ రహస్యం బయటపెట్టమని' వినాకుడిమీద ప్రమాణంచేసి చెప్పారు.

'అంత త్వరగా వినాయకుడి విగ్రహం చెక్కడం ఎలా సాధ్యం?' అని కానీ, 'దానికయ్యే ఖర్చును ఎవరు భరిస్తారని' కానీ ఎవరూ అడగలేదు. అసలలా అడగాలనే ఆలోచన కూడా ఎవరికీ రాలేదు. తనంతట తానుగా రాధాకృష్ణ ఆ విషయాన్ని చెప్పనూ లేదు. ఇప్పుడే కాదు, ఇకముందు కూడా ఎవరూ తనను ప్రశ్నించకుండా ఉండాలన్న ఉద్దేశంతోనే అతను ఆ బాధ్యత అంతా రాగన్నకు వదిలేస్తున్నట్టుగా చెప్పాడు.

మీటింగులో జరిగినదంతా యథాతథంగా రాగన్న ముందుంచాడు రాధాకృష్ణ.

"సరే! అయితే మీ యువక సంఘం పేరుతో రెండువేలు ఖర్చు రాయండి" అన్నాడు రాగన్న.

ఆ డబ్బెవరికో ఇక ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. అందులో తనకూ వాటా ఉంటుందని రాగన్న చెప్పకుండానే గ్రహించేశాడు రాధాకృష్ణ. ఒకసారి పిగజారడం ప్రారంభించాక ఇప్పుడిక ఆ పని తేలికయిపోయింది రాధాకృష్ణకు.

రాగన్న మధ్యమధ్యలో శిల్పి రామాచారి ఇంటికివెళ్ళి విగ్రహం ఎంతవరకూ వచ్చిందో చూసి అతనికి అయిదువేలు అడ్వాన్సుగా ఇచ్చివచ్చాడు.



## 12

దుకాణాలు ఖాళీ చేయడానికి తామిచ్చిన మూడు నెలల గడువు పూర్తి కావస్తుండగా ప్రభుత్వ అధికార్లు మరోసారి వచ్చి అందర్నీ హెచ్చరించి వెళ్ళారు.

వంతెన మీద సిటీ బస్సులు తప్ప ఇతర భారీ వాహనాలేవీ సంచరించడానికి వీలు లేకపోవడం వల్ల — వీలైనంత త్వరగా రోడ్డు పని పూర్తి చేయాలని అధికార్లు తొందరపడ సాగారు. వంతెన నిర్మాణం కూడా త్వరగా పూర్తి చేయవలసిందిగా రైల్వే శాఖకు ఆదేశాలు

రావడం వలన వాళ్ళప్పుడే పని మొద లెట్టేశారు. ఇంకో ఆరునెలల్లో దాన్ని పూర్తి చేస్తామని కూడా వాళ్ళు హామీ ఇచ్చారు.

వాళ్ళ పక్కనున్న ఖాళీ స్థలాన్ని స్వాధీనం చేసుకుని అక్కడ మార్కెట్టు నిర్మించేందుకు పురపాలక సంఘం అంగీకరించి అక్కడున్న ముగ్గురు దుకాణాదార్లను వెంటనే ఖాళీ చేయవలసిందిగా తొందర పెట్టింది.

వినాయకుడు ఉద్భవించడానికింకా నెలరోజుల వ్యవధి ఉంది. అప్పటిదాకా ఎలాగో కాలం గడిపేస్తే ఆ తర్వాత పరిస్థితులన్నీ తారుమారైపోతాయని తెలిసిన రామయ్య— దుకాణాలు ఖాళీ చేయడానికి ఇంకో రెండు నెలలు గడువిమ్మని అధికార్లను కోరదామనుకున్నాడు. అయితే అతని బిల్డింగులో అద్దెకుంటున్న వారికి మాత్రం ఈ విషయాలేవీ తెలియదు కాబట్టి వాళ్ళు అందరిలాగే తామూ ఖాళీ చేయాలేమో అని కంగారు పడసాగారు. మొదట్లో రామయ్య పలుకుబడిలో వాళ్ళకు పూర్తిగా నమ్మకం ఉండేది. ఇతర దుకాణాదార్లకొచ్చిన ఇబ్బందులేవీ తమదాకా రావనే భావించి వాళ్ళు నిశ్చింతగా ఉండిపోయారు. కానీ రామయ్య చేసిన ప్రయత్నాలేవీ ఫలించకపోయేసరికి అందరికీ వచ్చినట్టే తమకూ నోటీసులొచ్చేసరికి ఆ నమ్మకం సడలిపోయింది. ఇప్పుడు హడావిడిగా వెతకడం మొదలెట్టారు కానీ ఎక్కడా వాళ్ళకు చోటే దొరకలేదు. చివరికి చేసేదిలేక అందరూ కట్టకట్టుకుని మళ్ళీ రామయ్య దగ్గరికే వెళ్ళి తమ కష్టాలు చెప్పుకున్నారు.

రామయ్య అంతా విని నిస్సహాయంగా వాళ్ళ వైపుచూసి "మీకీ కష్టం రాకూడదని నేనెంతగా ప్రయత్నాలు చేశానో మీకు తెలుసుగా! దీని కోసం నేను ఖర్చు పెట్టిన డబ్బు అంతా ఇంతా కాదు. ఎంత పోసినా వాళ్ళ దాహం తీరడం లేదు. ఇంకో పదిహేను, ఇరవై వేలు సమర్పించుకుంటే మనం ఈ గండం గడిచి గట్టెక్కవచ్చేమోననిపిస్తుంది" అన్నాడు.

అప్పుడు వచ్చిన వాళ్ళలో ఒకతను చటుక్కున అందుకుని,

"మీరు డబ్బుకోసం ఏం వెనకాడకండీ రామయ్యగారూ! మేమందరం మా శక్తికొద్దీ తలా కాస్త వేస్తాం. ఇప్పుడు మేము ఇంకో చోటికి పోతే అక్కడ వ్యాపారం కాస్త కుదురుకునే వరకూ మాకు నష్టం రాదేమిటి? అలాగే ఆ నష్టం ఇక్కడే వచ్చిందనుకుని సరిపెట్టుకుంటాం" అన్నాడు.

అతనలా అనగానే అందరూ తలో రెండువేలు ఇస్తామని ఒప్పుకున్నారు.

అప్పటివరకూ ఖర్చుపెట్టిన డబ్బును తిరిగి రాబట్టుకోవడం ఎలాగా అని ఆలోచిస్తున్న రామయ్యకు ఇప్పుడు అనుకోకుండా అవకాశం కలిసి వచ్చింది. అందుకు లోలోపల సంతోషించినా పైకి మాత్రం "మీరింతగా చెబుతున్నారుకాబట్టి తీసుకుంటున్నాను. కానీ దీనివల్ల మనం తప్పకుండా గెలిచే తీరతామని చెప్పడానికి వీల్లేదు. ఆ మాట మాత్రం గుర్తుంచుకోండి. ఆ తర్వాత నన్నని లాభం లేదు" అని గోడమీదిపిల్లివాటంగా జవాబు చెప్పాడు రామయ్య.

అతని మీదే భారమంతా మోపి, వాళ్ళంతా తిరిగి వెళ్ళారు.



ఆ మర్నాడు మేమెంత ప్రయత్నించినా వేరే చోట అద్దెకు ఖాళీ దుకాణాలు దొరకటం లేదనీ, దయచేసి మరో మూడు నెలలు గడువివ్వాలని కోరుతున్నామనీ వాళ్ళందరిచేత దరఖాస్తులు రాయించి అవి పట్టుకుని కారులో ఎక్కడికో బయలుదేరాడు రామయ్య.

తామిచ్చిన గడువులోగా దుకాణాదార్లు తమ దుకాణాలు ఖాళీ చేస్తారన్న నమ్మకం నోటీసులు జారీ చేసిన అధికార్లకు కూడా లేదు. ఎన్నో చోట్ల ఖాళీ చేయించడానికి రెండు మూడేళ్ళే పట్టేవి. ఇది మానవత్వానికి సంబంధించిన విషయం కాబట్టి అధికారులు మరీ అంత ఖచ్చితంగా వ్యవహరించలేకపోయారు. అందువల్లే రామయ్య ఇంకో మూడు నెలలు గడువు కోరేసరికి వాళ్ళు కాదనలేకపోయారు.

ఈ వార్త తెలిసిన మరుక్షణం దుకాణాదార్లు ఉత్సాహంగా సరుకులు తెచ్చి దుకాణాల్లో నింపారు. ఖాళీ చేయవలసి వస్తుందేమో అన్న భయంతో ఇన్నాళ్లూ వాళ్ళు కొత్త సరుకులు తెచ్చుకునే జోలికే పోలేదు. మళ్ళీ పొడిగించుకున్న గడువు తీరేలోగా కొన్ని పాత బాకీలన్నా వసూలు చేసుకోవచ్చన్న ధైర్యం వాళ్ళ ఉత్సాహానికి కారణమైంది.

* * *

ఇప్పుడు రాగన్న చేతిలో డబ్బు బాగా ఆడుతోంది. కిళ్ళీకొట్టు పళని బాకీని అతనెప్పుడో తీర్చేశాడు. ఇప్పుడు అప్పు పెట్టకుండా నగదిచ్చే సిగరెట్లు కొంటున్నాడు. ఇది చూసి పళని ఏమిటో ఇబ్బందిగా ఫీలవుతున్నాడు. తన కిళ్ళీకొట్టు అక్కణ్ణించి ఎత్తివేయాల్సివస్తే రాగన్నకు చెందిన స్థలంలో కొట్టు పెట్టుకోనిస్తాడని ఇదివరకు పెట్టుకున్న ఆశ క్రమంగా సన్నగిల్ల సాగింది. తనకు స్థలం ఇచ్చే ఉద్దేశం ఆయనకు లేకనే అలా నిర్మోహమాటంగా వ్యవహరిస్తున్నాడని పళని అభిప్రాయ పడ్డాడు. పూర్వం రాగన్న తన బాకీని ఎప్పుడు తీరుస్తాడా అని ఎదురు చూసినవాడు–ఇప్పుడుఅతను ఎప్పుడు బాకీ పెడ్తాడా అని ఎదురు

చూస్తున్నాడు. వారానికి రెండుసార్లయినా స్థలం విషయం రాగన్నతో ప్రస్తావించకుండా ఉండలేకపోతున్నాడు పళని. కానీ రాగన్న నుంచి ఎప్పుడూ ఖచ్చితమైన సమాధానం రాకపోవడంతో చివరి ప్రయత్నంగా పళని సుశీలను ఆశ్రయించాడు.

తన భార్య పళనిని సిఫారసుచేస్తుంటే రాగన్నకి నవ్వొచ్చింది.

"మొత్తానికి నువ్వు కూడా ఇప్పుడు గొప్పదానివై పోయావన్నమాట! ఒకప్పుడు ఇక్కడ నన్ను పలకరించేవాళ్ళే లేరు. ఇప్పుడు చూడు తమ పనుల కోసం నిన్ను ఆశ్రయించి నాకు సిఫారసు చేయించే స్థితికి దిగజారిపోయారు పాపం!" అన్నాడు.

* * *

వినాయకచవితి ఉత్సవాలకు రెండు సంఘాలవాళ్లు భారీ యెత్తున ఏర్పాట్లు ప్రారంభించారు. ఈ పోటీ శాంతప్ప బ్లాక్‌లోని వారికంతా మంచి కాలక్షేప సాధనంగా తయారైంది. పూర్వం ఆ నగరం మొత్తంమీద నాలుగైదు చోట్ల మాత్రమే వినాయకచవితి ఉత్సవాలు జరుగుతూ ఉండేవి. నగరం పెరిగినకొద్దీ ఉత్సవాల సంఖ్య కూడా బాగా పెరిగిపోయింది. అంతరంగిక కలహాల వల్ల ప్రతి సంవత్సరం సంఘాలు చీలిపోయి, ఎవరికి వారు కొత్త సంఘాలు స్థాపించుకుని విడివిడిగా ఉత్సవాలు జరపడం మొదలు పెట్టారు. ఒకరితో మరొకరు పోటీ పడి మంచి మంచి కార్యక్రమాలను ఏర్పాటు చేయడానికి నానా తంటాలూ పడేవారు. కానీ శాంతప్ప బ్లాకులోమాత్రం ఆ పరిస్థితి ఇదివరకెప్పుడూ ఏర్పడలేదు, ఈ సంవత్సరం మాత్రం శంకరయ్య కొత్తసంఘం స్థాపించి రాధాకృష్ణకు పోటీగా ఉత్సవాలు జరిపిస్తున్నాడు కాబట్టి జనం ఈ సంగతి విస్తారంగా చెప్పుకున్నారు. విఘ్నేశ్వర యువక సంఘంవాళ్లు మామూలుగాఎప్పటిలాగే తొమ్మిది రోజులపాటు కార్యక్రమాలు ఏర్పాటుచేస్తే శంకరయ్య సంఘం వాళ్లు పదకొండు రోజులపాటు కార్యక్రమాలు ఏర్పాటు చేశారు. పాట కచ్చేరీలూ,హరికథలూ.డ్యాన్సులూ డ్రామాలూ వగైరా ఏర్పాటు చేయడమేకాక ఒక 7, 8 వేలమంది సులభంగాకూర్చోగలిగినంత పందిరి కూడా వేస్తున్నారు. ఇదంతా చూసినవారు శంకరయ్య సంఘం వాళ్ళదే పైచేయిగా ఉందని చెప్పుకున్నారు. కొంతమంది అయితే ఇది రెండు సంఘాల పోటీయేగానీ నిజమైన భక్తితో చేసేది కాదని చాటుగా విమర్శించారు. నిజంగా భక్తితోనే చేసేదైతే అందరూ కలసికట్టుగా ఒకేచోట చక్కగా ఉత్సవాలు జరిపించ వచ్చుగా?. అని మరికొందరన్నారు. ఏదిఏమయినా వాళ్లు ఏర్పాటు చేసే కార్యక్రమాలవల్ల కలిగే వినోదం కన్నా ఈ రెండు సంఘాల మధ్య ఏర్పడిన వైషమ్యాలవల్ల కలిగే వినోదమే ఎక్కువ ఆసక్తిదాయకంగా ఉంటుందనే ఆశతో అందరూ వినాయకచవితి కోసం ఆత్రంగా ఎదురుచూడసాగారు.

రెండు వైపులవాళ్ళూ ఉత్సవాల పేరు చెప్పి చందాలు బాగానే వసూలు చేశారు. ఒకరికిచ్చి మరొకరివ్వకుండా ఉంటే బాగుండదని చాలామంది ఇద్దరికీ చందాలిచ్చారు. రామయ్యకూడా ఇద్దరికీ పెద్ద మొత్తమే ముట్టచెప్పాడు. అయినా శంకరయ్య సంఘం వాళ్లు చేస్తున్న ఏర్పాట్ల

ముందు రాధాకృష్ణ సంఘంవాళ్ళ ఏర్పాట్లు చాలా తీసికట్టుగా కనిపించాయి అందరికీ. ఈమాట చెవిన పడగానే శంకరయ్య ఎంతో పొంగిపోయాడు. తను అప్పుడే రాధాకృష్ణను ఓడించేసినట్టు ఊహించుకుని విర్రవీగసాగాడు.

* * *

వినాయకచవితి ఉత్సవాల సాకుతో శంకరయ్య,రాధాకృష్ణల మధ్య వైషమ్యం పెరుగుతున్న సంగతి నారాయణరావు గారికి తెలిసింది. వాళ్ళిద్దరూ తన ఆధ్వర్యంలో ఏర్పడిన బృందంలో ఉన్న విషయం కూడా ఆయనకుగుర్తుంది. అప్పుడు ఎలాంటి మనస్పర్థలూ లేక స్నేహంగానే వున్న వాళ్ళిద్దరి మధ్య ఇప్పుడు ఎందుకు మనస్పర్థలు పుట్టుకొచ్చాయో అర్థం కాలేదాయనకి. ఇద్దరికీ తెలిసినవాడుకొందరిని అడిగి చూశాడుకానీ వాళ్ళు కూడా తమకు సరిగ్గా తెలీదనే చెప్పేశారు. ఇద్దరి మధ్య మనస్పర్థలు పెరగడం ఎవరికీ మంచిదికాదని ఆలోచించి ఆయన వాళ్ళకు బుద్ధి చెప్పాలన్న నిర్ణయానికి వచ్చారు. అయితే తనకు వాళ్ళతో ఉన్న పరిచయం ఎప్పుడో ఏదో పనిమీద కలిసిమెలిసి తిరగడంవరకే! ఆ కాస్త పరిచయాన్ని పురస్కరించుకుని,- వాళ్ళ స్వభావాలేమిటో తెలుసుకోకుండా-ఈ వ్యవహారంలో తల దూర్చితే చివరికి ఏమవుతుందో అన్న అనుమానం తలెత్తింది ఆయనలో.అసలు వాళ్ళిద్దరూ తనమాట వింటారన్న నమ్మకం ఏమిటి? అలాఅని ఊరుకోడానికి కూడా మనసొప్పలేదు ఆయనకి. చివరికి ఏమయితే అదే అవుతుందని భావించి రాధాకృష్ణతో ఈ విషయం ప్రస్తావించారు.

“ఇందులో నా తప్పేమీ లేదు సార్! మేము మా విఘ్నేశ్వర యువక సంఘం ఆధ్వర్యాన వినాయక చవితి ఉత్సవాలు ప్రతియేటా జరుపుతున్న విషయం మీకందరికీ తెలిసిందే; మరి ఇప్పుడుకొత్తగా మరొక సంఘం స్థాపించి నాకు పోటీగా ఎందుకు ఉత్సవాలు జరపాలి ఆ శంకరయ్య?” అని అంతటితో ఊరుకోక శంకరయ్య గురించి అగౌరవంగా కూడా మాట్లాడాడు. “వాడేం చేస్తాడోచూస్తాను” అన్న సవాలు అతని మాటల్లో ధ్వనించింది.

‘ఒకరితో మరొకరుకలిసి స్నేహంగా ఉండడం వాళ్ళకే ఇష్టం లేనప్పుడు తను మాత్రం ఏం చేయగలడు?’ అనుకుని నారాయణరావుగారు అంతటితో ఊరుకున్నారు.ఇన్నాళ్ళూ ఎవరిజోలికిపోకుండా హాయిగా ఉన్న తాను ఇప్పుడు వీళ్ళ మధ్యకెందుకు వచ్చానా అని బాధపడ్డారు కూడా! అసలు తనను వీళ్ళెందుకు తమ వైపు లాక్కున్నారో ఎంత ఆలోచించినా ఆయనకు అర్థం కావడంలేదు. రోడ్డు పని గురించిన వివరాలు ఎవరూ చెప్పడం లేదు తనకు. తనంతట తానుగాఅడిగినా ముక్తసరిగా ఏవో రెండు ముక్కలుచెప్పి ఊరుకుంటారే తప్ప వివరాలేవీ చెప్పరు. చెప్పవలసిందేమీ లేకనే వాళ్ళు చెప్పడంలేదేమో అని మొదట్లో అనుకున్నాడుగానీ, ఇప్పుడు మాత్రం కావాలనే వాళ్ళు అలా చేస్తున్నారనీ, తనను అజ్ఞాతంగా ఉంచడమే వాళ్ళ ఉద్దేశమై ఉంటుందనీ గ్రహించాడు. ఇక వీళ్ళ మధ్యనుంచి తప్పుకోవడమే మంచిదన్న నిర్ణయానికి వచ్చేశారాయన. అయితే రాజీనామా చేయడానికదేమీ ఒక సంస్థకాదు; తనకు పదవీలేదు.

వాళ్ళవిధానం ఇష్టం లేకపోతే మెదల

కుండా ఊపుకోవడం వరకే తన పని. అవసరం ఉన్నప్పుడు తన దగ్గరికి వచ్చి బతిమాలి తీసుకు వెళ్ళారు. అవసరం తీరిపోయాక తనను మూల పడేశారు. అంతేగా ! ఇకనుంచైనా జాగ్రత్తగా ఉండాలి అనుకున్నారు.



# 13

వినాయక చవితి పండగ రేపనగా ఉత్సవాల ఏర్పాట్లన్నీ పూర్తయిపోవాలి కాబట్టి రెండు పార్టీల వాళ్ళూ హడావిడిగా పనిచేస్తున్నారు. శంకరయ్య సంఘంవాళ్ళు అప్పుడేపందిరి పనికూడా పూర్తిచేసేశారు. రంగు రంగుల కాగితం పూలతోనూ, రిబ్బన్లతోనూ పందిరిని చక్కగా అలంకరించారు. ఇక మామిడాకుల తోరణాలు దీపాలంకరణ మాత్రం మిగిలి వున్నాయి. అవి కూడా సాయంకాలానికల్లా పూర్తి చేసేయాలని వాళ్ళ ఉద్దేశం. అప్పటికే అందరూ అటువైపుఆకర్షితులై ఆ పందిరి కేసే చూస్తూ నిలబడిపోతున్నారు.

పార్కులో రాధాకృష్ణ సంఘం వాళ్ళ కార్యకలాపాలు ఇంకా సగమన్నా పూర్తి కాలేదు. వాళ్ళు చాలా నిదానంగా పని చేస్తుండడం చూసి 'పండగంతా అయిపోయాక వీళ్ళ పని పూర్తవుతుందేమో' అని చూసిన వాళ్ళంతా ఎగతాళి చేయడం మొదలెట్టారు.

సాయంకాలమవుతున్న కొద్దీ పార్కులో కార్యకలాపాలు జోరుగా కొనసాగాయి. వినాయకుణ్ణి కూర్చోపెట్టేచోట మంటపం పూర్తయిపోయింది. దానికి రంగు రంగుల దీపాలు అమర్చడం మొదలెట్టారు.

రాత్రి పదకొండయ్యేసరికి దీపాలంకరణ, తోరణాలపని పూర్తి చేశారు. పార్కులో ఉన్న చెట్లన్నిటిమీదా దీపాలు గుత్తులు గుత్తులుగా అమర్చారు. పన్నెండయ్యేసరికి నిద్ర ఆపుకోలేక కొంతమంది కుర్రాళ్ళు ఇళ్ళకు వెళ్ళి పోయారు. కొందరిని వీళ్ళేబలవంతాన పంపించేశారు. మరి కొంత మందేమో "ఇంటికి వెళ్ళి పడుకుని ఉదయమే రండి" అని రాధాకృష్ణ ఎంతగా చెబుతున్నా వినిపించుకోకుండా అక్కడే ఉండిపోయారుమొండిగా. తమకు నిద్రరావడంలేదని చెప్పి అంతగా నిద్రవస్తే ఇక్కడే పడుకుంటామన్నారు. దాంతో రాధాకృష్ణకు పెద్ద ఇబ్బంది వచ్చి పడింది. వెళ్ళమని ఇంకా బలవంతపెడితే వాళ్ళకనుమానం వస్తుంది. ఉండనిస్తే ఇంకాసేపట్లో తాను చేయబోయే పనికి అంతరాయం కలుగుతుంది. ఏం చేయడమా అని అతను ఆలోచిస్తూంటే అంతలో రాగన్న వచ్చి అతను ఆదుకున్నాడు. కాసేపుఇటూ అటూ తిరిగి ఏదో వెతుకుతున్నట్టు నటించి "అరెరె ఎంతపనయింది. రేపు పొద్దున్న వినాయకుణ్ణి కూర్చోబెట్టినతర్వాత మంటపానికినాలుగు వైపులాతోరణాలు కట్టాలి కదా – తీరా చూస్తే మామిడాకులే లేవు. పార్కులో కూడా నాలుగైదు చోట్ల తోరణాలు కట్టాలి. తోరణాలు ఎక్కువగా ఉన్నకొద్దీ చూడ్డానికి అందంగా ఉంటుంది" అని తనలోతను అనుకుంటున్నట్టు అని "ఇప్పటికైనా ఎవరైనా వెళ్ళి తెస్తే బావుణ్ను"

అన్నాడు గట్టిగా.

ఆ మాట చెవిన పడిందే తడవుగా మామిడాకుల కోసం బయలుదేరబోయారు ఆ కుర్రాళ్ళు.

"ఇంత రాత్రప్పుడు వద్దులెండి ... కాసేపు పడుకుని నిద్రపోయి ఆ తర్వాత వెళ్ళండి" అని రాధాకృష్ణ చెబుతున్నా వినిపించుకోకుండా మామిడితోట అక్కడికి చాలా దూరం కనుక వెళ్ళి తీసుకొచ్చేటప్పటికి చాలా సేపు పడుతుందని చెప్పి అప్పుడే బయలుదేరారు.

వాళ్ళటు వెళ్ళిపోయిన తర్వాత రహస్యం తెలియని వాళ్ళింకెవరైనా ఉన్నారా-అని రాగన్న ఓసారి చుట్టూ పరికించి చూశాడు. ఇంకెవరూ లేరని నిర్ధారణచేసుకున్న తర్వాత-తవ్వవలసిన చోటును మరోసారి పరీక్షించి అక్కడ గుర్తు పెట్టాడు.

అర్ధరాత్రి వేళ రెండు గంటలప్పుడు పలుగు, పారా వగైరా సామానులన్నీ మెల్లిగా బయటికొచ్చాయి. అందరూ మంచి నిద్రలో ఉన్నందువల్ల అక్కడికి ఎవరూ వచ్చే ప్రమాదం లేదు. ఒకవేళ ఆ దారమ్మట వెళుతూ ఎవరైనా అటు చూసినా ఉత్సవం కోసం ఏర్పాట్లు జరుగుతున్నాయి లెమ్మనుకుని వెళ్ళిపోయే వారు అంతే! అయినా సందేహ నివృత్తికోసం రాగన్న రాధాకృష్ణ లిద్దరూ పొక్క చూట్టూ, ఓ సారి కలయతిరిగి చుట్టుపక్కల ఇళ్ళల్లోని వారెవరైనా మెలకువగా ఉన్నారా-అని పరిశీలించి చూశారు. ఎవరూ మెలకువగా లేరని రూఢి చేసుకున్న తర్వాత గుర్తు పెట్టుకున్న చోట మెల్లగా తవ్వడం ప్రారంభించారు.

గొయ్యి నాలుగడుగుల లోతుండేవాలని, గోతిచుట్టూ మట్టి సమానంగా ఉండకుండా కాస్త చెదిరినట్టుగా ఉండాలనీ, విరజిమ్మినట్టుగా మట్టి కనిపిస్తుంటే విగ్రహం భూమిలోంచి పైకి చొచ్చుకుని వచ్చినట్టుగా కనిపించి ఎవరికీ అనుమానం రాదని రాగన్న రాధాకృష్ణకు వివరించి చెప్పి తను విగ్రహం తీసుకురావడానికి వెళ్ళాడు.

రామయ్యగారి రైస్‌మిల్‌లో సిద్ధంగా ఉన్న లారీని తీసుకుని శిల్పి రామాచారి ఇంటికి వెళ్ళి అక్కణ్ణించి విగ్రహం తరలించుకు వచ్చేసరికి పొక్కలో గొయ్యి సిద్ధంగా ఉంది. ఏ మాత్రం చప్పుడు కాకుండా అతి జాగ్రత్తగా విగ్రహాన్ని దింపి, తీసికెళ్ళి గోతిలో నిలబెట్టి మెడదాకా పూడ్చి శిరోభాగం పైకి సరిగ్గా కనిపిస్తుందో లేదో అని పరీక్షించి అంతా సరిగ్గా ఉందని నిర్ధారణ కాగానే పైనంతా పల్చగా మట్టి చల్లేశారు.

రాగన్న ధర్మమా అని వినాయకుడు మట్టిలో కప్పబడిపోయాడు. ఆ విగ్రహం భూమిలోంచి ఉద్భవించి వచ్చినట్టు కనిపించడం కోసం మట్టిగడ్డలను ఏరి నేల బీటవేసినట్టుగా పేర్చిపెట్టారు.

జనం ఎక్కువ సంఖ్యలో పోగయిపోతే ఎవరైనా రహస్యం కనిపెట్టే ప్రమాదం ఉంది కాబట్టి, ఓ నలుగురు చేరగానే హడావిడిపడిపోయి గబగబా మట్టి అంతా తవ్వేసి విగ్రహాన్ని బయటికి తీయవలసినదిగా రాధాకృష్ణను ఆదేశించి రాగన్న నిశ్చింతగా ఇంటికి వెళ్ళిపోయాడు.

* * *

గణపతిశాస్త్రిగారికి హఠాత్తుగా మెలకువ రావడంతో ఆయన కళ్ళుతెరిచి ఒకసారి కిటికీకేసి చూశారు. బయటంతా



ఇంకా చీకటిగా ఉంది. ఇప్పుడప్పుడే తెల్లారే సూచనలేవీ కనిపించలేదు. ఇంకా కాసేపు పడుకుందామని కళ్ళు మూసుకుని మళ్ళీ నిద్రపోవడానికి ప్రయత్నించారు కానీ ఎంత ప్రయత్నించినా నిద్ర రాలేదు. అటూ ఇటూ దొర్లి దొర్లి, విసుగుపుట్టి పక్కమీదినుంచి లేచేశారు. లైటువేసి గడియారంకేసి చూస్తే ఇంకా మూడున్నరే అయింది. అంత చీకటినే పూలకోసం బయలుదేరితే పూలకూ, ఆకులకూ తేడా కనిపించకపోవచ్చుననుకుని లైటార్పేసి మళ్ళీ పక్కమీద వాలిపోయారు. ఆయన పెద్దకూతురు శాంత "అప్పుడే లేచేశారేం నాన్నా...?" అని అడిగేసరికి, గణపతి శాస్త్రిగారు ఆమెవైపుచూసి 'అనవసరంగా ఈమెనుకూడా లేపేశానే?'అని మనసులో నొచ్చుకున్నారు.

"నువ్వెందుకు లేచావమ్మా?" అన్న ప్రశ్నకు ఆమె జవాబేమీ చెప్పకుండా మౌనంగా ఉండిపోయింది.ఆమె కారణంగా తనకే నిద్ర పట్టనప్పుడు ఇక ఆమెకెలా నిద్రపడుతుందని సరిపెట్టుకుని గోడవైపు తిరిగి పడుకున్నారు.

ఆయన ప్రైమరీ స్కూల్లో టీచరుగా పనిచేసి పదేళ్ళక్రితం రిటైర్ అయ్యారు. అప్పటికి ఆడపిల్లలు నలుగురూ ఇంకా చిన్నవాళ్ళు. ఇంకో అయిదేళ్ళవరకైనా ఉద్యోగావకాశం ఉన్నట్టయితే కనీసం ఇద్దరమ్మాయిలకైనా పెళ్ళి చేసేవారుకదా అని ఎన్నోసార్లు అనుకున్నారు ఆయన.

కాని అంతకంతకూ మీదపడుతున్న వయసు ఆయనను అంతవరకూ ఉద్యోగంలో ఉండనివ్వలేదు. రిటైరయ్యాక, పెళ్ళిమాట అటుంచి వాళ్ళకు సరైన తిండికూడా పెట్టలేని స్థితికి వచ్చారు ఆయన. జీవన నిర్వహణకు ఇక వేరే మార్గంలేక ఒక నలుగురైదుగురు పిల్లలకు ట్యూషన్లు ఏర్పాటు చేసుకున్నారు. అది కాక మరో నాలుగైదిళ్ళల్లో దేవతార్చనకు కూడా కుదురుకుని కుటుంబాన్ని ఎలాగోలా లాక్కువస్తున్నారు. పెద్ద కూతురు శాంత పి. యు. సి. వరకు చదువుకుని ఇక ఆపైన చదువుకునే స్తోమతలేక ఎవరి దయాభిక్షవల్లనో దొరికిన చిన్న ఉద్యోగం చేస్తోంది. ఇప్పటికైనా ఆమెకు పెళ్ళి చేసేద్దామంటే ఎంతకీ వీలుపడడం లేదు. అంతేకాక శాంతకూడా 'నా పెళ్ళి గురించి మీరు ఊరికే బాధపడకండి నాన్నా...ముగ్గురు చెల్లెళ్ళను పోషించే బాధ్యత నాపైన ఉన్న సంగతి మీకు తెలుసుకదా!' అనడంతో, ఆ మాటలోని చేదు నిజాన్ని గ్రహించిన వారై మెదలకుండా ఉండిపోయారు శాస్త్రిగారు. అయినా తండ్రిగా కూతురి పట్ల తనకున్న బాధ్యతను సక్రమంగా నిర్వహించలేకపోయానే అన్న దిగులు మాత్రం ఆయనను లోలోపల క్రుంగదీస్తూనే ఉంది. ఆ దిగులును వీలైనంత వరకూ మరచిపోవడంకోసం రోజులో ఎక్కువ భాగాన్ని ఆయన దేవుడి పూజలోనే గడిపేస్తున్నారు. ఇంట్లో పూజకాక బయట పూజకు కూడా ఒప్పుకున్నారు. తెల్లవారుఝామున అయిదు గంటలకే నిదలేచి స్నానంచేసి కాసేపు అలా చల్లగాలిలో తిరిగి వచ్చి, వస్తూ వస్తూ దొరికిన పూలన్నీ సేకరించుకొచ్చి పూజకు కూర్చునేవారు. ఇంటో పూజ పూర్తవగానే బయట తానొప్పుకున్న ఇళ్ళల్లో పూజ చేయడం కోసం ఏడు గంటలకు ఇల్లు వదిలి వెళ్ళిపోయేవారు.

ఆ రోజుకి ఇక నిద్రపట్టదని తెలిసి, పక్కమీద దొర్లడం విసుగు పుట్టిలేచారు. ఆ రోజు వినాయక చవితి పండగ కూడా! అందరిళ్ళల్లోనూ వ్రతం చేయించాలికాబట్టి త్వరగా బయలుదేరితే మంచిదని భావించి పెరట్లో కొళాయి దగ్గరికి వెళ్లారు. చన్నిళ్ళతో స్నానంచేసి మడి బట్టలు కట్టుకుని పూలకోసం బయలు దేరారు గణపతి శాస్త్రిగారు. దారి పొడుగునా అందరిళ్ళలోనూ కాంపౌండు బయటికి పాకిన కొమ్మల్లోంచి చేతికందిన పూలను కోసుకుంటూ ముందుకు సాగిపోయారు.

పార్కు దగ్గరికొచ్చేసరికి ఆయన కాళ్ళు హఠాత్తుగా ఆగిపోయాయి. "కుర్రాళ్లు దేవుడి కోసం ఏమేం చేశారో చూసైనా వెళదాం' అనుకుని పార్కులోకి దారితీశారు. మంటపం అలంకరణ చూసి ఓ సారి చుట్టూ కలయ తిరిగి, ఇక వెళ్ళిపోదామనుకుంటూ వుండగా దీప కాంతిలో ఏదో తళుక్కున మెరిసినట్టు కనిపించింది. దగ్గరగా వెళ్ళి చూస్తే ఏమీ కనిపించలేదు. ఇంకాస్త దగ్గరగా వెళ్ళారు. అక్కడ కొంచెం ఎత్తుగా ఉన్నదేదో మసక మసకగా కనిపించినట్టయింది. కళ్ళు నలుముకుని మళ్ళీ చూశారు.అవును నిజమే ... ఏ మాత్రం సందేహం లేదు. అనుకుంటూ మళ్ళీ మళ్ళీ చూశారు. అక్కడ వినాయకుడి ముఖం స్పష్టంగా కనిపించింది. "స్వామీ...విఘ్నేశ్వరా..

నా తండ్రీ...ఈ వేళ నువ్వే ప్రత్యక్షంగా వచ్చేశావా స్వామీ...! శివ శివా...... వినాయక స్వామీ..." అంటూ దీర్ఘదండ ప్రణామం చేసిన వారల్లా భక్తి పారవశ్యంతో అలాగే ఉండిపోయారు. "ఈ కలికాలంలో కూడా నిన్ను ప్రత్యక్షంగా చూడగలగడం నేనుచేసుకున్న పూర్వజన్మ సుకృతమే కానీ మరొకటి కాదు.ఇందుకేనా తండ్రీ రోజుకన్నా త్వరగా నన్ను నిద్ర లేపావు? పరమాత్మా...విఘ్నేశ్వరా... ఈ పాపిని ఇప్పటికి కరుణించావా? విఘ్నేశ్వరా..." అంటూ మళ్ళీ పైకి లేవకుండా అలాగే ఉండిపోయారు.

అక్కడే మంటపం దగ్గర పడుకున్న కుర్రాళ్ళు ఇదంతా గమనిస్తూనే ఉన్నారు. వాళ్ళకన్నీ కన్పిస్తూనే ఉన్నాయి. ఆయన నోటినుంచి"విఘ్నేశ్వరా...విఘ్నేశ్వరా" అన్నమాట అవ్యాహతంగా వెలువడుతోంది. ఇదే మంచి సమయంగా భావించి, అప్పుడే నిద్రలేచినట్టు నటించిన ఆ కుర్రాళ్ళు "అయ్యో...అయ్యో...వినాయకుడు...వినాయకుడు..." అని కేకలు పెడుతూ లేచి వచ్చేశారు. చుట్టుపక్కల ఉన్న ఇళ్ళల్లో పండగ రోజని త్వరగా నిద్రలేచిన వాళ్ళందరూ ఈ కేకలు విని పార్కుకేసి పరుగెత్తుకొచ్చారు. వచ్చి చూస్తే అక్కడ విఘ్నేశ్వరస్వామి ఉద్భవమూర్తి కనిపించింది. దాన్ని చూసిన వెంటనే వెనక్కి తిరిగి ఇంటికి వెళ్ళి మిగిలిన వాళ్ళను కూడా నిద్రలేపుకొచ్చి ఈ వింత చూపించారు. వాళ్ళు ఇంకొందరిని పిలుచుకొచ్చారు. ఇలా సూర్యోదయమయ్యేసరికి పార్కునిండా జనం మూగిపోయారు.

ఈ అద్భుతాన్ని చూసినవారందరూ ఏదో అలౌకికమైన ఆనందం పొందిన వారిలా పరవశించి పోయారు. పార్కులో వినాయకుడు ఉద్భవించాడు. నేలనుచీల్చుకుని పైకొచ్చేశాడు. శాస్త్రిగారు ఆ దేవుణ్ని స్మరిస్తూ ఆయన సన్నిధిలో సాష్టాంగ పడివున్నారు. కొంత మంది దగ్గరగా వెళ్ళి ఆయనను పలకరించాలని చూశారుగానీ, ఆయన మాత్రం ఈలోకపు ధ్యాసలోనే లేరు.

సరిగ్గా అప్పుడే గుంపు మధ్యలోంచి దూసుకొచ్చాడు రాగన్న. ఏమీ ఎరగని వాడిలా "ఏమిటి...ఏం జరిగిందీ...?" అని అడిగి విషయం తెలుసుకున్నట్టు నటించి "స్నానంచేసి మడి కట్టుకున్న వాళ్ళెవరైనా ఉంటే వచ్చి ఈయన్ని ఇక్కణ్నుంచి లేపి అవతల పడుకోబెట్టండి" అని పురమాయించాడు.

అసలు జనం ఎప్పుడూ ఏమీస్వయంగా చేయలేదు. వాళ్ళకు "ఇలా చేయండి... అలా చేయండి" అని పురమాయించే వాళ్ళెవరైనా ఉండాలి ఎప్పుడూ.అందుకనే కాబోలు రాగన్న అలా చెప్పగానే అప్పటికే స్నానంచేసి మడికట్టుకున్న వాళ్ళు ఐదారుగురు వచ్చి శాస్త్రిగారిని లేవనెత్తి, తీసికెళ్ళి కాస్త ఎడంగా పడుకోబెట్టి, ఆయనకు విసరడం ప్రారంభించారు.

అయితే పార్కులో వినాయకుడు నిజంగానే ఉద్భవించాడనుకుని భక్తి పారవశ్యంలో స్పృహతప్పిపోయిన శాస్త్రిగారిని మునుముందు బాగా ఉపయోగించుకోవచ్చన్న ఆలోచన కూడా వచ్చిందతనికి. చుట్టూ వున్న జనాన్ని ఓసారి పరికించి చూశాడు "వాళ్ళు మళ్ళీ తన ఆజ్ఞకోసం వేచివున్నారని గ్రహించి "వినాయకుడు పైకి రావడానికి చాలా కష్టపడుతున్నాడు పాపం. అందరూ ఓ చెయ్యి

వేసి మట్టిని తీసేయండి" అని పురమాయించాడు. అందరూ కలిసి క్షణంలో ఆ పని పూర్తి చేసేశారు. పద్మాసనం వేసుకు కూర్చున్న అందమైన వినాయకుడు ఆ మట్టిలోంచి సాక్షాత్కరించాడు. "ఇప్పుడేం చేయడం?" అని ఎవరో అడిగినందుకు "ఇప్పుడేం చేయకూడదు. తర్వాత తతంగమంతా శాస్త్రోక్తంగా జరిపించాలి" అన్నాడు రాగన్న.

ఉద్భవమూర్తిని దర్శించడానికి వచ్చే వారి సంఖ్య అంతకంత పెరిగిపోవడంతో వాళ్ళను అదుపులో పెట్టడమే పెద్ద ప్రయాస అయిపోయింది — విఘ్నేశ్వర యువక సంఘం వారికి. వచ్చిన వాళ్ళు వచ్చినట్టే ఆ విగ్రహం ముందే నిలబడి పోతున్నారు. తర్వాత వచ్చిన వాళ్ళు విగ్రహాన్ని చూడాలన్న ఆత్రుతతో ముందున్న వాళ్ళను తోసుకుంటూ రావడం మొదలెట్టారు. ఇక వీళ్ళను అదుపులో పెట్టడం తమవల్ల కాదనుకున్న సంఘ సభ్యులు పోలీసుల సహాయం కోరారు. అయితే పోలీసులు కాసేపు ఆలోచించి చివరికి అందరినీ 'క్యూ'లో నిలబడవలసిందిగా చెప్పారు. వాళ్ళ మాటలకు విలువనివ్వక లేక వాళ్ళ చేతిలోని లాఠీలకు భయపడో జనం బారులు తీరి నిలబడడం ప్రారంభించారు. నిమిషాల మీద ఆడవాళ్ళదొక 'క్యూ', మగవాళ్ళదొక 'క్యూ' తయారయిపోయాయి. చూస్తూచూస్తూ ఉండగానే ఆ 'క్యూ'లు మైలు దూరం వరకూ పెరిగిపోయాయి.

గంట రెండు గంటలు గడిచేలోగా రాగన్న, రాధాకృష్ణ వెళ్ళి పురోహితులను పిలుచుకొచ్చారు. వాళ్ళే కాక ఇంకా కొంతమంది పురోహితులూ, సిద్ధాంతులూ ఈ సంగతి విని అక్కడికి హుటాహుటిని చేరుకున్నారు. "ఇప్పుడు జరగవలసిన కార్యక్రమమేమిటి?" అని వాళ్ళు తమలో తామే చర్చలు జరిపారు. ఉద్భవమూర్తి కాబట్టి కొత్తగా ప్రతిష్ఠాపన చేయవలసిన అవసరం లేదనీ, విఘ్నేశ్వరుడు తనంతట తానే అక్కడ ప్రతిష్ఠితుడై పోయాడనీ అందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు. విగ్రహాన్ని వేరే చోటునుంచి తెచ్చి ప్రతిష్ఠాపన చేయాలంటే దానికి ధార్మిక విధులు చాలా వుంటాయి. కానీ ఇప్పుడు అవేవీ అవసరం లేదు. దేవాలయాల్లో ప్రతినిత్యం జరిగే అర్చనలూ అవీ జరిగితే చాలు అని వాళ్ళల్లో వయోవృద్ధులు అభిప్రాయపడ్డారు. ఆ అభిప్రాయం అందరికీ నచ్చినా తమ సంతృప్తికోసం పుణ్యాహవచన దగ్గరినుంచీ మొదలుకొని కుంభాభిషేకం, గణపతి హోమం, సహస్రనామార్చన, గణపతి మూలమంత్ర జపం చతుర్వేద పారాయణం — వగైరా అన్ని విధులనూ అయిదు రోజుల పాటు శాస్త్రోక్తంగా జరిపించాలని తీర్మానించారు.

ఈలోగా శాస్త్రిగారు కాస్త తేరుకున్నారు. అయినా ఆయనలో ఇంకా భక్తి పారవశ్యం తగ్గలేదు. ఆయన కళ్ళల్లోంచే ఆనందబాష్పాలు నిర్విరామంగా స్రవిస్తూనే ఉన్నాయి. నోటినుంచి "విఘ్నేశ్వరా...విఘ్నేశ్వరా..." అన్న మాట అప్రయత్నంగా వెలువడుతూనే వుంది. అసలు జరిగిందేమిటో ఆయన ఎవరికీ చెప్పకముందే అక్కడ ఒక కట్టుకథ ప్రచారంలోకి వచ్చేసింది. శాస్త్రిగారికి [illegible] వేళ వినాయకుడే స్వయంగా [illegible] కనిపించి తను ఇక్కడ [illegible]

న్నానని చెప్పాడట! ఆ తర్వాత అన్నట్టుగానే ఇక్కడ ఉద్భవించి తొలి సారిగా ఆయనకే దర్శనమిచ్చారట! వినాయక చవితి రోజున వినాయకుడి ఉత్సవాలు జగిగేచోటే ఉద్భవించి-అదే తన పేరుగల గణపతిశాస్త్రి గారికే తొలి దర్శన మిచ్చిన ఆ వినాయకస్వామిని దర్శించగలిగిన తాము ఎంతో ధన్యులమని భావించి, ఉన్న చోటే లెంపలేసుకుని దండం పెట్టుకున్నారు భక్తులు.

అక్కడ చేరిన వాళ్ళంతా ఉద్భవ మూర్తినిగురించిన కథలోనే లీనమైవుంటే, రాధాకృష్ణ సంఘంలోని సభ్యులకు మరో సమస్యఎదురైంది. 'వినాయకుడివిగ్రహాన్ని ఇప్పుడు ఉన్నచోటే పూజించాలా లేక తీసుకొచ్చిమంటపంలో కూర్చోబెట్టి పూజించాలా?' అన్నదే ఆ సమస్య.

వాళ్ళల్లో వాళ్ళకి అభిప్రాయభేదాలు మొదలవక ముందే కొంతమంది తెలివిపరులు కల్పించుకొని "యువక సంఘ సభ్యులు ముందుగానే సంకల్పించుకున్నారు కాబట్టి మట్టి వినాయకుణ్ని తెచ్చి పూజించి విసర్జించవలసిందే!" అని రెండు పక్షాల వాళ్ళనూ ఒప్పించారు. వెంటనే యువక సంఘ సభ్యులు వినాయకుణ్ని తీసుకొచ్చేందుకు బజారుకు వెళ్ళారు. విఘ్నేశ్వరుణ్ని ప్రప్రథమంగా దర్శించిన గణపతిశాస్త్రిగారు వేదాధ్యయనం చేసిన పండితులు కాబట్టి జరగవలసిన విధులన్నీ ఆయన ఆధ్వర్యంకిందే జరగాలనీ, ఆ తర్వాత ఇక్కడ అర్చక స్థానాన్ని ఆయనే చేపట్టవలసిందనీ పెద్దలందరూ నిర్ణయించటంవల్ల ఆయనను తీసుకొచ్చి అక్కడ కూర్చోబెట్టారు. పూజలూ,పునస్కారాలూ మొదలెట్టేముందు శుభసూచకంగా మంగళ



వాద్యాలు మారుమోగాయి. మధ్యాహ్నా మయ్యేసరికి ఈ వార్త మొత్తంనగరమంతా పాకిపోయి నగరానికి నగరమేతరలివచ్చే సింది అక్కడికి. దాంతో మిగతా చోట్ల ఏర్పాటు చేసిన ఉత్సవాలకు జనమే లేక పోయారు. పార్కుకు కాస్త దూరంగా శంకరయ్య సంఘంవారు వేసిన పందిరి జనమేలేక బోసిపోయింది.

అయిదు రోజులపాటు పూజావిధులు యథావిధిగా జరిగాయి. ముందుగా ఏర్పాటు చేసిన కార్యక్రమాలతో బాటు రాత్రింబవళ్ళు భజనలు, జానపదనృత్యాలు బుర్రకథలు మొదలైనవన్నీ జరుగుతూ జనాన్ని బాగా ఆకట్టుకున్నాయి. అక్కడ నగర వాతావరణమే మారిపోయి ఏదో పల్లెటూరి తిరనాళ్ళలా అనిపించింది. దూరప్రాంతాల నుంచి వచ్చిన వారికిఅన్న సంతర్పణలు జరిగాయి; అక్కడక్కడ చలి కేంద్రాలు తెరువబడ్డాయి. ఆ రోడ్డు పొడుగునా చిల్లర వ్యాపారస్తులు బారులు తీరికూర్చుని తాము తెచ్చిన సరుకులను అమ్ముకుంటున్నారు. వాళ్ళ వ్యాపారం బాగా సాగిపోతోంది.

ఇలా భక్తులతోనూ, వ్యాపారస్తుల తోనూ నిండి కిటకిటలాడి పోతున్న ఆ రోడ్డు మీద మామూలు సంచారాలు స్తంభించిపోయాయి.

నగరంలో ఎక్కడ చూసినా వినాయకుడి ఉద్భవం గురించిన ప్రసక్తే! "ఎలా ఉద్భవించింది? ఈ కాలంలో కూడా ఇవన్నీ ఎక్కడ జరుగుతాయి? అని ఎవరైనా సందేహం వ్యక్తపరిస్తే చుట్టూ ఉన్న పదిమంది కలిసి వారి నోరు మూయించేసేవారు.

వినాయకుడు ఉద్భవించేముందు ఆ స్థలంలో ఏమేమి అద్భుతాలు జరిగాయో జనం వర్ణించి వర్ణించి కథలు చెప్పుకో సాగారు. ఆరోజు రాత్రి పెద్దపేలుడు శబ్దం వినిపించిందట! ఒక మైలు దూరం వరకూ భూమి కంపించిందట! ఆ విగ్రహాన్నే చూడడానికి వెళ్ళిన మూగవాళ్ళకు మాటలొచ్చాయట! గుడ్డివాళ్ళకు చూపు లొచ్చాయట; కాళ్ళులేని వాళ్ళకు కాళ్ళొచ్చాయట!

జనం ఇలా మాటలతోనే కోటలు కడుతూవుండగా, ఒక వారం రోజుల వ్యవధిలోనే ఆ విగ్రహం చుట్టూ గర్భగుడి నిర్మాణం పూర్తయి పోయింది. ముందు ముందు పెద్దగుడి కూడా కట్టే ఆలోచన ఉందని తెలిసి కొందరు భక్తులు ఎవరో అడక్కుండానే విరాళాలివ్వడానికి సిద్ధపడ్డారు.

ఇంత జరుగుతున్నా పురపాలక సంఘం అధికారులు ఎవరూ ఇటుకేసి కన్నెత్తయినా చూడలేదు. వాళ్ళల్లో కొందరు రహస్యంగా వచ్చి దేవుడికి కొబ్బరికాయ కొట్టించుకుని వెళ్లారట!

ఒక్కసారిగా తమ సమస్యలన్నీ పరిష్కారమైపోయినందుకు అటు రామయ్య, ఇటు రాగన్న, రాధాకృష్ణ ఎంతో సంతోషపడిపోయారు.

రోజులు గడుస్తున్నకొద్దీ వినాయకుడు తన స్థానాన్ని భద్రపరుచుకోసాగాడు. ఎవరో పుణ్యాత్ముడు ఆ చిన్న గర్భగుడికి పైకప్పు వేయించాడు. ఇక అక్కడి కొచ్చే భక్తుల సంఖ్య నానాటికీ పెరిగిపోయి పార్కెప్పుడూ వచ్చే పోయేవాళ్లతో కిటకిటలాడుతూ వుండేది.

గణపతిశాస్త్రిగారు ఇంకా అక్కడ వినాయకుడు నిజంగా ఉద్భవించాడనే

నమ్ముతున్నారు. ఎవరైనా అడిగితే పారవశ్యం చెంది ఆనాటి సంఘటనను వర్ణించి వర్ణించి చెబుతారు.

ఒకసారి శిల్పి రామాచారి కూడా అక్కడికి వచ్చాడు. శాస్త్రిగారు ఆయనకి కూడా వినాయకుడి ఉద్భవ చరిత్ర చెబుతూంటే ఆయనకి నవ్వాగలేదు. ప్రసాదం స్వీకరించి గబగబా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

శాస్త్రిగారికిప్పుడు విఘ్నేశ్వరుడే సర్వస్వం. రాత్రింబవళ్లూ ఆ వినాయకుణ్ణే స్మరిస్తూ భార్యాపిల్లల్నీ, పిల్లల పెళ్ళి సమస్యల్నీ మరచిపోయి హాయిగా విఘ్నేశ్వరుడి సన్నిధిలోనే కాలం గడిపేస్తున్నారు. ఆయన సేవకే తన జీవితాన్ని అంకితం చేసేసుకున్నారు.



## 14

పార్కులో విఘ్నేశ్వరుడు ఉద్భవమైన కొన్నిరోజుల తర్వాత పురపాలక సంఘ కార్యాలయానికీ, ప్రభుత్వ కార్యాలయాలకీ ఎన్నో విజ్ఞాపన పత్రాలు అందాయి. పార్కులో విఘ్నేశ్వరుడు ఉద్భవించి అదొక యాత్రాస్థలంగా మారిపోవడంచేత అక్కడి రోడ్డును వెడల్పుచేసే విషయంలో పునర్ పరిశీలన జరగాలని కోరుతూ రాసిన విజ్ఞాపన పత్రాలవి. తొలుత అనుకున్నట్టుగనుక ఆ కార్యక్రమం జరిగితే దేవాలయాన్ని పడగొట్టి విగ్రహాన్ని అక్కణ్ణించి కదలించవలసి వస్తుందనీ, అలా చేయడం మన హిందూ ధర్మానికే విరుద్ధమనీ, ఈ అంశాన్ని దృష్టిలో పెట్టుకుని దేవాలయానికి ఏ విధమైన హానీ కలగకుండా రోడ్డు వెడల్పుచేసే విషయాన్ని పునర్ పరిశీలన జరపాలనీ రాశారు. ఆ విజ్ఞాపన పత్రాల్లో.రాగన్న సలహాలవల్ల రామయ్యే ఈ పత్రాలను రాయించి వందలకొద్దీ సంతకాలు సృష్టించి వాళ్ళకు పంపించాడని వేరే చెప్పనక్కర్లేదు.

ఆ విజ్ఞాపన పత్రాలు అందుకున్న పదిహేను రోజులకు అధికారులు వచ్చి మరోసారి రోడ్డును పరిశీలించారు. వాళ్ళు వచ్చే టైమును ముందుగానే తెలుసుకుని ఆ వేళకు సరిగ్గా అక్కడికి చేరుకున్న రామయ్యా తాలూకు మనుషులు కొందరు 'ఏమైనా దేవాలయాన్ని పడగొట్టడం మహా పాపమని' వాళ్ళను హెచ్చరించారు. నాలుగైదు గంటలసేపు రోడ్డును మళ్ళీ మళ్ళీ కొలిచి వివరాలన్నీ నోట్ చేసుకుని రోడ్డుకటూ ఇటూ రెండు వైపులా కాస్త కాస్త స్థలాన్ని ఆక్రమించుకునే బదులు ఒకే వైపున ఎక్కువ స్థలాన్ని తీసుకుంటే సరి - అన్న నిర్ణయానికి అధికారులు వచ్చారు. దేవాలయానికి నాలుగడుగులు దూరం వరకూ స్థలం తీసుకుంటే చాలు. రోడ్డు కాస్త నేరుగా వుంటుంది - అని తీర్మానించి ఆ విషయాన్ని తమ నివేదికలో పొందుపరిచి పైఅధికారులకు పంపారు.

* * *

ఇదంతా జరిగేలోగా పురపాలక సంఘం ఎన్నికలు వచ్చేశాయి. ఆ ఎన్నికల హడావిడిలోపడి ఎవరూ ఈ నివేది



కను పట్టించుకో లేదు.

ఎన్నికలు జరిగే తేదీలను ప్రకటించ గానే అందరి దృష్టి అటు మరలింది. నామినేషన్లు దాఖలు చేసుకోడానికి ఇచ్చిన గడువు తేదీ చూసిన వెంటనే రాగన్న బుర్రలో తళుక్కున ఒక ఆలోచన మెరిసింది. వెంటనే అతను రామయ్య దగ్గరికి పరుగెత్తుకెళ్ళి 'మన రాధాకృష్ణను ఎన్నికల్లో నిలబెడితే ఎలా ఉంటుందంటారు?' అని అడిగాడు. రామయ్యకు కూడా ఈ ఆలోచన నచ్చింది. రాధాకృష్ణ కోసం ఎన్నికల ఖర్చులో సగానికి పైగా తానే భరిస్తానని కూడా చెప్పాడు. అయితే ఎన్నికల ఫలితాలెలా ఉంటాయో ఖచ్చితంగా చెప్పలేం కాబట్టి, ఇతరులతో విరోధం తెచ్చుకోవడం తన కిష్టం లేనందువల్ల తను రాధాకృష్ణను బాహాటంగా బలపరచ లేననీ, చాటుగా ఉండి సహాయం చేస్తాననీ చెప్పాడు. ఈపద్ధతి రాగన్నకూ నచ్చింది. రాధాకృష్ణను ఒప్పిస్తానని చెప్పి అక్కణ్నించి బయలు దేరాడు.

రాధాకృష్ణ ముందు ఒప్పుకోలేదు కానీ తరువాత "మీరింత బలవంతం చేస్తున్నారు గనుక ఆ విషయం గురించి ఆలోచిస్తాను. రెండు మూడు రోజుల గడువిస్తే ఈలోగా మా సంఘ సభ్యుల్ని కూడా సంప్రదించి ఏ సంగతి మీకు తెలియపరుస్తాను" అన్నాడు పైకి అలా అంటున్నాడే గానీ, ఎన్నికల్లో నిలబడాలన్న కోరిక అతనికి లోలోపల బాగావుందని పసిగట్టేసి రాగన్న "ఖర్చుల గురించి మీరేం ఆలోచించకండి రాధాకృష్ణగారూ ... నలుగురూ తలా కాస్త వేస్తే అయిపోతుంది. రామయ్యకూడా సాయం చేస్తానన్నాడు. అయినా ఎవరి కోసం ఇస్తాడులెండి. ఆయనకు మనం మాత్రం సాయపడలేదా ?" అని చెప్పి రాగన్న అక్కణ్నించి బయలుదేరి సరాసరి విశ్వేశ్వర యువక సంఘం చేరుకొని, అక్కడ కొంతమంది సభ్యులకు ఈ విషయాన్ని తానే వాళ్ళ చెవిన పడేశాడు.

రంగయ్యకూ, అతని మిత్ర బృందానికీ మాత్రం రాగన్న చెప్పినమాట నచ్చలేదు.

"ఇంకా మీసాలైనా మొలవని ఆ కుర్రాణ్ణి వృద్ధిలోకి తేవాలని ఎందుకు తంటాలు పడతారు రాగన్నగారూ ...? హాయిగా మీరే ఎన్నికలకు పోటీచేయండి. అంతా మేమే చూసుకుంటాం" అన్నారు.

రాగన్న నవ్వేశాడు.

"ఇందులో ఉన్న లాజిక్కు మీ కర్థం కాదు రంగయ్యగారూ... ఎన్నికల్లో పోటీ చేసి గెలిచినంత మాత్రాన మనం గొప్ప వాళ్ళమై పోతామనుకో కూడదు. అలా అనుకోవడం చాలా పొరపాటు. ఎందుకంటే ఒక మనిషి ఎన్నికల్లో గెలిచాడంటే అతనికి పదిమంది శత్రువులు తయారవుతారు. అతనే పనిచేసినా అందులో తప్పులు పట్టడానికి వాళ్ళు కాచుకుంటారు. ఈ రోజు ఓటు వేసినవాళ్ళే రేపు మోహాన ఉమ్మినా ఉమ్మేయవచ్చు. అన్నిటికీ సిద్ధంగా ఉండాలి. అదంతా మన కెక్కడి కర్మ చెప్పండి? ఒకవేళ అందుకు సిద్ధపడినా మనం కొంచెం బాగుపడితే చూసేవాళ్ళకి కళ్ళు కుడుతాయి; ద్వేషాసూయలు పుట్టుకొస్తాయి. అందుకని మనమెప్పుడూ లెకమఫ్గానే ఉండిపోవాలి. చాటుగా ఉన్న వారిమీద ఎవరి కళ్ళూ పడవు. అలాగని మన పనులు ఆగిపోవాలని కాదు. మన కనుకూలంగా వున్న ఎవరినైనా గద్దెక్కించి వాళ్ళచేత మన పనులన్నీ చక్కబెట్టించుకుని, ఆ తర్వాత మన మానాన మనం ఉండిపోవాలి. ఇదే నా పాయింటు" అని తన సొంత వేదాంతాన్ని చెప్పగానే రంగయ్య దంగయిపోయాడు. తన పక్కనున్న మూడవ గిరిపుడు [illegible] "మామా గెలిపిస్తే మన అయ్యగార్ని? ఇంత [illegible] [illegible] [illegible] [illegible] [illegible] వాళ్ళెవరైనా అయితే-ఎవరైనా చెప్పిందే తడవుగా ఎలక్షన్‌కు నిలబడి ఉన్నదంతా పోగొట్టుకునేవాళ్ళం" అని తన నస పొగుడుతుంటే ఆ పొగడ్తల్లో ఇంకేమేం మాటలు దొర్లిపోతాయోనని భయపడిన రాగన్న చప్పున మాట మార్చేశాడు. రాధాకృష్ణను బలపరచాలని రంగయ్య వాళ్ళని కోరాడు, రాగన్న అంత వివరంగా చెప్పినా రాధాకృష్ణను బలపరచమని అతను ఎందుకంటున్నాడో అర్థం కాలేదు వాళ్ళకు. రంగయ్య ఆ మాటే అడిగాడు రాగన్నను.

"రాధాకృష్ణ వినాయకచవితి ఉత్సవాలు జరుపుతున్న చోట విఘ్నేశ్వరుడు ఉద్భవించాడు కదా...అందే అతనికి దేవుడే ప్రత్యక్షమయ్యాడన్నమాట! అందుకని ప్రజలంతా అతను అడక్కపోయినా అతనికే ఓటు వేస్తారు. ప్రత్యర్థులు ఎంతమంది నిలబడినా చివరికి గెలిచేది అతనే నన్నమాట! అలాంటప్పుడు మనం కూడా అతన్నే బలపరిస్తే అతను మన గుప్పిట్లో ఉండడూ? మన పనులు చేసిపెట్టడూ?" అని రాగన్న ఇంకా వివరంగా చెప్పగానే రంగయ్య అతని మాటలకు ముగ్ధుడై పోయాడు.

"ఇంత విషయం దీని వెనకుందని ఈ మొద్దుబుర్రకు ఎలా తెలుస్తుంది రాగన్నగారూ...!" అంటూ తన తలమీద తానే మొట్టికాయ వేసుకున్నాడు రంగయ్య.

* * *

ఎన్నికల ప్రచారం జోరుగా సాగుతోంది. ఆ నియోజక వర్గంనుంచి ఐదుగురు అభ్యర్థులు పోటీ చేశారు. కాని ముఖ్యమైన పోటీ మాత్రం రాధాకృష్ణ [illegible]

రయ్యల మధ్య జరుగుతోంది. ఇద్దరి తరఫున ప్రచారానికి చాలామందేఉన్నారు. శంకరయ్య తరఫున శాంతప్ప బ్లాక్ యువక సంఘం సభ్యులూ, రాధాకృష్ణ తరఫున విఘ్నేశ్వర యువక సంఘం సభ్యులూ ఇంటింటికీ వెళ్ళి తమ అభ్యర్థికే ఓటు వేయమని అర్థించారు. నిర్జీవంగా, అచేతనంగా ఉన్న ఆ పేటలో సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా నవచైతన్యం కలిగించి అక్కడి మనుషుల్లో ఉత్సాహం రేకెత్తించింది రాధాకృష్ణే కాబట్టి అతనికే ఓటు వేయమని కోరారు అతని తరఫు మనుషులు.

ప్రతిసారి ఎన్నికలకు నిలబడి నాలుగైదుసార్లు వరసగా గెలిచి ఈ పేట అభివృద్ధికి శంకరయ్య ఎంతో కృషి చేశాడనీ, ఈసారి కూడా అతన్నే గెలిపిస్తే ఇంకా కృషి చేయగలడనీ అతని తరఫు మనుషులు ప్రచారం చేశారు.

"నాలుగుసార్లు గెలవడమే అతని ప్రత్యేకతా? ఆ అర్హతలు ఉంటే చాలా? అన్నిసార్లు గెలిచినా అతనిక్కడి వాళ్ళకి సాధించి పెట్టింది ఏమిటి? ఎవరెవరో చేసిన మంచి పనులన్నీ తానే చేసినట్టు గొప్పలు చెప్పుకు తిరగడమేనా అతను సాధించింది? తాను చేయకపోతే పోయాడు కానీ ఇంకొకళ్ళెవరైనా చేస్తుంటే చూసి ఓర్వలేడు. ఇప్పుడు రాధాకృష్ణ ప్రతీ సంవత్సరం ఉత్సవాలు చేస్తున్నాడనేగా-తనూ పోటీగా ఒక సంఘాన్ని స్థాపించాడు? అయితే ఆ విఘ్నేశ్వరుడికి రాధాకృష్ణమీదే అనుగ్రహం కలిగింది. అందుకే అతను ఉత్సవాలు జరిపే చోట తానే ప్రత్యక్షమయ్యాడు" అని అక్కడక్కడ గుసగుసలు బయలు దేరడంతో జనం ఆ మాటలనే నమ్మారు. ఫలితంగా ఎన్నికల్లో రాధాకృష్ణ గెలిచాడు. శంకరయ్య ఓడిపోవడమే కాక డిపాజిట్టు కూడా కోల్పోయాడు.

* * *

ఎన్నికలు పూర్తయిన కొంతకాలానికి పురపాలక సంఘం రోడ్డు వెడల్పు చేసే కార్యాన్ని మళ్ళీ చేపట్టింది. రైల్వేలైను మీద వంతెన పని కూడా ఇక రెండు మూడు నెలల్లో పూర్తయిపోయే సూచనలు కూడా కనిపించాయి. ఆ వంతెన పూర్తయ్యేలోగా రోడ్డు పని కూడా పూర్తి కావలిసిందే. ఆ విషయంలో ఇక ఏ మాత్రం ఆలస్యం చేయడానికి వీల్లేదు. కానీ మధ్యలో వినాయకుడు ఉద్భవించడం వల్ల కొత్త సమస్య తలెత్తి, అధికారులు రోడ్డు వెడల్పుచేసే విషయాన్ని పునర్ పరిశీలన జరపవలసి వచ్చింది.

అధికారులు పునర్ పరిశీలన జరిపి సమర్పించిన నివేదికను అంగీకరించాలా వద్దా అన్న విషయంలో తర్జన భర్జనలు జరుగుతుండగా కొత్తగా ఎన్నికైన రాధాకృష్ణ చురుకుగా ముందుకు సాగి, కొత్తగా ఎన్నికైన ఇతర మెంబర్లను కూడదీసుకుని మెజారిటీ బలంతో ఆ నివేదిక అంగీకరించబడేలా చేశాడు. పార్కులోని స్థలాన్ని పది అడుగులవరకూ రోడ్డుకు కలుపుకోవాలనీ, ఎదురువైపు మాత్రం ఇరవై, ఇరవైఅయిదు అడుగులవరకూ కలుపుకోవచ్చుననీ, ఈ పద్ధతివల్ల నష్టపరిహారంగా ఇచ్చే డబ్బు మొత్తం కూడా తగ్గుతుందనీ సభ్యులందరూ అభిప్రాయపడ్డంతో అదే అంగీకృతమైంది.

నివేదికలో ఈ విధమైన మార్పులు చేసిన తర్వాత రామయ్యా బిల్డింగులో

అద్దెకున్న దుకాణాదార్లందరికీ ఇదివరకిచ్చిన నోటీసులు ఇప్పుడు వాపసు తీసుకున్నారు.

మార్కెట్టు కోసం స్వాధీనం చేసుకున్న శ్రీ రంగమ్మ స్థలంలోని మూడు దుకాణాల వాళ్ళు మాత్రం దుకాణాలు ఖాళీ చేయాలని అధికారులు తాఖీదులు పంపారు.

ఖాళీ చేయవలసిన ప్రతి దుకాణానికీ అధికారులే స్వయంగా వచ్చి నెలరోజుల్లోగా తప్పనిసరిగా దుకాణాలు ఖాళీ చేయక తప్పదని హెచ్చరించి వెళ్ళారు. ఆ గడువులోపల ఖాళీ చేయకపోతే బలవంతాన ఖాళీ చేయించవలసి వుంటుందని చెప్పి ఆ విషయాలన్నీ వివరంగా ముద్రించిన నోటీసులను కూడా ఇచ్చి వెళ్ళారు. ఇక తమకక్కడ చోటులేదని గ్రహించిన దుకాణాదార్లు, దుకాణాలు ఖాళీచేసే ప్రయత్నాలు చేయసాగారు. అంతకుముందే ఇంకో చోట దుకాణాలు తెరిచిన వాళ్ళయితే వెంటనే సామాన్లు కూడా అక్కడికి తరలించేశారు. కానీ ఇంకా ఎక్కడా చోటు చూసుకోని వారు మాత్రం హడావిడిగా ఇప్పుడు చోటు కోసం వెతకడం మొదలెట్టారు.

నెలరోజుల గడువు పూర్తికాగానే అధికారులు దుకాణాలను స్వాధీనం చేసుకోడానికి వచ్చేశారు. అప్పటికే ఖాళీఅయిన దుకాణాలకు సీళ్ళువేసి, ఇంకా ఖాళీ చేయని దుకాణాల్లోని వస్తువులన్నీ వీధిలోకి గిరవాటేసి వాటిని కూడా స్వాధీనం చేసుకుని సీళ్ళు వేశారు. వినాయకుడు ఉద్భవించాడు కనుక ఇక ఆ రోడ్డును ముందు అనుకున్నట్టు వెడల్పు చేయరన్న పుకారు పుట్టడంతో ఇక తమకేమీ భయం లేదని భావించి శ్రీ రంగమ్మ స్థలంలోని దుకాణాదార్లు నిశ్చింతగా ఉండిపోయారు కానీ ఇప్పుడు అధికారులు వచ్చి ఒక్కసారిగా తమ సామానులన్నీ బయటికి గిరవాటేసేసరికి వాళ్ళకు దిక్కుతోచలేదు.

వస్తువులన్నీ రోడ్డుమీద చెల్లాచెదురుగా పడివున్నాయి. ఉన్నట్టుండి వీధినపడాల్సి వచ్చినందుకు బాధపడుతున్న ఆ దుకాణాదార్లకు, దానికితోడు తమ వస్తువులను ఎవరూ ఎత్తుకు పోకుండా చూసుకునే బాధ్యత కూడా వచ్చిపడింది. భయంతోనూ, ఏమీ చేయలేని నిస్సహాయతతోనూ కొందరికి ఏడుపే వచ్చేసింది. ఒకటి, రెండురోజుల వరకైనా సామానులను కొట్లలో ఉంచుకోనిమ్మని బతిమాలుకున్నారుగానీ అధికారులు మాత్రం దానికి ఒప్పుకోలేదు.

వాళ్ళ పరిస్థితి చూసి అధికార్లు కూడా జాలి పడ్డారు కానీ, రూల్సుకు కట్టుబడి వున్నందువల్ల ఏమీ చేయలేక నిస్సహాయులై ఉండిపోయారు. చివరికి ఆ దుకాణాదార్లకు సహాయపడే వాళ్ళే లేకపోయారు. అందరూ చుట్టూ నిలబడి తమాషా చూస్తున్నారే కానీ సాయం చేస్తామని ఎవరూ ముందుకు రాలేదు.

* * *

ఇళ్ళూ, దుకాణాలను పడగొట్టేపని ఇంకా ప్రారంభం కాలేదు. అయిదు ఫర్లాంగుల దూరం వరకూ ఉన్న దుకాణాలను సీలు చేయడంతో ఆ రోడ్డు మీద సందడిలేక బోసిగా, కళావిహీనంగా కనిపిస్తోంది. వాటిని పడగొట్టే పని త్వరగా పూర్తయితే తమ కొత్త దుకాణాల పనైనా మొదలుపెట్టవచ్చని వాటి యజమాను లందరూ ఎంతో ఆత్రంగా ఎదురు

చూస్తున్నాడు.

రంగయ్య పరిస్థితి కూడా అలాగే ఉంది. ఆ విషయం కాస్త చూడమని రాగన్న రాధాకృష్ణను కోరినప్పుడు అతను ఇంజనీర్లతో మాట్లాడతానని చెప్పాడు.

ఒకరోజు ఉదయం మామూలుగా పదింటికి నిద్రలేచాడు రాగన్న. అతను బయటికి వచ్చి చూసేసరికి ఒక ఆశ్చర్యం కనిపించింది. శ్రీ రంగమ్మ స్థలంలో ఉన్న మూడు దుకాణాల తలుపులూ తెరిచి వున్నాయి. అక్కడ ముందు దుకాణాలు పెట్టుకున్న వాళ్ళే ఇప్పుడు సామానులు తీసికెళ్ళి లోపల పెట్టుకుంటున్నారు. రాగన్న దగ్గరగా వెళ్ళి వాళ్ళను అడిగితే-ఆ వరసలో రోడ్డు వెడల్పు చేయనందున దుకాణాలను తిరిగి తమకే ఇచ్చేశారనీ, తరువాత మార్కెట్టు కట్టినా వాటిని అలాగే ఉంచేస్తారని చెప్పారు వాళ్ళు. ఇకనుంచి అద్దెను పురపాలక సంఘానికే చెల్లించాలని కూడా చెప్పారు.

వాళ్ళు చెప్పినంత సులభంగా ఆ వ్యవహారం జరగలేదనీ, దాని వెనక ఇంకేదో కథ ఉంటుందని సులభంగా ఊహించ గలిగాడు రాగన్న.

ఆ తర్వాత భట్టుగారి హోటలుకు కాఫీ తాగడానికి వెళ్ళాడు రాగన్న. అతను కాఫీ తాగుతూ ఉండగానే ఆ దుకాణదార్లలో ఒకతను వచ్చి రాగన్న ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు. ఇదే మంచి సమయం అనుకుని "ఏం శెట్టిగారూ ... మళ్ళీ మీ దుకాణం మీకే దొరికి పోయిందా? పోనీలెండి... ఇంకో చోటు వెతుక్కోవడానికిపడే అవస్థ తప్పింది కదా అంతే చాలు" అన్నాడు మెల్లిగా.

వెంటనే ఆ శెట్టి "ఏమోసార్... అంతా ఆ వినాయకుడి దయే అనుకోవాలి. అయినా పాపం ఆ రాధాకృష్ణయ్య గారు సహాయం చేయక పోయినట్లయితే మళ్ళీ మాకెక్కడ దొరికేవి దుకాణాలు!" అనేశాడు చటుక్కున.

ఆ మాటవిని రాగన్న ఉలిక్కిపడ్డాడు.

"వీళ్ళకు సహాయ పడాలన్న ఉద్దేశం నిజంగా రాధాకృష్ణకు ఉన్నట్టయితే తనతో చెప్పేవాడేనే ?

అలా చెప్పకుండా రహస్యంగా ఉంచాడంటే ఇందులో ఏదో అంతరార్థం ఉందన్నమాట!" అనుకుని మరోసారి శెట్టిని మెల్లిగా ఉపాయం చేసి అడిగి అసలు విషయం బయటికి లాగాడు. ఆ దుకాణదార్లు ముగ్గురూ రాధాకృష్ణకు తలో వెయి రూపాయలు ఇచ్చుకున్నారట! అంతా చెప్పేశాక నాలిక కరుచుకున్నాడు శెట్టి.

తనలా చెప్పడం పొరపాటయిందేమో అని భయపడి "ఏమోసార్... నోరు జారి చెప్పేశాను కానీ మీరు మాత్రం ఇంకెక్కడా అనకండి" అని ఇంకా అక్కడుంటే ప్రమాదమని లేచి గబగబా వెళ్ళిపోయాడు.

రాధాకృష్ణ తనకే మోసం చేయ గలడని రాగన్న ఎప్పుడూ అనుకోలేదు. మోసం చేసినా ఫరవాలేదు కానీ, ఇలా తన వృత్తిలోకే దిగుతాడని మాత్రం అసలు ఊహించలేదు. ఇక అతను తనకు ఎదురు వచ్చేవాళ్ళు లేరనుకుని, మొదట్లోనే అతనికి బుద్ధి వచ్చేలా చేయాలని నిశ్చయించుకున్నాడు.



# 15

కట్టడాలను పడగొట్టే పని ప్రారంభమైంది. అక్కడక్కడ కుప్పలుగా పడి వున్న ఇటుకలూ, మొండిగోడలూ అక్కడి వాతావరణాన్నే విచిత్రంగా మార్చేశాయి. రోడ్డు కొకవైపు దైనందిన కార్యకలాపాలన్నీ సక్రమంగా జరిగి పోతుంటే, మరో వైపేమో అంతా పాడుబడిపోయి శూన్యంగా కనిపిస్తోంది. ఇంకో రెండు వారాల్లో పడగొట్టే పని పూర్తయిపోయి, నేల చదును చేసేపని మొదలవు తుందని పనివాళ్ళు మాట్లాడు కుంటున్నారు.

భట్టుగారి హోటలు మంచి సెంటర్లో ఉంది. దాని ద్వారం రోడ్డుమీదికే ఉన్నా, పక్క సందులోంచి ఇంకో గుమ్మం కూడా ఉంది. ఇప్పుడు కట్టడాలు పడగొట్టేపని సాగుతూండడవల్ల తన వ్యాపారాని కేమీ ఆటంకం రాకూడదని ఆలోచించి భట్టు ముందువైపు ద్వారానికి అడ్డంగా ఒక గోడను కట్టించి వెనకవైపున్న గుమ్మాన్ని పెద్దది చేయించి అక్కణ్నించే రాకపోకలు ఏర్పాటుచేశాడు. దాంతో ఆ బిల్డింగు యజమాని ఉగ్రుడై పోయాడు. దుకాణాదార్లందరితో పాటు భట్టు కూడా ఖాళీ చేస్తాడనుకున్నాడు గానీ ఆయనలా పక్కదారిన వ్యాపారం కొనసాగిస్తాడనిమాత్రం అతను ఊహించలేకపోయాడు. ఇప్పుడున్న దుకాణాలన్నిటినీ పురపాలక సంఘంవాళ్లు స్వాధీన పరచుకున్నారు కాబట్టి రోడ్డుపని పూర్తయిపోగానే కొత్త దుకాణాలు కట్టించి ఎక్కువ అద్దెకు ఇవ్వాలని అందరిలాగే అతనూ ఆశ పడ్డాడు, కానీ భట్టు అతన్ని సంప్రదించకుండానే ఆ ఏర్పాటు చేసుకోవడం చూసి వళ్లు మండింది గబగబా హోటల్లోకి వెళ్ళి ఇప్పటికిప్పుడు ఖాళీ చేయమని కేకలు వేశాడు, కానీ ఆ మాత్రానికే జడిసిపోయే రకం కాదు భట్టు పురపాలక సంఘం వారు స్వాధీన పరచుకోగా మిగిలిన స్థలంలో వ్యాపారం చేసుకునే హక్కు తనకుందని చెప్పి — "మీరేమైనా చేసుకోండి, నేనిక్కణ్నుంచి కదిలేది లేదు" అని భీష్మించుకు కూర్చున్నాడు. కాసేపు ఇద్దరికీ వాగ్వివాదాలు జరిగాక ఆ యజమాని వెళ్ళిపోయాడు. కానీ "ఎలాగైనా సరే, నిన్ను ఇక్కణ్నుంచి గెంటేయకపోతే చూసుకో!" అని ప్రతిజ్ఞ చేసి మరీ వెళ్ళాడు.

అదైన రెండు రోజులకు ఒకతను సైకిలుమీద వచ్చి "తాను పురపాలక సంఘం ఉద్యోగినని చెప్పి హోటలున్న మూలకు ఒక చౌరాస్తా నిర్మించవలసి ఉన్నందున మొత్తం బిల్డింగును కూలగొట్టేస్తారనీ ! కాబట్టి వెంటనే హోటలు ఖాళీ చేయమనీ చెప్పినప్పుడు భట్టు మండిపడి ఆ విషయం తనకు ముందే ఎందుకు తెలుపలేదని అడిగాడు. "ఇది ఇటీవల తీసుకున్న నిర్ణయం" అని చెప్పి అతను వెళ్ళిపోయాడు. దాంతో భట్టు కంగారు పడిపోయి రాధాకృష్ణ దగ్గరికి పరుగెత్తాడు. "నేను కనుక్కుంటాను లెండి. మీరు రేపు వస్తే ఏ సంగతీ చెప్తాను" అన్నాడు రాధాకృష్ణ. మర్నాడు భట్టు

మళ్ళీ వెళ్ళినప్పుడు రాధాకృష్ణ "మీ పనిని నేను చక్కదిద్దుతాను లెండి కానీ దానికి కొందరి సహకారం అవసరమవుతుంది. వాళ్ళకు అంతో ఇంతో ముట్టచెబితే గాని వాళ్లేపనికి ఒప్పుకోరు కాబట్టి ఒక వేయి రూపాయిలిస్తే మీరు నిశ్చింతగా ఉండొచ్చు భట్టుగారూ...!" అన్నాడు సరేనని భట్టు హోటలు డబ్బులోంచి వేయి రూపాయలు తీసుకెళ్ళి అతని చేతిలో పెట్టాడు. భట్టు అక్కడ హోటలు పెట్టి పాతికేళ్ళ పైనే అయింది. వ్యాపారం కూడా బాగా సాగుతోంది కాబట్టి, ఒక వేయి రూపాయిల మొహం చూస్తే ఆ తర్వాత బాధపడవలసి వస్తుందని ఆలోచించి ఆ పని చేశాడు. కానీ వారం రోజుల తర్వాత మళ్ళీ ఆ మనిషే వచ్చి "మూడు రోజుల్లోగా ఖాళీ చేయకపోయారో సామాన్లు వీధిలో పడేస్తాం" అని హెచ్చరించి వెళ్ళిపోయాడు. భట్టు మళ్ళీ రాధాకృష్ణదగ్గరికి పరుగెత్తాడు. "తన ప్రయత్నం ఫలించలేదనీ, డబ్బు మింగేసిన అధికారులు తనకు మోసం చేశారనీ" తేలిగ్గా చెప్పేశాడు రాధాకృష్ణ. ఇక ఏం చేయడానికి తోచక భట్టు హోటలుకు తిరిగి వచ్చి నెత్తిన చేయిపెట్టుకుని కూర్చున్నాడు.

ఆ రోజు రాగన్న కాఫీ తాగడానికి వచ్చినప్పుడు భట్టు ఇంకా అదే భంగిమలో దర్శనమిచ్చాడు. రాగన్న పలకరించగానే ఆయన తెప్పరిల్లి "హమ్మయ్య మీరే వచ్చారు-కదా, నేనే మీ దగ్గరికి రావాలనుకున్నాను" అని చెప్పి అతన్ని ఒక మూలగా టేబుల్ దగ్గరికి తీసికెళ్ళి కూర్చోబెట్టుకుని జరిగిన కథంతా చెప్పుకొచ్చాడు. అంతా విన్న తర్వాత రాధాకృష్ణ ఆ బిల్డింగు యజమాని దగ్గరకూడా డబ్బు తీసుకున్నాడేమో!' అన్న సందేహం వచ్చింది రాగన్నకి. ఇప్పుడు తను భట్టును రక్షించాలన్న తపన కన్నా, రాధాకృష్ణ సంగతి కనుక్కోడానికి మంచి అవకాశం దొరికింది కదా! అన్న సంతోషమే ఎక్కువైంది. అందుకనే వెంటనే లేచి "నేను కనుక్కుంటా లెండి" అని చెప్పి అక్కణ్నించి బయలుదేరి వెళ్ళిపోయాడు. తిన్నగా పురపాలక సంఘం కార్యాలయానికి వెళ్ళాడు. అక్కడి అధికారులను చూసి 'చౌరాస్తా' విషయం అడిగేసరికి వాళ్ళు ఆశ్చర్యపోయారు. ముందు వేసుకున్న కార్యక్రమంలో కొత్తగా మార్పేమీ చేయలేదని వాళ్ళు చెప్పేసరికి రాగన్నకు అసలు విషయం అర్థమైపోయింది. రికార్డులన్నీ తెప్పించి చూసి ఎందులోనూ హోటల్ పక్కన 'చౌరస్తా' నిర్మించే ప్రసక్తే లేదని తెలుసుకుని ఇంటికి వచ్చాడు రాగన్న.

దొంగను దొంగమాలుతో సహా పట్టుకున్నప్పుడు పోలీసుల కెంతటి ఆనందం కలుగుతుందో అంతకు రెట్టింపు ఆనందం రాగన్నకిప్పుడు కలిగింది. ఈమధ్య రెండు మూడు సార్లు కనిపించినప్పుడు రాధాకృష్ణ తనంటే నిర్లక్ష్యంగా ప్రవర్తించడాన్ని తను కనిపెట్టలేకపోలేదు. దుకాణాదార్ల దగ్గర లంచం తీసుకున్న సంగతిని అప్పుడే అడిగేద్దామనుకున్నాడు కానీ-వాళ్లు అందరి ముందు ఆ విషయాన్ని ఒప్పుకోడానికి సిద్ధంగా లేరు కాబట్టి-తనూ మెదలకుండా ఉండిపోయాడు. భట్టు సంగతి అలా కాదు. ఆయన ఎవరి ఎదుటనైనా చెప్పగలడు - తను రాధాకృష్ణకు లంచం ఇచ్చినట్టు. అదీ కాక తనిప్పుడు అతనికి సహాయం చేయబోతు

న్నాడు కనుక అతను తను చెప్పినట్టు వింటాడు. ఆ విషయం తనదాకా వచ్చిందని తెలిస్తే రాధాకృష్ణ తనని చూసి భయపడ తాడు. 'ఇకనుంచి రాధాకృష్ణ పిలక తన చేతికి చిక్కినట్టే' అనుకుని రాధాకృష్ణను పిలుచుకు రమ్మని భద్ర, నంజుండలను పంపించాడు.

'పురపాలక సంఘ సభ్యుడైన తనను ఇలా రమ్మని కబురంపుతాడా ?' అన్న కోపంతోనే రాగన్న ఇంటికి వచ్చాడు రాధాకృష్ణ. రాగన్న అతని కోపాన్ని గుర్తించినా గుర్తించనట్టే ఉండిపోయాడు. 'ఇంకాసేపట్లో తనదే పైచేయి అవుతుందిగా!' అన్న ధీమా అతనికి. అందుకే తిన్నగా అసలు విషయంలోకే వచ్చేశాడు. తను అడగాలనుకున్నవన్నీ అడిగేశాడు. అంతా విని రాధాకృష్ణ ఏమాత్రం చలించ లేదు. "అవునండీ...లంచం తీసుకున్నాను. అది నా ఇష్టం. మీరేదో చాలా నిజాయితీ పరులైనట్టు నన్ను నిలదీసి అడుగుతారేం? అసలిదంతా మీరే నేర్పారు నాకు" అనేసి ఇక ఒక్కక్షణం కూడా అక్కడుండ కుండా చరచరా బయటికి వచ్చేశాడు. అతనిలా ప్రవర్తిస్తాడని కలలో కూడా ఊహించని రాగన్న నిశ్చేష్టుడై అతను వెళ్ళినవైపే చూస్తుండిపోయాడు. 'హుం.. వీడిపని ఇలా కాదు...ఉపాయంగా మట్టు పెట్టాలి వీణ్ని!' అని తనలో తనే గట్టిగా నిశ్చయించుకున్నాడు రాగన్న.

రెండురోజులు గడిచాయి. భట్టుగారి హోటలున్న బిల్డింగులో పురపాలక సంఘంవారు స్వాధీనపరచుకున్న భాగాలను పనివాళ్ళు వచ్చి పడగొట్టడం ప్రారంభిం చారు. ఆరోజు రోజూకన్న ఎక్కువమంది కూలీలు వచ్చారు. ఒక్కరోజు ఒక్కో సంఖ్యలో వాళ్ళు వస్తుండడంవల్ల ఆ విష యాన్ని ఎవరూ అంతగా పట్టించుకో లేదు. అయితే సాయంకాలం ఆరు గంటలు దాటిపోయినా ఇంకా ఇళ్ళకు వెళ్ళకుండా వాళ్ళు అక్కడే పనిచేస్తూ వుండడం చూసి భట్టుకు కాస్త భయమేసింది. అప్పు డప్పుడు బయటికి వచ్చి చూసి వెళ్ళు తున్నాడు. ఏడుగంటల వేళప్పుడు 'ఆ పనివాళ్ళంతా వెళ్ళిపోయారు. 'అనవ సరంగా కంగారుపడ్డానే!' అనుకుని భట్టు హోటల్లోకి వెళ్ళిపోయాడు.

ఎనిమిది గంటలయ్యేసరికి హోటల్లో గిరాకీలు తగ్గిపోయాయి. ఫలహారాలన్నీ ఎంతెంత ఉన్నాయోనని ఓసారి వంటింట్లోకి వెళ్ళి చూసివచ్చి ఇక హోటల్ మూసేద్దా మనుకుంటున్నంతలో ఉన్నట్టుండి ఏదో చప్పుడు వినిపించింది, అది గోడను కూల గొడుతున్న చప్పుడు. చూస్తూ చూస్తూ వుండగానే ద్వారంలో కట్టించిన గోడకు ఇంత కన్నం పడింది. ఇంకో మూడు నిమిషాల్లోనే నాలుగైదు ఇటుకలు వచ్చి టేబిల్ మీద పడ్డాయి. ఆ టేబిల్ ముందు కూర్చున్న గిరాకీలు 'అయ్యో బాబోయ్ !' అని కేకలు పెడుతూ లేచి ఇవతలికి పరుగెత్తుకొచ్చేశారు. అంతలో ఆ బిల్డింగు యజమాని వచ్చి 'రాత్రిలోగా సామానులు తరలించకపోతే ఆ సామాన్ల మీదే ఇల్లు కూలగొట్టించేస్తాను జాగ్రత్త!' అని హెచ్చ రించి వెళ్ళాడు. భట్టు ఏం చేయాలో తోచక కాసేపు అటూ ఇటూ తచ్చాడి ఆ గోడదగ్గరి టేబిల్నను ఇటు జరపమని పనివాళ్ళకు పురమాయించి తను రాగన్న దగ్గరికి పరుగెత్తాడు. అప్పుడు రాగన్న ఇంట్లో లేడు. 'రంగయ్య ఇంటికి వెళ్ళారని' భార్య సుశీల చెప్పడంతో భట్టు అక్కడి



వెళ్ళాడు. రంగయ్యా, రాగన్న - ఇంకో నలుగురూ కలిసి అప్పుడు పానగోష్ఠి ప్రారంభించబోతున్నారు. రాగన్న భట్టును చూడగానే లేచి నిలబడి ఏమిటని అడిగాడు. ఆయన కంగారుపడుతూ చెప్పినమాట విని కోపంతో పళ్ళు కొరికాడు. ఆ తర్వాత "మీరేం కంగారుపడకండీ. వెళ్ళి హోటలోనే ఉండండి. మేం పోలీసులను పిల్చుకొస్తాం" అని చెప్పి అక్కడున్న వారందరినీ తీసుకుని పోలీసు స్టేషనుకెళ్ళాడు రాగన్న.

పోలీసులను చూడగానే కూలీ పనివాళ్ళు తమ చేతిలోని సామాన్లను అక్కడే పారేసి పారిపోయారు. వాళ్ళతోబాటు బిల్డింగు యజమాని కూడా పత్తాలేకుండా పారిపోయాడు. సబ్ ఇన్‌స్పెక్టరు ఇద్దరు కానిస్టేబుల్సును అక్కడ కాపలా ఉంచి మిగతా బలగాన్ని తీసుకుని తిరిగి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత రాగన్న భట్టును పోలీసు స్టేషనుకు తీసుకెళ్ళి ఆయనచేత రిపోర్టిప్పించాడు. బిల్డింగు యజమాని హోటల్లోకి ప్రవేశించి దౌర్జన్యం చేశాడని ఆ రిపోర్టులో రాయించాడు రాగన్న. ఆ రిపోర్టుతో పోలీసులు వెంటనే ఆ యజమానిని పట్టుకుని అరెస్టు చేశారుకానీ మళ్ళీ బెయిల్ మీద విడుదల చేశారు.

రెండుమూడు రోజుల్లో కోర్టులో దావా కూడా వేశారు. 'ఆ రాగన్న ఒకడు మధ్యలో రాకపోయినట్లయితే ఈపాటికి బిల్డింగు మొత్తం నేలమట్టంచేసి ఆ భట్టును వీధిలోకి ఈడ్చేవాణ్ని. అయినా ఇంతటితో వాణ్ని వదలిపెడతానేమో చూడండి' అని ఆ యజమాని చెప్పుకు తిరగడం రాగన్న కూడా విన్నాడుకానీ ఆ మాటలనతను లక్ష్యపెట్టలేదు. మొట్టమొదటి రౌండులోనే రాధాకృష్ణను ఓడించగలిగానని సంతోషపడినా - రాధాకృష్ణమీద ఆ సంఘటన ఎంతవరకూ పనిచేసిందో తెలుసుకోవాలని అతను సి.ఐ.డి.లాంటి తన మనుషులను పంపించాడు. వాళ్ళముందు రాధాకృష్ణ రాగన్నమీద నిప్పులు కక్కాడట. "ఇన్నాళ్ళూ నన్ను బాగా ఉపయోగించుకుని తన ఆటలు సాగించుకున్నాడు రాగన్న. ఇప్పుడు నామీదే కత్తికడతాడా?

ఇప్పుడెవరున్నారు వాడికి? వాణ్ని ఈ ఊళ్ళోంచి తరిమేయకపోతే నా పేరు రాధాకృష్ణే కాదు. ఆ భట్టును వాడు ఎలా రక్షిస్తాడో చూస్తాను" అన్నాడట!

ఇంకో రెండుమూడు రోజుల తర్వాత రాగన్న మనుషులు ఇంకా కొన్ని వార్తలు మోసుకొచ్చారు. మొదట్లో రోడ్డు వెడల్పు చేయాలని ఆలోచించినప్పుడు రెండు వైపులా ఇరవై, ఇరవై అయిదు అడుగుల వరకూ స్థలాన్ని కలుపుకోవాలని నిర్ణయించుకున్నారనీ, ఆ తర్వాత మధ్యలో వచ్చిన అవాంతరాలవల్ల ఆ ఆలోచన మారిపోయి ఒకవైపే స్థలాన్ని ఆక్రమించుకోవలసి వచ్చిందనీ, కానీ రాను రాను జనసమ్మర్దం ఇంకా పెరిగే అవకాశం ఉన్నందున, ఇప్పటి పరిస్థితి అప్పుడు కూడా ఏర్పడే ప్రమాదం ఉంది గనుక ఇప్పుడే మరికొంత స్థలాన్ని ఆక్రమించుకుని రోడ్డును ఇంకా వెడల్పు చేస్తారనీ తెలిసింది వాళ్ళకు. ఇది ఎవరి ఆలోచనో రాగన్నకు ఇట్టే అర్థమైపోయి ఒక్క క్షణం నిర్ఘాంతపోయాడు. 'వీడు తను నేర్పిన తిరుమంత్రాలను తనమీదే ప్రయోగిస్తున్నాడన్నమాట!' అనుకుని లోలోపలే పళ్ళు నూరాడు. 'రెండుమూడు రోజుల క్రితం తనను ఊళ్ళోంచి తరిమేస్తానని అతనన్నది ఇందుకే నన్నమాట! ఇప్పుడు తన ఇల్లున్న స్థలాన్ని ఆక్రమించుకుంటే ఇక ఉండడానికి చోటులేక తను ఊరొదిలి వెళ్ళిపోతాననుకున్నాడు కాబోలు. తన తడాఖా ఏమిటో అతని కింకా సరిగ్గా తెలీదు. తెలిస్తే నోరు మూసుకుని పడివుంటాడు' అనుకుని రంగయ్య కోసం బయలుదేరాడు రాగన్న.

రాధాకృష్ణ చేస్తున్న పన్నాగమంతా రంగయ్యతో వివరంగా చెప్పాడు రాగన్న. అతననుకున్న ప్రకారం నిజంగానే జరిగితే అప్పుడు తానొక్కడే కాక ఆ వరసలో ఉన్నవాళ్ళందరూ ఇల్లూ, వాకిలీ పోగొట్టుకుని ఇంకో అయిదారు మైళ్ళు అవతలికి వెళ్ళిపోవాల్సి వస్తుందని కూడా చెప్పాడు. ఆ మాట విని వినగానే రంగయ్య అగ్గిమీద గుగ్గిలమయిపోయాడు. "చూశారా రాగన్నగారూ...నేను ముందే చెప్పలేదూ ఆ కుర్రాణ్ని పైకి తీసుకురావడానికి మీ రెందుకు శ్రమ పడుతున్నారని? ఇప్పుడు చూడండి, ఏకుమీద మేకై కూర్చుని మనల్నే ఇక్కణ్నుంచి వెళ్ళగొట్టడానికి చూస్తున్నాడు. మనం చేతికి గాజులు తొడుక్కున్నామనుకుంటున్నాడు కాబోలు లం......కు వాళ్ళమ్మ కడుపున పుట్టలేదనిపించేస్తా వాణ్ని!" అని తిడుతూ లేచి అప్పటి కప్పుడే అతని అంతుచూడ్డానికి బయలు దేరబోయాడు రంగయ్య. అతన్నిప్పుడు వెళ్ళనిస్తే నిజంగా అన్నంత పని చేసేలా ఉన్నాడని భయపడి రాగన్న అతన్ని బలవంతాన ఆపాడు. రంగయ్యలోని ఆవేశాన్ని చల్లబరచేసరికి రాగన్నకు తల ప్రాణం తోకకొచ్చినంత పనైంది. "రంగయ్యగారూ......అంతటి ఆవేశం పనికిరాదు. అతన్ని మీరు నాలుగు దెబ్బలు కొట్టొచ్చు. అది పెద్ద మాట కాదు. కానీ చూసిన వాళ్ళేమనుకుంటారో తెలుసా? మనదే తప్పంటారు. అతనీ అవకాశాన్ని తన స్వలాభంకోసం ఉపయోగించుకుని మరిన్ని అగడాలు చేస్తాడు. మనంతట మనమే వాడిచేతికి తాడిచ్చి చేతులెందుకు కట్టించుకోవాలి చెప్పండి! వాడి ఒంటి మీద చెయ్యి వెయ్యకుండానే దెబ్బతీసే ఆలోచన చేయాలి మన మిప్పుడు. అదంతా నేను చూసుకుంటాను

గానీ మీరు మాత్రం ఇప్పుడు ఊరికే ఉండిపోతే అంతే చాలు" అన్నాడు రాగన్న అతనంతగా చెప్పిన తర్వాత తను వినక పోతే బాగుండదని "మీ మాట నేనెందుకు కాదనాలి 'రాగన్నగారూ...మీరు ఏం చేస్తారో చేయండి" అంటూ పక్కే కూర్చున్నాడు రంగయ్య.



## 16

ఒకరోజు ఉదయం పదిగంటల వేళ రాధాకృష్ణ తన ఇంట్లోని ముందు గదిలో కూర్చుని ఎవరో పెద్ద మనుషులతో మాట్లాడుతున్నాడు. ఉన్నట్టుండి అప్పుడు ఒక యువతి ఆ గదిలోకొచ్చి నిలబడింది. ఆమెకు ఇరవై ఇరవై రెండేళ్ళ వయసుంటుందేమో! గర్భవతిగా కూడా ఉంది. ఆమె అలా హఠాత్తుగా వచ్చి అక్కడ నిలబడ్డంతో వాళ్ళందరూ మాటలు ఆపి ఆమె కేసే చూడసాగారు. "రాధాకృష్ణతో ఏదో పని వుండి వచ్చిందేమో". అని సరిపెట్టుకున్నా - ఆడదాన్నన్న సంకోచంతో గుమ్మం దగ్గరే నిలబడక ఇంతమంది మగాళ్ళ మధ్యకి వచ్చి అలా నిలబడ్డంతో వాళ్ళకేమిటో ఇబ్బందిగా అనిపించింది. అంతలో రాధాకృష్ణ తేరుకుని "ఎవరమ్మా మీరు ఏం కావాలి?" అని అడిగాడు.

"ఏమిటండీ ఇది? నన్నే ఎవరని అడుగుతున్నారా?? అంటే నేనెవరో్నే కూడా మర్చిపోయారన్న మాట! మీకు దండం పెడతాను. మీ కాళ్ళు పట్టుకుంటాను. నన్ను మాత్రం అన్యాయం చెయ్యకండి" అని ఏడుస్తూ రాధాకృష్ణ కాళ్ళదగ్గర కూలబడిపోయింది ఆమె. తమ కళ్ళ ముందు ఏం జరుగుతుందో అర్థం కాక అందరూ అయోమయంగా లేచి నిలబడి బయటికి వెళ్ళిపోవడానికి ఉద్యుక్తులయ్యారు. కానీ అక్కడింకా ఏం జరుగుతుందో చూడాలన్న కుతూహలం వాళ్ళను బయటికి వెళ్ళనివ్వలేదు. రాధాకృష్ణ దిగ్భ్రాంతుడై చూస్తున్నాడు ఆమె వైపు.

"ఎవరండీ మీరు? అసలు మీరేమంటున్నారో నా కర్థమే కావడం లేదు" అన్నాడు కాళ్ళు చప్పున వెనక్కి లాక్కుని.

ఆమె అతని కాళ్ళు రెండూ గట్టిగా పట్టుకుని "అయ్యా... మీకు పుణ్యం ఉంటుంది. నన్నిలా అన్యాయం చేయకండి. మిమ్మల్నే నమ్ముకున్న నన్ను పెళ్ళి చేసుకుంటానని మాటిచ్చి, తీరా ఇప్పుడు నెలతప్పిన తర్వాత నన్ను వదిలేయడం మీకు భావ్యమేనా? వీళ్ళందరి ముందూ నన్ను భార్య అని చెప్పుకోలేక ఇలా మాట్లాడుతున్నారా? చెప్పండి...!" అంటూ వెక్కి వెక్కి ఏడవడం మొదలెట్టింది. సంగతి తెలిసిపోయిన తర్వాత ఇక అక్కడుండడం భావ్యం కాదనుకుని వచ్చిన వాళ్ళందరూ మెల్లిగా అక్కడ్నుంచి జారుకోసాగారు.

రాధాకృష్ణ ఆమె చేతుల్లోంచి తన కాళ్ళను విడిపించుకుని "మీరెవరూ దయచేసి వెళ్ళిపోకండి. ఈమె ఎవరో నాకు తెలీదు. నా మాట నమ్మండి. నిజంగా ఈమె నెప్పుడూ నేను చూడనైనా చూడలేదు. ఇదేదో మోసం" అన్నాడు వాళ్ళను వారిస్తూ. వెంటనే ఆమె లేచి నిలబడి

కళ్ళు తుడుచుకుని కొంగును సడుసుకు బిగించింది.

"ఏమన్నారూ? నేనెవర్నో మీకు తెలీదా?" అని చెప్పి తర్వాత వచ్చిన పెద్దమనుషులకేసి తిరిగి "చూశారా ఈయన మాటలు? పెళ్ళి చేసుకుంటానని నన్ను నమ్మించి మోసం చేసింది తను. పైగా నాదే మోసం అంటున్నారు. ఈయన కోసం నేను తల్లితండ్రుల్నీ, అన్నదమ్ముల్నీ, అక్కచెల్లెళ్ళనీ-అందర్నీ దూరం చేసుకున్నాను. నా మంచి కోరి వాళ్ళు చెప్పిన మాటలను కాదని ఈయన్ని నమ్ముకున్నందుకు నాకు మంచి శాస్తే జరిగింది" అంది.

అక్కడున్నవాళ్ళు పెద్ద సందిగ్ధంలో పడిపోయిన వారిలా ఏం చెప్పడానికీ తోచక అచేతనంగా నిలబడిపోయారు.

అంతలో ఈ గొడవ విని లోపలినుంచి రాధాకృష్ణ తండ్రి బయటికి వచ్చాడు. కొడుకును చూస్తూ "ఏమిట్రా ఈ గొడవ?" అనడిగాడు. "చూడండి నాన్నా...ఈమె ఎవరో నాకసలు తెలీనే తెలీదు. కానీ నేను పెళ్ళి చేసుకుంటానని చెప్పానంటోంది" అన్నాడు రాధాకృష్ణ తడబడుతూ. ఆయన రాధాకృష్ణ తండ్రి అని తెలియగానే ఆమె పరుగున వెళ్ళి ఆయన కాళ్ళు పట్టుకుంది. "మీ అబ్బాయికి మీరైనా చెప్పండి మామగారూ... నన్నిలా అన్యాయం చేయొద్దని చెప్పండి. మొదట్నించీ పెళ్ళి చేసుకుంటానని చెప్పి ఇప్పుడు గర్భవతి అని తెలియగానే నన్ను దూరం చేయాలని చూస్తున్నారు. మీరైనా నన్ను కనికరించి మీ కోడలిగా స్వీకరించండి" అని చెప్పి భోరున ఏడవసాగింది. ఈ హఠాత్ పరిణామానికి ఆయన కూడా నిశ్చేష్టుడై పోయాడు. కాసేపటికి తెప్పరిల్లి "నువ్వు లేమ్మా... సంగతేమిటో నేను కనుక్కుంటాను" అని ఆమెను లేవనెత్తి నిల్చోబెట్టి కొడుకువైపు తిరిగాడు.

"ఏమిట్రా ఇదంతా? ఏమిటో చెప్పియేడు. ఈ అమ్మాయి చెబుతున్నదంతా నిజమేనా? 'పెళ్ళి చేసుకోరా' అని నేనెన్నిసార్లు చెప్పినా వినని నువ్వు చివరికి వెధవ పనికి ఎందుకు పాల్పడ్డావో చెప్పు" అని గట్టిగా నిలదీసి అడిగాడు. కోపంతో ఆయన కళ్ళు ఎర్రబారాయి.

తండ్రి అవతారం చూసి భయపడిపోయాడు రాధాకృష్ణ. అతని ఒళ్ళంతా చెమట పట్టేసింది. మాట్లాడబోతే నాలిక పిడచకట్టుకుపోయి నోరు పెగిలి రాలేదు. ఎంతో ప్రయాసతో చివరికి నోరు పెగల్చుకుని "ప్రమాణం చేసి చెబుతున్నా నాన్నా...ఈమె ఎవరో నిజంగా నాకు తెలీదు. ఒకవేళ నేను తప్పు చేస్తే మీ కాళ్ళమీద పడి క్షమాపణ కోరేవాణ్ని. నన్ను నమ్మండి. అసలీ అమ్మాయి ఎవరో నిజంగా నాకు తెలీదు. నేనీమె మొహం చూసింది ఇప్పుడే. ఇందులోఏదో మోసం ఉంది" అని మొరపెట్టుకున్నాడు.

అదంతా విని అతని తండ్రి కూడా అయోమయంలో పడిపోయాడు. అప్పటికే ఇరుగు పొరుగు వాళ్ళందరూ అక్కడ చేరిపోయారు. వాళ్ళందరినీ చూడగానే రాధాకృష్ణ తండ్రి మొహం పాలిపోయింది. అవమానంతో తలకొట్టేసి నట్టయింది ఆయనకు. అందుకని వెంటనే ఆ అమ్మాయి వైపు తిరిగి "మా అబ్బాయి అలాంటి వాడు కాదమ్మా...నువ్వు అనవసరంగా ఇక్కడికొచ్చి మమ్మల్ని అవమాన పరుస్తున్నావు. వెంటనే ఇక్కణ్నుంచి

చెప్పాలో" అన్నాడు.

ఆమె ఆ మాటలకు ఏమాత్రం చలించలేదు.

"నేనెందుకు మిమ్మల్ని అవమానపరుస్తాను మామగారూ! తల్లిదండ్రులను దూరం చేసుకున్న నన్ను కట్టుకుంటానన్నవాడు కూడా కాదంటుంటే నిస్సహాయురాలినై మీ అంత కోరదామని వచ్చానే తప్ప అబద్ధమాడ్డానికీ, మిమ్మల్ని అవమానించడానికీ రాలేదు. మీరే ఆలోచించండి. గర్భవతిగా ఉన్న ఒక అమ్మాయి ఆ విషయంలోనే అబద్ధమాడడం ఎక్కడైనా ఉందా?" అంది ధైర్యంగా.

'ఒకవేళ తన కొడుకే కాలు జారాడేమో!' అన్న అనుమానం వచ్చింది రాధాకృష్ణ తండ్రికి. 'అప్పుడు ఆమెను ఇష్టపడి ఇప్పుడు కాదని బుకాయిస్తున్నాడేమో! లేక ఏదో సరదాగా గడపడానికే తప్ప ఆమెను పెళ్ళి చేసుకోవడం వీడికిష్టం లేదేమో! వీడికే ఆ అమ్మాయి అక్కర్లేనప్పుడు తనెందుకు ఊరికే బలవంతపెట్టడం? ఒకవేళ ఇంకా బలవంతపెట్టి చెప్పమని వేధిస్తే వీడు నిజం ఒప్పేసుకుంటాడేమో! అప్పుడు కులం, గోత్రం, మంచి చెడ్డా ఏమీ తెలియని ఈ పిల్లని తను కోడలిగా అంగీకరించవలసి వుంటుంది. అలా చేస్తే తన పరువేం కావాలి?' అని తనలో తనే ఆలోచించసాగాడాయన. పరువు సంగతి గుర్తుకు రాగానే చటుక్కున నిటారుగా నిలబడ్డాడు. ఆమెవైపు తిరిగి "ఎవరు నువ్వు? నిజం చెప్పు? ఏవో కట్టుకథలల్లి మమ్మల్ని మోసగించి మా పరువు మంటగలపాలని వచ్చావా? మా అబ్బాయి మీద లేనిపోని నిందలు వేసి మా వంశగౌరవానికి మసి పూద్దామని చూస్తున్నావా? ముందు వెళ్ళు ఇక్కణ్ణుంచి. వెళ్ళకపోతే మెడపట్టి గెంటాల్సొస్తుంది" అని కేకలు వేసి ఆమె మెడకేసి చెయ్యి చాచాడు. అంతే! ఆమె ఒక్క అంగలో బయటికి ఉరికి లబోదిబోమని మొత్తుకోసాగింది.

అది విని రోడ్డుమీద పోయే వాళ్ళంతా పరుగెత్తుకొచ్చారు. అయిదు నిమిషాలు గడిచేసరికి రాధాకృష్ణ ఇంటి ముందు పెద్ద గుంపు తయారైంది. అంతవరకూ గుండెలు బాదుకుంటూ లబోదిబోమని మొత్తుకున్న ఆ అమ్మాయి జనంవైపు తిరిగి గొంతు పెద్దది చేసుకుని "చూశారా ఈ పెద్దమనిషిని? నన్ను పెళ్ళి చేసుకుంటానని చెప్పి మోసం చేసి ఇప్పుడేమో తండ్రిచేత నన్ను మెడపట్టి గెంటించడానికి సిద్ధమయ్యాడు. ఇంకా ఎంతమందినిలా మోసం చేశాడో ఏమో! వీళ్ళిళ్ళు నాశనమయిపోను.... వీళ్ళ వంశం తుడిచిపెట్టుకుపోను!" అని శపించి రాధాకృష్ణ ఇంటి మీద మూడుసార్లు గుప్పిళ్ళతో మట్టిపోసి చరచరా వెళ్ళిపోయింది అక్కణ్ణుంచి. అక్కడ నిలబడి ఈ వింత చూస్తున్న వాళ్ళల్లో కొంతమంది ఆమె వెనకాలే వెళ్ళారు. మిగిలిన వాళ్ళు అక్కడే నిలబడి పోయారు. ఆమె రైల్వేబ్రిడ్జి వరకూ నడిచివెళ్ళి అక్కడ ఖాళీగా కనిపించిన ఒక ఆటోరిక్షాలో ఎక్కి ఎక్కడికో వెళ్ళిపోయింది. ఆమె వెనకాలే వెళ్ళిన వాళ్ళు నిరాశ పడిపోయి కాసేపు అక్కడే నిలబడి ఆ తర్వాత వెనక్కి వెళ్ళిపోయారు.

ఇంటి ముందు మూగిన జనం ఎంతకీ కదలక పోవడంతో రాధాకృష్ణ తండ్రికి చాలా కోపం వచ్చేసింది. గబగబా బయ



టికి వచ్చి "ఇంకా ఏం చూస్తున్నారిక్కడ? ఎవతో మతిమాలిన ముండ వచ్చి ఏదో వాగిపోయినంత మాత్రాన మీరందరూ ఇలా ఇంటి మీదికి రావాలా? ఇక్కడేం జరగలేదు. అందరూ వెళ్ళిపోండి" అని కసురు కుంటున్నట్టుగా చెప్పాడు. ఆ తరువాత ఒక్కొక్కరే అక్కణ్నించి కదిలి వెళ్ళిపోయారు.

సాయంకాల మయ్యేసరికి ఈ వార్త శాంతప్ప బ్లాక్ అంతటా వ్యాపించిపోయింది. 'అమ్మో... పైకి ఎంతో మంచివాడిలా కనిపించే ఆ రాధాకృష్ణ ఇంత నీచుడన్న మాట!' అని ఒకరంటే 'ఛ...ఛ! పైకి వినయంగా కనిపించే వాళ్ళనసలు నమ్మనే కూడదు. వాళ్ళ లోపలంతా విషమే!' అని మరొకరూ, 'పోనీ ఏదో పొరపాటే చేశాడనుకో, ఆమెనే పెళ్ళి చేసేసుకుంటే కొంతలో కొంతైనా నయంగా ఉండేది' అని ఆధునిక భావాలుగల యువకులు కొందరు అభిప్రాయ పడ్డారు. 'తండ్రీ కొడుకులిద్దరూ కలిసి ఆ అమ్మాయి మెడ పట్టి బయటికి గెంటారు. నేను నాకళ్ళారా చూశాను' అని నిజంగా చూసినట్టే అనేశాడు ఒకతను. ఆ అమ్మాయి ఎవరై వుంటుందా? అన్న విషయం జనంలో తీవ్రమైన చర్చలకు దారితీసింది. 'పాపం ఆమె ఎక్కడికి వెళ్ళిందో?' అని ఒకరంటే 'వాడలా అంటే ఇంకేం చేస్తుంది పాపం... ఆత్మహత్య చేసుకుని వుంటుందేమో!' అని ఇంకొకరూ—ఇలా ఎవరికి తోచినట్టు వాళ్ళు అనుకోసాగారు. రాధాకృష్ణ

మీద కేసు పెడతారన్న పుకారు కూడా వ్యాపించింది అప్పటికప్పుడే.

* * *

ఆ రోజు రాత్రి రంగయ్య ఇంట్లో జరిగిన పార్టీ చాలా జోరుగా సాగింది. రంగయ్య గర్వంగా మీసాలు మెలేస్తూ తన పక్కన కూర్చున్న మూడల గిరియప్పకేసి తిరిగి "చూశావా గిరియప్పా.. ఆ రాధాకృష్ణగాడు మనల్ని వెళ్ళగొట్టాలనుకున్నాడు. ఇప్పుడు చూడు వాడి గతేమైందో? ఇక నలుగురిలో ఎలా తలెత్తుకు తిరుగుతాడో తిరగమను. ఈ అవమానం భరించలేక ఇప్పుడు వాడే ఊరొదిలి పారిపోవాలి" అని చెప్పి సంతోషం పట్టలేక "హ...హ్హ...హ్హ...హ్హ" అని పెద్దగా నవ్వాడు. అలా నవ్వినప్పుడు అతని నోట్లోంచి ఎంగిలి చింది అందరి మొహాలమీద తుప్పర్లగా పడింది. తన మొహం మీద పడిన ఎంగిలిని భుజం మీదున్న తువాలుతో తుడుచుకున్నాడు మూడల గిరియప్ప.

"మరి మన రాగన్నగారంటే ఏమనుకున్నావు రంగన్నా ? ఆయన దయవల్ల ఇంతటివాడైన ఆ రాధాకృష్ణ ఆయనకే ఎసరు పెట్టాలని చూస్తాడా? మంచి శాస్తే చేశారు మన అయ్యగారు" అన్నాడు మూలగిరియప్ప.

అక్కడున్న వాళ్ళందరూ పోటీలుపడి రాగన్న గ్లాసును నింపడానికి సిద్ధమయ్యారు. రాగన్న అందరి దగ్గరి నుంచీ కాస్తకాస్త పోయించుకుని గ్లాసును పైకెత్తాడు. "రాగన్నగారూ...మీరీవేళ నిదానంగా పుచ్చుకోవాలి. తెల్లారిపోయినా పరవాలేదు" అని చెప్పి తన గ్లాసును అందుకున్నాడు రంగయ్య. అంతలో ఏదో గుర్తుకు రాగా "అది సరేగానీ రాగన్న గారూ...ఒకవేళ ఆ అమ్మాయిని వాళ్ళు పోలీసులకు పట్టిస్తే ఏమయ్యేది?" అని అడిగాడు.

రాగన్న నవ్వాడు. "అలా ఎందుకవుతుంది రంగయ్యగారూ ? రాధాకృష్ణ తండ్రికే అనుమానం వచ్చేలా ఉందిగా వ్యవహారం ? పోలీసులకు పట్టిస్తే అసలు రహస్యం బయట పడిపోతుందేమో, తన పరువు మర్యాదలు బజారు పాలయిపోతాయేమో అని భయపడతాడాయన. అదీ కాక ఏదైనా ఆలోచించేందుకు ఆ పరిస్థితిలో ఎవరికి మాత్రం ఏం తోస్తుంది చెప్పండి ? వాళ్ళు ఏదైనా మార్గం ఆలోచించే లోగానే గొడవచేసే అక్కణ్ణుంచి వెళ్ళిపోవాలని ఆ అమ్మాయికి ముందే చెప్పానులెండి. పాపం ఆమె కూడా బలేగా యాక్ట్ చేసి నిమిషంలో మాయమైంది" అన్నాడు రాగన్న లోలోపల ఆమెను మెచ్చుకుంటూ.

"అవునట...చాలా బాగా యాక్ట్ చేసిందిట. నేనూ విన్నాను. పోనీ మీరు ఆమెకు సినిమాలో ఛాన్సు ఇప్పించరాదూ పాపం" నవ్వుతూ అన్నాడు రంగయ్య.

"సరిపోయింది ఇక ఆమెకు సినిమాలో ఛాన్సిప్పించేందుకు స్టూడియోల చుట్టూ తిరగమంటారా నన్ను? ఏదో ఈ వ్యవహారానికి అవసరమైంది, వాడుకున్నాం. దానికి ప్రతిఫలం ఇచ్చేశాం కదా అంతే ! అక్కడితో మనకూ, ఆమెకూ తీరిపోయింది. ఇక ఆమెను గురించి మనం ఆలోచించకూడదు" అన్నాడు రాగన్న.

అందరికీ ఆ మాట నిజమేననిపించింది.

"అబ్బ ! బుర్రంటే మన రాగన్న గారిదే," అని రాగన్నను పొగిడి గ్లాసు

ఖాళీ చేశాడు రంగయ్య.

రాగన్న నిదానంగా ఒక్కో గుక్కే సేవించ సాగాడు. గ్లాసు కింద పెట్టి జుట్టులో ఓసారి వేళ్ళు పోనిచ్చి దువ్వుకుంటూ "ఇక్కడితో మన పని అయిపోయిందనుకోకూడదు" అనగానే చుట్టూ ఉన్నవాళ్ళంతా తమతమ గ్లాసులు టక్కున కింద పెట్టి ప్రశ్నార్థకంగా చూశారు అతని వైపు. రాగన్న మళ్ళీ చెప్పసాగాడు. "ఈ దెబ్బనుంచి కోలుకోడానికి రాధాకృష్ణకు నెలో, రెండునెలలో పడుతుంది. కానీ ఈలోగా ఇదంతా చేసింది మనమేనని అతను ఊహించకపోడు. మనమేనని తెలిసిందో ఇక అతను ఊరుకోడు. రోడ్డును ఇంకా వెడల్పు చేయాలన్న సాకుతో మనందరినీ ఇక్కణ్ణుంచి వెళ్ళగొట్టేందుకు గట్టి ప్రయత్నాలు చేస్తాడు. వాడికిప్పుడు కొంచెం పవరుంది గనుక అది సాధించినా సాధిస్తాడు. కనుక వాడు మనల్ని ఏమీ చేయకుండా ఉండేందుకు మనం ఇప్పుడే ఏదైనా ప్లాన్ చెయ్యాలి" అని చెప్పి మళ్ళీ గ్లాసందుకుని ఒక గుక్క తాగాడు.

"ఏం చేయాలో చెప్పండి రాగన్నగారూ..." అంటూ ఇద్దరు ముగ్గురు ఒకేసారి అడిగారు.

కొంచెం ఆగమన్నట్టు సైగచేసి ఒక్క క్షణం కళ్ళు మూసుకున్నాడు రాగన్న. ఆ తర్వాత ఇలా అన్నాడు.

"అటువైపు వినాయకుడుండడంవల్ల ఆ వరస జోలికి ఎవరూ వెళ్ళేటట్టులేరు. ఇక ఇటువైపు అంటే మనముంటున్నవైపు ఏ రక్షణా లేదు. కాబట్టి ఇక్కడ కూడా ఒక దేవుడొస్తే అప్పుడు ఇక్కడికి కూడా ఎవరూ అడుగు పెట్టరు!"

వాళ్ళెవరికీ అతని మాటలు తలాతోకా అర్థం కాలేదు. అందరూ తనకేసి గుడ్లప్పగించి అయోమయంగా చూస్తూ ఉండడం గమనించి రాగన్న "ఇంకా అర్థం కాలేదా!" అని అడిగాడు.

అందరూ ఒకేసారి 'లేదన్నట్టు' తల లూపారు.

"ఇందులో అర్థం కానిదేముంది చెప్పండి. అటు వినాయకుడు ఉద్భవిస్తే ఇటు వాళ్ళ బాబు ఉద్భవించాలి. అంతే!" అని చెప్పి నవ్వాడు రాగన్న.

అప్పటికీ వాళ్ళకర్థం కాలేదు. చివరికి రంగయ్య ఆత్రుత పట్టలేక "అదేమిటో సరిగ్గా చెప్పండీ రాగన్నగారూ... మీరు మంత్రాలు చెప్పినట్టుగా మాట్లాడితే మాకర్థం కాదు. మా మొద్దు బుర్రలకు బాగా తెలిసేలా వివరించి చెప్పండి" అన్నాడు.

రాగన్న నవ్వి మళ్ళీ చెప్పటం మొదలెట్టాడు.

"పార్కులో వినాయకుడు ఉద్భవించడంవల్ల ఆ వరసంతా సురక్షితంగా ఉండగలిగింది. అంటే అక్కడ రోడ్డు వెడల్పు చేయాలంటే దేవాలయాన్ని పడగొట్టాలి. అయితే అలాంటి పాపకార్యాన్ని ఎవరూ చేయలేరు కాబట్టి ఆ వరసలో ఉన్న ఇళ్ళ జోలికి ఎవరూ పోరు. కానీ మన ఇళ్ళు ఉంటున్న వరస సంగతి వేరు. ఇక్కడ అలాంటి అడ్డేదీ లేదు కాబట్టి తల్చుకున్నప్పుడు ఇళ్ళు పడగొట్టి రోడ్డు వెడల్పు చేసేయొచ్చు. అందుకని ఇక్కడ కూడా ఒక గుడి కట్టించేస్తే అప్పుడు మనం కూడా ఇక్కడే సురక్షితంగా ఉండిపోవచ్చు. కాబట్టి అక్కడ విఘ్నేశ్వరుడు ఉద్భవించినట్టే ఇక్కడ పరమేశ్వరుడు ఉద్భవించాలి. ఎంతైనా వాళ్ళిద్దరూ తండ్రీ కొడుకులు కదా– మరి కొడుకును



వెతుక్కుంటూ తండ్రి రావడం సహజ మేగా? అందుకని అలా శివుడు గనుక ఇక్కడికి కొచ్చేస్తే మనం బతికి పోవచ్చు....."

రాగన్న మాటలు వింటూ వింటూ వాళ్ళు మందుకొట్టడం కూడా మరిచి పోయారు. తమ క్షేమం కోసం రాగన్న ఎంత కష్టపడుతున్నాడో పాపం! అను కుని మూడల గిరియప్ప లేచి నిలబడి రాగన్న కాళ్ళ మీద సాష్టాంగ పడి పోయాడు. అతన్ని చూసి మిగతావాళ్ళు కూడా అలాగే చేశారు. వాళ్ళిలా చేస్తా రని అనుకోని రాగన్న క్షణకాలం దిమ్మెర పోయాడు. మళ్ళీ అంతలోనే తేరుకొని "ఛ! ఏమిటిది? నాకెందుకు దండం పెడుతున్నారు? లేవండి. దేవుడు వచ్చాక ఆయనకి దండం పెడుదురుగాని" అంటూ వాళ్ళను లేపాడు.

"మాకు మీరే దేవుడు రాగన్న గారూ... మీరు లేకపోతే మాకెన్ని కష్టాలొచ్చిపడేవో ఏమిటో?" అని చెప్పి

రంగయ్య తానూ లేచి దండం పెట్టడానికి వచ్చేవరికి అతన్ని మధ్యలోనే ఆపి "ఇవన్నీ అలా ఉండనివ్వండి గానీ... నేను చెప్పిన మాటలన్నీ సరిగ్గా వినిపించు కున్నారా లేదా? ఆ ప్రకారం చేయా లంటే త్వరగా కానివ్వాలి మరి!" అని మళ్ళీ వాళ్ళను అసలు విషయంలోకి లాగాడు. రాగన్న చెప్పిన సలహాను పాటించాలన్న విషయంలో వాళ్ళల్లో వాళ్ళకి ఎప్పుడూ భిన్నాభిప్రాయమన్నది లేదు కాబట్టి తమ క్షేమంకోరి ఇప్పుడు అతను చెప్పిన విషయాన్ని వీలైనంత త్వరలో ఆచరణలో పెట్టడానికి నిర్ణ యించారు.

"శివుడు ఎక్కడ ఉద్భవించాలి?" అన్న ప్రశ్న చర్చకొచ్చినప్పుడు "ఈ వరసలో ఉన్నవారెవరైనా కొద్దిగా స్థలం వదిలిపెడితే చాలు, ఒక చిన్న గుడి కట్టేయవచ్చు. రోడ్డు వైపుకే ద్వారం ఉంటుంది కాబట్టి వచ్చేపోయే భక్తులకు కూడా ఏం ఇబ్బంది కలగదు. ఒకవేళ ఎక్కువ సంఖ్యలో జనం వచ్చినా అందరూ బయటే నిలబడతారు. స్థలం

ఇచ్చిన వారికి మిగిలిన వాళ్ళందరూ చందాలు వేసుకుని నష్టపరిహారం ఇచ్చుకోవాలి" అని రాగన్న ఆ సమస్యకు పరిష్కారం కూడా చెప్పాడు.

వెంటనే రంగయ్య కల్పించుకుని "దాందేముంది రాగన్నగారూ... స్థలం నేనిస్తాను" అన్నాడు.

విశ్వేశ్వరస్వామి గుడి ఎదురుగానే అతని స్థలం ఉండడంవల్ల అక్కడే శివుడు ఉద్భవిస్తే తండ్రీ కొడుకులిద్దరూ దగ్గర దగ్గరగా ఉంటారు. దాంతో అప్పుడు ప్రజలూ నమ్ముతారు—అనుకుని అందరూ ఓ నిర్ణయానికి వచ్చి రంగయ్యకు నష్ట పరిహారం ఇవ్వడానికి కూడా అంగీకరించారు.

మహాశివరాత్రి దగ్గర పడడం వల్ల ఆ రోజే శివలింగం ఉద్భవించేలా చేయాలని రాగన్న అన్నప్పుడు అందరూ ఏకగ్రీవంగా ఒప్పుకున్నారు.



# 17

శివలింగం ఉద్భవించేలా చేయాలని రాగన్న నోటితో అయితే సులభంగా చెప్పగలిగాడు గానీ ఈసారి అది ఎలా ఆచరణలో పెట్టాలో అతనికి తోచలేదు. రెండు మూడు రోజులు తీవ్రంగా ఆలోచించాడు. వినాయకుణ్ణి ఉద్భవింపచేసినట్టే శివలింగాన్ని ఉద్భవింపచేస్తే జనానికి అనుమానం వస్తుంది కాబట్టి ఈసారి ఇంకో విధంగా పని పూర్తి చేయాలని అనుకున్నాడు.

ఆ రోజు కూడా మామూలుగా పది గంటలకి నిద్రలేచి, వెళ్ళి భట్టుగారి హోటల్లో కాఫీ తాగి, రోడ్డు పొడుగునా అలా నడుచుకుంటూ వెళ్ళాడు రాగన్న. కొత్తగా దుకాణాలు కట్టించడానికోసం ఒకచోట ఎవరో పునాదులు తవ్విస్తున్నారు. వీలైనంత త్వరలో తనూ దుకాణాలు కట్టించేయాలని మనసులోనే అనుకుంటూ రాగన్న, వాళ్లు తవ్వుతున్న పునాది కేసే చూస్తూ నిలబడ్డాడు. బిల్డింగు కట్టించే యజమాని కానీ, మేస్త్రీ కానీ అక్కడ లేనందువల్ల పనివాళ్ళందరూ హాయిగా కబుర్లు చెప్పుకుంటూ ఒకర్నొకరు పరాచికాలు చేసుకుంటూ నవ్వుకుంటూ నిదానంగా పనిచేస్తున్నారు. మగ కూలీలు తవ్వి తట్టకెత్తిన మట్టిని ఆడ కూలీలు తలమీద కెత్తుకుని మోసుకెళ్ళి అవతల పోసి వస్తున్నారు. అంతలో తవ్వుతున్న వాళ్ళల్లో ఒకడు గుండ్రని పెద్ద నల్లరాయి తీసి చేతిలో పట్టుకుని, దానికంటిన మట్టిని దులిపి అటూ ఇటూ తిప్పి తిప్పి చూడసాగాడు. అలా చూస్తూండే అతనికేమనిపించిందో గానీ వెంటనే మిగతా కూలీలందర్నీ పిలిచి చూపించాడు. వాళ్లు కూడా ఆ రాయిని చేతిలోకి తీసుకుని చూడసాగారు. వాళ్ళంతా చుట్టూ మూగి దాన్ని వింతగా చూస్తూండడం గమనించి రాగన్న కూడా అటుకేసి వడివడిగా నడిచి వెళ్ళాడు. రాగన్న వచ్చి నిలబడగానే వాళ్ళందరూ పక్కకు తప్పుకుని అతనికి దారిఇచ్చారు. "ఈ రాయేంటో విచిత్రంగా వుంది చూడండి బాబూ..." అని దాన్ని తవ్వి తీసినవాడు రాగన్న చేతికందించాడు.

రాగన్న ఆ రాయిని రెండు చేతు

త్రోమా ఎంతో భక్తిగా అందుకుని కళ్ళ కద్దుకుంటూ "శివశివా" అన్నాడు. కూలి పని వాళ్ళందరూ పనిపాటలు మరిచిపోయి అక్కడ గుమిగూడి అలాగే చూస్తూ నిల బడిపోయారు.

వాళ్ళ ఆశ్చర్యాన్ని చూసి రాగన్న "అలా చూస్తారేమిట్రా? ఇది శివలింగం. అందరూ దండం పెట్టుకోండి" అని చెప్పి దాన్ని అక్కడే ఉన్న పెద్ద రాతిబండ మీద ఉంచాడు. దాంతో కూలిపని వాళ్ళం దరూ దాన్ని తాకడానికి భయపడిపోయి దూరంగా జరిగి సాష్టాంగపడి నమస్కా రాలు చేశారు. వీళ్ళంతా ఇలా ఒక్క సారిగా సాష్టాంగ నమస్కారాలు చేయడం చూసి ఆ దారిన వెళుతున్న వాళ్ళు కూడా కుతూహలం పట్టలేక వచ్చి అక్కడ చేరారు. గుంపు అంతకంతకూ పెద్దదైంది. ఆ గుంపును చూసి దూరంగా ఉన్న వాళ్ళు కూడా పరుగెత్తుకొచ్చారు. అంతలో ఆ స్థలం యజమానీ, మేస్త్రీ ఇద్దరూ ఆత్రుతతో జనాన్ని తోసుకుంటూ గబగబా ముందుకు వచ్చారు. ఆ యజ మానిని చూడగానే రాగన్న "చూడండి సార్ ! ఈ శివలింగం మీ స్థలంలో దొరి కింది. అంటే మిమ్మల్ని ఆశీర్వదించ డానికి శివుడే ఇక్కడ అవతరించాడన్న మాట ! ముందు దీనికి పూజా పునస్కా రాలు ఏర్పాటు చేయండి. ఆ తర్వాత ఏదైనా శివాలయానికి తీసికెళ్ళి ఇచ్చే యండి" అన్నాడు.

వెంటనే ఆ యజమాని పూజా సామ గ్రులు తెమ్మని మనుషులను పంపించాడు. మేస్త్రీ ఎవరైనా పురోహితుణ్ని పిలుచు కొస్తానని వెళ్ళాడు.

పురోహితుడు వచ్చి పూజ ప్రారం భించేసరికి అక్కడ వందల కొద్దీ జనం పోగయిపోయారు. చుట్టుపక్కలున్న ఇళ్ళవాళ్ళు కూడా పూలు, పళ్ళు, కొబ్బరి కాయలు తేవడంతో, కొబ్బరికాయలు కొట్టీ కొట్టీ పురోహితుడు అలసిపోయాడు. అంతలో ఎవరో మేళగాళ్ళను తీసుకు రావడంతో ఆ సన్నివేశానికి మరింత కళ వచ్చింది. పూజలన్నీ పూర్తయిన తర్వాత మంగళ వాద్యాలతోనూ, ఊరేగింపు తోనూ ఆ శివలింగాన్ని తీసికెళ్ళి శివా లయానికి సమర్పించారు.

ఆ రోజు సాయంకాలం మామూలుగా రంగయ్య ఇంట్లో అందరూ సమావేశమై నప్పుడు రాగన్న జరిగిన విషయమంతా వాళ్ళతో చెప్పాడు.

"మీరు సరిగ్గా చూశారా రాగన్న గారూ...? అది నిజంగా శివలింగమేనా?" అని ఎవరో అడిగేసరికి రాగన్న నవ్వి "అది శివలింగమో ఏ లింగమో ఎవరికి తెలుసు ? మనం అన్నాం కాబట్టి ఇప్పు డది శివలింగమే !" అన్నాడు.

అందరూ పెద్దగా నవ్వారు.

రంగయ్య మాత్రం నవ్వకుండా కాస్త అనుమానిస్తూనే "అవి సరే రాగన్న గారూ...అక్కడే గుడి కట్టించే ఏర్పాటు చేస్తే బాగుండేదిగా ?" అన్నాడు.

రాగన్న మళ్ళీ నవ్వాడు.

"ఆ విషయం మీకు అర్థంకాదులెండి... ఆ స్థలంలో గుడికట్టాలంటే ఆ స్థలంగల యజమాని ఒప్పుకుంటాడో, ఒప్పుకోడో ? ఒకవేళ అతనికి ఇష్టం లేకపోతేనో? అందు కనే ఆ శివలింగాన్ని శివాలయానికి చేర్చేలా ఏర్పాటు చేశాను. అది/కూడా మన మంచి కోసమే సుమండీ ! ఊం అయినా ఇవన్నీ మీకిప్పుడు అర్థం కావులెండి. మీ పాత

దుకాణాలు పడగొట్టి ఆ స్థలాన్ని వాళ్ళ రోడ్డుకు కలిపేసుకున్నారుగా? ఇక వెనకాలున్న మీ స్థలంలో కొత్తగా దుకాణాలు కట్టించడానికి ప్లాన్లు తయారు చేసుకోండి! మిగిలిన ఏర్పాట్లు నేను చూసుకుంటాను" అన్నాడు.

ఆ తర్వాత ఇంకేం మాట్లాడాలో వాళ్ళకు తోచలేదు. దానికి బదులుగా మందు వాళ్ళ నోళ్ళను మూయించేసింది.

భూమిలో శివలింగం దొరికిన రెండు మూడు రోజులకు అక్కడంతా ఒక కట్టు కథ వ్యాపించి పోయింది. కొన్నివందల యేళ్ళ క్రితం అక్కడ నూటొక్కలింగాల శివాలయం ఉండేదనీ, అప్పుడు మనుషుల్లో అధర్మం పెరిగిపోయి వాటికి అభిషేకం చేసేవారే కరువైపోయేసరికి ఒక ఋషికి కోపం వచ్చి శపించాడట 'ఇక్కడున్న ఇళ్ళన్నీ నేలమట్టమైపోవాలి. ఈ శివలింగాలన్నీ భ్రష్టుల కంటికి కనపడకుండా భూమిలో పాతుకుపోవాలి. ముసుముందు ఎప్పుడైనా మనుషుల్లో ధార్మిక భావాలు కలిగి దేవుడిమీద భక్తి శ్రద్ధలు పెరిగినప్పుడు మళ్ళీ ఈ లింగాలు భూమిలోంచి పైకి ఉద్భవించాలి' అని.

'ఆయన శపించినట్టే ఆ తర్వాత ఊరంతా తుడిచి పెట్టుకుపోయి ఆ శివలింగాలన్నీ భూమిలో పాతుకుపోయాయట! ఆ లింగాల్లో ఒక లింగమే ఇప్పుడు ఆ పునాది తవ్వినప్పుడు దొరికిందట! ఆ వినాయకుడి విగ్రహం కూడా బహుశా ఆ శివాలయంలోదే అయివుంటుంది. ఇలా ఇంకా ఎన్నిలింగాలు బయటపడనున్నాయో మరి!' అని ఒకకట్టు కథ ప్రజల్లో వ్యాప్తిలోకి వచ్చేసింది.

రంగయ్య రోడ్డుకు పోగా మిగిలిన స్థలంలో దుకాణాలు కట్టించడానికి ప్లాన్లు వేయించి, లైసెన్సు సంపాదించుకున్నాడు. మహాశివరాత్రి ఇంకా రెండు రోజులుండనగా అక్కడ పూజ, శంకుస్థాపన జరిగాయి. ఆ రోజురాత్రే రాగన్న కొంతమంది అనుయాయులను వెంటబెట్టుకుని నగరానికి పదిమైళ్ళ దూరంలోఉన్న ఒక పాడు బడిన శివాలయానికి వెళ్ళి అక్కడి శివలింగాన్ని తరలించుకు వచ్చాడు. రంగయ్య పునాది తవ్వించిన స్థలంలో ఒక గొయ్యి తీసి దాన్ని అక్కడ పాతిపెట్టించాడు.

మర్నాడు పనివాళ్ళు వచ్చి పునాది తవ్వడం ప్రారంభించారు. మధ్యాహ్నం వేళకు శివలింగం పాతిపెట్టినచోట గునపానికి ఏదో తగిలి 'ఖంగు...ఖంగు' మని చప్పుడయింది. ఏదో పెద్ద రాయి తగిలిందేమోనని చుట్టూ ఉన్న మట్టినంతా తవ్వి తీశాడు కూలీవాడు. పైకి తీసిచూస్తే అదొక శివలింగం!

"అందరూ రండర్రోయ్...ఇదుగో సూడండి" అని వాడు తోటి కూలీ పనివాళ్ళందర్నీ కేకేశాడు. రంగయ్య దూరంగా నిలబడి అజమాయిషీ చేస్తున్నట్టు నటిస్తున్నాడు. పనివాళ్ళంతా ఒకచోట చేరి గోల చేస్తుంటే "ఏమిట్రా ఆ గోల?" అంటూ దగ్గరికొచ్చాడు. వాళ్ళ చేతుల్లోది చూసీ చూడగానే "అయ్యో...ఇది శివలింగంరా!" అంటూ కేకపెట్టి "స్వామీ...నా తండ్రీ..." అంటూ దానికి సాగిలపడి మొక్కాడు. నిమిషంలో జనం అక్కడ పోగయ్యారు. ఆ సమయానికి సరిగ్గా రాగన్న కూడా ప్రత్యక్ష మయ్యాడు. విఘ్నేశ్వరుడు ఉద్భవించినప్పుడు అన్నీ పురమాయించినట్టే ఇప్పుడూ పురమాయించాడు. ఆ

తర్వాత యథాప్రకారంగా పూజా కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి.

వినాయకచవితి రోజు వినాయకుడు ఉద్భవించాడు. కొడుకును వెతుక్కుంటూ రావడానికి మంచి ముహూర్తం కుదరక శివుడు మహాశివరాత్రి పండగవరకూ వేచి వున్నాడు. అందరూ అనుకుంటున్నట్టు పూర్వం ఇక్కడ నిజంగా ఒక గుడి ఉండేదేమో అన్న అభిప్రాయం ప్రజల్లో ఏర్పడిపోయింది.

తన సొంత స్థలంలో దొరికింది కాబట్టి ఈ శివలింగాన్ని ఏ శివాలయానికీ ఇవ్వననీ, అది ఇక్కడే ఉండాలనీ రంగయ్య పట్టుబట్టడంలో లింగాన్ని అక్కడే ప్రతిష్టాపన చేసేశారు. విఘ్నేశ్వరస్వామికి జరిగినట్టే ఆయన తండ్రికి కూడా పూజా విధులన్నీ యథావిధిగా జరిగాయి. మరో మూడు నాలుగు రోజుల వరకూ అక్కడో పెద్ద తిరనాల జరిగింది. జనం ఎడతెరిపి లేకుండా వచ్చి శివుడి దర్శనం చేసుకుని వెళ్ళారు.

"వినాయక చవితి రోజు వినాయకుడూ శివరాత్రి రోజు శివుడూ ఉద్భవించినట్టే ఇక ప్రతి పండక్కీ ఆయా దేవుళ్ళు ఉద్భవిస్తూ వుంటారేమో! ఎందుకంటే మనలో దేవుళ్ళకేం కొరత లేదుగా! ముప్పయి మూడుకోట్ల దేవుళ్ళు ఎలాగా ఉండనే ఉన్నారాయె! అప్పుడతారార్భ్యం ఇలా ఇక్కడ దేవతార్చన సాగుతూనే వుంటుంది" అన్న గుసగుసలు బయలుదేరినా ఆ గందరగోళంలో ఎవరికీ వినిపించలేదు.

* * *

రాధాకృష్ణ తన ఇంట్లో ఆ సంఘటన జరిగినప్పటి నుంచీ కొన్ని రోజుల వరకూ ఎవరికీ ముఖం చూపించలేదు. ఆ తర్వాత బయటికి వచ్చినా 'అందరూ తననే చూస్తున్నారేమో!' అనిపించేది అతనికి. జరిగిందంతా ఒట్టి అబద్ధమని అందరితోనూ చెబుదామనుకున్నాడుగానీ వాళ్ళు ఆ మాట నమ్మినట్టు తనముందు నటించి, తన వెనకాల తనని వేళాకోళం చేస్తారేమోనని భయపడి ఆ ప్రయత్నం మానేశాడు. విఘ్నేశ్వర యువక సంఘ సభ్యులు కూడా ఇప్పుడు అతని దగ్గరికి రాకుండా మొహం చాటేసుకు తిరగసాగారు. ఇదంతా చూసి అతను లోలోపల చాలా బాధపడిపోతూ ఇక భరించలేక కొన్నాళ్ళు ఎక్కడికో వెళ్ళిపోయాడు. అతను తిరిగి వచ్చేసరికి శివలింగం ఉద్భవించడం జరిగిపోయింది. 'ఇదంతా రాగన్నగాడి పనే' అని ఎలుగెత్తి చాటాలనిపించినా మొట్టమొదటిసారి అలాంటి పని చేసినప్పుడు తాను కూడా అందులో పాలు పంచుకున్నాడన్న సంగతి గుర్తొచ్చి నోరు మూసుకుని ఉండిపోయాడు. తను తొందరపడి అనవసరంగా రాగన్నతో ద్వేషం పెంచుకోవడం పెద్ద తప్పయిపోయిందని లోలోపలే కుంగిపోతూ పైకి ఏమీ అనలేక గిలగిల్లాడి పోయేవాడు. ఆత్మీయంగా మాట్లాడే వాళ్ళు కూడా లేకుండా పోయేసరికి మౌనమే అతనికి శరణ్యమై పోయింది.

రాధాకృష్ణ పరిస్థితి చూసి రాగన్నకంటే ఎక్కువ సంతోషించింది శంకరయ్య. ఈ రాధాకృష్ణగాడి వల్ల తాను మళ్ళీ పురోహితుల సంఘంలో సభ్యుడుగా ఎన్నికయ్యే అవకాశమే లేదేమోనని పరితపిస్తున్న అతనిలో మళ్ళీ కొత్త ఆశలు చిగురించాయి! ఆ ఆశతోనే మళ్ళీ అందరినీ మంచి చేసుకోవానికి ప్రయత్నించ

సాగాడు. శంకరయ్య రాగన్న, రంగయ్యల దగ్గరికీ కూడా అప్పుడప్పుడు వస్తూ పోతూ ఉండేవాడు. ఆ అవకాశం కోసమే ఎదురు చూస్తున్న రంగయ్య కూడా అతనితో బాగా మాట్లాడాడు.

"రాగన్న గారూ...ఈసారి ఎన్నికల్లో శంకరయ్యను నిలబెడతామంటారా ?" అని రంగయ్య అడిగినప్పుడు "ఆఁ... చూద్దాం లెండి. ఎలక్షన్ల వరకూ వాడి కలాగే చెప్పుకొస్తూ ఆ తర్వాత ఏం చేయాలో ఆలోచిద్దాం" అన్నాడు రాగన్న.

* * *

రోడ్డు పని ఇప్పుడు పూర్తయిపోయింది. అయితే మొట్టమొదట అనుకున్నట్టు ఒకే లెవెల్‌గా రోడ్డును వేయడం కుదరలేదు. వంతెనకటువైపు కూడా ఆరోడ్డు వంకర టింకరగానే ఉండిపోయింది. పని మొదలు పెట్టినందుకు ఏదో అక్కడక్కడ చేశామనిపించారంతే! ఎన్నో సమస్యలు, ఇద్దరు దేవుళ్ళ ఉద్భవానికి కారణమైన ఆరోడ్డు ఎన్నో రహస్యాలను తన కడుపులో దాచుకుని ఎప్పట్లాగే పడుకునుంది. ఆ రహస్యాలు ఉద్భవించకుండా ఉండేలా దానిమీద వాహనాలు ఎప్పుడూ తిరుగుతూ వుంటాయి.

పురపాలక సంఘంవారు ఆక్రమించుకోగా మిగిలిన స్థలంలో కొత్తగా దుకాణాలు వెలిశాయి. కొందరేమో మూడు నాలుగంతస్తుల మేడలను కూడా నిర్మించుకున్నారు. ఆ రోడ్డు మీదే మళ్ళీ ఎప్పటిలాగే కార్యకలాపాలు జరిగిపోతున్నాయి. కేసు ఇంకా పరిష్కారం కానందువల్లో ఏమో భట్టుగారి హోటల్ మాత్రం అదే రూపంలో ఉంది. జరిగిన సంఘటనలకు ప్రతీకగా మిగిలిపోయింది.

రాగన్న మునుపటిలా ఇప్పుడు ఎవర్నీ ఆశ్రయించడంలేదు. తన ఇల్లున్న చోట మూడు దుకాణాలు కట్టించి వాటిని అద్దెకిచ్చి తాను వుండడానికి పైన మేడ కూడా కట్టించుకున్నాడు. ఇప్పుడు రాఘవేంద్రరావుగారు అందరికి కావలిసినవాడు. ఎంతో గౌరవంగల పెద్ద మనిషి.

శివలింగం ఉద్భవించిన చోట ఒక చిన్న శివాలయం వెలసి ఎదురెదురుగా వున్న రెండు గుళ్ళకూ భక్తులు అసంఖ్యాకంగా వచ్చిపోతున్నారు.

ఇప్పుడు వాహనాల సంఖ్య మరింత పెరిగిపోవడంతో ఆ రోడ్డు పూర్వంలాగే చాలా రద్దీగా ఉంటోంది. వాహనాల హారన్‌లతోబాటు రెండు వైపులా ఉన్న ఆలయాల్లోని గంటల చప్పుడు కూడా కలిసిపోయి విచిత్రమైన ధ్వని వినిపిస్తూ వుంటుంది.



## చతుర కతలు

# సందు

లట్ పిట్ సింగ్ ఆంధ్రప్రదేశ్‌లో పర్యటిస్తూ వచ్చి విజయవాడ చేరాడు. చవగ్గా వుండే చిన్న హోటల్‌కి తీసికెళ్ళమని రిక్షావాడితో చెప్పాడు. రిక్షావాడు సందుగొందులు తిప్పి ఓ చిన్న హోటల్ ముందు సింగ్‌ని దింపాడు.

ఆ హోటల్‌లో సింగ్‌కి దొరికిన గది చిన్నదయినా సౌకర్యాలన్నీ వున్నాయి. మధ్యాహ్నం వరకు గదిలోనే కూర్చుని ఆ రోజు ఏయే ప్రదేశాలు తిరగాలో నోట్ చేసుకుని బయలు దేరాడు.

హోటల్లోంచి బయటికి వచ్చి సందు చివరి వరకు నడిచాడు. తను ఆ సందుని మర్చిపోవచ్చు. అందుకే తన డైరీలో ఆ సందు పేరు నోట్ చేసుకోవాలనుకున్నాడు.

సందు చివర గోడ మీద ఓ రేకు బోర్డుంది. దానిమీద పేరు తెలుగులో రాసి వుంది. లట్ పిట్ సింగ్‌కి తెలుగు బొత్తిగా తెలీదు. అయితే కొద్దిగా అర్థం వచ్చు. వెంటనే ఆ బోర్డుమీదున్న అక్షరాల్ని అలాగే తన డైరీలో రాసుకున్నాడు.

ఓ వేళ తను ఆ వీధిని మర్చిపోతే, ఎవరికైనా ఆ డైరీలో అక్షరాల్ని చూపిస్తే వాళ్ళే దాన్ని చదివి చెప్తారు అని ధైర్యం సింగ్‌కి.

తర్వాత సింగ్ ఊరంతా తిరిగి చీకటి పడే వేళకు హోటల్ రూమ్‌కి బయలు దేరేసరికి భయపడ్డంత పనీ అయింది. తను బసచేసిన హోటల్ ఏ సందులో ఉందో లట్ పిట్ గుర్తు పట్టలేకపోయాడు. హోటల్ పేరు చెబితే ఎవరూ దారి చెప్పలేకపోయారు. చిన్న హోటలు కదా!

వెంటనే తన దగ్గరున్న డైరీ తెరిచి ఆ దారినే పోతున్న ఓ పెద్ద మనిషిని "ఈ వీధి ఎక్కడ వుందో చెప్తారా?" అని హిందీలో అడిగాడు.

ఆ పెద్ద మనిషి డైరీలో రాసివున్న అక్షరాల్ని చదివి విరగబడి నవ్వసాగాడు. కాసేపట్లో మరి కొందరు చుట్టూ చేరారు. సింగ్ వాళ్ళక్కూడా డైరీ చూపించి ఆ వీధి ఎక్కడని అడిగేడు. వాళ్ళూ ఫకాల్న నవ్వేరు. మరి కొంతమంది జనం పోగయ్యారు, అందరూ విరగబడి నవ్వుతున్నారు.

లట్ పిట్ సింగ్‌కి ఏమీ అర్థం కాలేదు. 'దానిలో వున్న వీధి అడ్రసు చెప్పమంటే వెర్రి వాళ్ళలా నవ్వుతారేమిటి?' అని సింగ్‌కి కాస్త చిరాకు కూడా కలిగింది.

చివరకు ఓ కుర్రాడు ముందుకు వచ్చి లట్ పిట్ సింగ్ తన డైరీలో రాసుకున్న



తెలుగు అక్షరాల్ని చదివి వినిపించాడు.

"ఇచ్చట మూత్రము పోయరాదు"

—రమణ

# శిక్ష

చక్రవర్తి బుర్ర తెగని ఆలోచనలతో గజిబిజిగా ఉంది. తనకు ఎదురైన విషమ సమస్యకు ఎంత తల బద్దలు చేసుకున్నా పరిష్కార మార్గం తట్టటం లేదు. స్కూటర్ నడుపుతున్నాడన్న మాటేగానీ అతని ఆలోచనలు, చూపులూ ఎక్కడో వున్నాయి.

ట్రాఫిక్ ఇన్‌స్పెక్టర్ మోటార్ సైకిలు మీద వెంటాడి వేగంగా వచ్చి తన స్కూటర్‌కి అడ్డం నిలబడే వరకు చక్రవర్తి ఈ లోకంలోకి రాలేకపోయాడు.

"నడిరోడ్డు మీద నీ ఇష్టం వచ్చినంత స్పీడుగా వెళ్తున్నావ్ బతకాలనే ఆశలేదా? నీవు చస్తే చచ్చావ్...జనాన్ని చంపేటట్లున్నావ్. మైలుదూరం నుంచి ఆపమని అరుస్తున్నా వినిపించుకోకుండా స్కూటర్ వేగంగా నడుపుతూ పోతున్నావేం?" కోపంగా అన్నాడు ట్రాఫిక్ ఇన్‌స్పెక్టర్. చక్రవర్తి ఏం చెప్పినా లాభం లేకపోయింది.

రెండోరోజు చక్రవర్తి కోర్టులో హాజరయినప్పుడు జడ్జి అతనికి పాతిక రూపాయలు జరిమానా విధించాడు. అది కట్టకపోయినట్లయితే పదిరోజుల జైలుశిక్ష అనుభవించాలన్నాడు.

పదిరోజులు జైల్లో ఉండేందుకే చక్రవర్తి ఒప్పుకున్నాడు. జడ్జికి ఆశ్చర్యం వేసింది.

"పాతిక రూపాయలు కట్టేందుకు నీకేమిటి అభ్యంతరం అంతలేని వాడివి కాదు గదా!" అన్నాడు జడ్జి చక్రవర్తితో.

"డబ్బు సంగతి తర్వాత సార్! మా ఆవిడ గొప్పరచయిత్రి. పాతికరూపాయలో లెక్క కాదు. కానీ వారపత్రిక నవలల పోటీకి పంపేందుకు మా ఆవిడ ఓ నవల రాసింది. దాన్ని దిద్ది ఫెయిర్ చేసిపెట్టమని రోజూ పోరుతోంది. ఆ నవలను



ఫెయిర్ చేయడమంత కఠిన శిక్ష మరొకటి వుండదు. పోటీ గడువు ఇంకా వారం రోజులుంది. ఈ పదిరోజులూ నేను జైల్లోనే వుంటాను. ఈలోగా మా ఆవిడే నవల ఫెయిర్ చేసుకుని పంపించుకుంటుంది" అన్నాడు చక్రవర్తి నవ్వుతూ.

—ప్రశాంతి

# ఫూల్స్

మూర్తి, రావు ఆర్ అండ్ బి డిపార్టుమెంటులో అసిస్టెంట్ ఇంజనీర్లుగా పనిచేస్తున్నారు. వాళ్ళిద్దరూ ఆఫీసు వదిలి వచ్చినప్పటి నుండీ ఏదో ఒకటి సరదాగా మాట్లాడు కుంటూనే ఉంటారు. వాళ్ళిద్దరి

మాటల్లోకి రాని విషయమంటూ ఉండదు.

ఓ నాటి ఆదివారం కబుర్ల సందడిలో వాళ్ళ దగ్గర పనిచేస్తున్న బంట్రోతుల ప్రస్తావన వచ్చింది.



"చూడండిరావుగారూ! మా ప్యూను మహా అమాయకుడండి"

"అబ్బ! మీ వాడికేముంది మూర్తి గారూ! మా బంట్రోతు శుద్ధ చవటండీ"

"...చూడండి రావుగారు మా వాణ్ని పిల్చి వాడెంత వెధవో మీకు చూపిస్తాను" అని దూరంగా ఉన్న శింగయ్యను గట్టిగా కేకేశారు.

"బజారు కెళ్ళి క్రొత్త అంబాసిడర్ కారు ఒకటి కొనుక్కొని రా" అంటూ ఓ రూపాయి నోటు శింగయ్య చేతిలో పెట్టాడు మూర్తి. "చిత్తం" అంటూ రూపాయినోటు గుప్పెట్లో బిగించి పరుగు పెట్టాడు బంట్రోతు శింగయ్య.

"మావాడి సంగతి చూడండి" అంటూ రావుగారు "ఒరే లింగం మన ఆఫీసుకు వెళ్ళి నేను ఉన్నానో లేదో కనుక్కురా" ఆజ్ఞాపించారు.

"అలాగేనండి" అంటూ ఆఫీసువైపు పరుగు లంకించుకున్నాడు బంట్రోతు లింగయ్య.

అలా పరుగు పెట్టిన శింగయ్య, లింగం ఓ చోట కలుసుకుని—

"ఒరే మా ఏ.ఇ గారు వట్టి అమాయకులురా"

"ఇంకానయ్యం. మా ఏ.ఇ గారు ఇంకా అమాయకులురా! చూడూ! రూపాయి ఇచ్చి క్రొత్త అంబాసిడర్ కారు తెమ్మన్నారు. ఈవేళ ఆదివారం శెలవు బజారు ఉండదని తెలియని అమాయకుడురా బాబు" వాపోయాడు శింగయ్య.

"అదిసరే.... మా ఏ. ఇ. రావుగారు ఆయన ఆఫీసులో ఉన్నారో లేదో కనుక్కొని రమ్మన్నారు. అది చెప్తున్నప్పుడు ఆయన ప్రక్కనే ఫోన్ ఉంది. ఆఫీసుకి ఫోనుచేసి కనుక్కోవచ్చు కదరా?" అన్నాడు లింగం.

—టి. వి. సుబ్బారావు

# తిండి సామ్రాట్

ట్రైన్ వేగంగా పరుగెడుతోంది. ఎదుటి సీటు మీద కిటికీ దగ్గరగా ఓ కాలు పైకి మడిచి, దర్జాగా కూర్చుని వేరు శనక్కాయలు వల్చుకు తింటున్న పల్లెటూరి ఆసామినే చూస్తున్నారు మిత్ర త్రయం ముకుందం, సుందరం, రాజేంద్ర.

పల్లెటూరి ఆసామి పక్కనే ఓ ముసలాయన కునికి పాట్లు పడుతూ, జోగుతున్నాడు. వాళ్ళిద్దరికీ మధ్య కాళ్ళ దగ్గర ఓ సంచిలో వేరు శనక్కాయలు, మరో

సంచిలో అరటిపళ్ళు ఉన్నాయి. అప్ప టికే కిటికీ ఆసామి సగానికి పైగా వేరు శనక్కాయలు ఫోంచేశాడు. వేరుశనగ తొక్కలతో అతని కాళ్ళ దగ్గర పెద్ద



రాశి తయారయింది.

మిత్రులు ముగ్గురికీ అతని తిండి చూస్తుంటే వళ్ళుమండి పోయింది. పిండి మరలో పోస్తున్నట్టు తొక్కలు వలిచి వేరుశనగ గింజలు నోట్లో వేసుకుని మేకలా నమిలేస్తున్నాడు. తమకి కొన్ని కాయలైనా ఆఫర్ చేయలేదని అతనిమీద కోపం వాళ్ళకి.

దాదాపు అతని సంచిలోని వేరుశన క్కాయలన్నీ అయిపోయాయి. ఇక అరటి పళ్ళ సంచి మీదకి దాడిచేస్తాడు కాబోలు ఆ బకాసురుడు అనుకున్నారు ముగ్గురు మిత్రులు.

అంతలో ఒక్క కుదుపుతో బండి ఒక స్టేషన్లో ఆగింది. మంచినీళ్ళు తాగేం దుకు కాబోలు శనక్కాయల ఆసామి చక్రపత్తి తలగుడ్డ సరిచేసుకుంటూ క్రిందికి దిగాడు.

ఆ పల్లెటూరి తిండి పోతుని ఎలా అయినా ఆట పట్టించాలని నిర్ణయించు కున్నారు ముగ్గురు యువకులు. నెమ్మదిగా అతని సంచిని దగ్గరకు లాక్కొని అరటి పళ్ళు బయటికి తీశారు. క్షణంలో రెండు డజన్ల అరటిపళ్ళు ముగ్గురూ కలిసి ఆర గించి 'బ్రేవ్'మని త్రేన్చారు. అరటి తొక్కలన్నీ కిటికీలోంచి గిరవాటు వేశారు.

ఆ ప్రక్కనే చాలా సేపటి నుంచి ఏకాగ్రంగా కునికిపాట్లు పడుతున్న ముసలాయన్ని తట్టి లేపారు.

"చూశారండీ తాతగారూ? మీ పక్కనే ఓ పల్లెటూరి బకాసురుడు కూర్చుని వున్నాడు. సంచీడు వేరుశనక్కాయలు తిని మంచినీళ్ళు తాగేందుకు కిందికెళ్ళాడు. వాణ్ణి ఏడిపిద్దామని ఈ సంచిలోని అరటి పళ్ళన్నీ తినేశాం. వాడొచ్చి అడి గితే అవి మీరు తిన్నారని మాత్రం చెప్పకండీ!" అన్నారు మిత్రత్రయం.

ముసలాయన నోరు తెరుచుకుని నిర్ఘాంతపోయి చూసి, క్షణంలో తేరుకుని "మీరు తినేసిన అరటిపళ్ళ గురించి అత నెందుకు అడుగుతాడయ్యా బాబూ! ఈ అరటిపళ్ళ సంచీ నాదే గదయ్యా! తొక్కలు కూడా మిగల్చకుండా తిన్నారూ!..." అని లబోదిబో మన్నాడు ముసలాయన.

—గొట్టాపు రాంబాబు

# చీటీచివాట్లు

సుందరం భార్య ఆ రోజే పుట్టింటి కెళ్ళింది పురిటికి. పాపం! సుందరం ఇంట్లో ఒంటరివాడై పోయాడు. పైగా ఆ

రోజు ఆదివారం. ఆఫీసుకి శెలవు.

కాసేపు ఇంట్లో అటు ఇటూ పచార్లు చేశాడు. మధ్యాహ్నమయ్యేసరికి టీ తాగాలనిపించింది. వంటింట్లోకి నడిచాడు.



అలమార్లో యాభై డబ్బాలు,సీసాలూ ఉన్నాయి. ఏది టీ డబ్బానో, ఏది పంచదార డబ్బానో తెలుసుకోవటం ఎలా?

మార్లో ఎదురుగా చిన్న చీటీ కని

"రెండో వరుసలో మూడోది 'టీ' డబ్బా, మూడో వరుసలో అయిదో డబ్బా పంచదార."

'థాంక్స్ డార్లింగ్!' అనుకున్నాడు సుందరం. టీ పెట్టుకుని తాగేడు. సాయంత్రం అయిదయింది.

విసుగ్గా ఉండి సుందరం మంచం మీద నడుం వాల్చాడు. తలగడ కింద చిన్న చీటీ దొరికింది.

"విసుగ్గా ఉంటే కాసేపు టేప్ రికార్డర్ పెట్టుకోరాదూ!"

సుందరానికి హుషారు పుట్టుకొచ్చింది. టేప్ పెట్టుకొని కాసేపు రికార్డులు విన్నాడు. భారంగా రాత్రయింది.

భోజనం చేసి, కొంతసేపు పత్రిక తిరగేసి మంచం మీద వాలిపోయేడు. లైటు వెలుగులో కాళ్ళవైపున మంచం మీద మరో చీటీ కనిపించింది.

"లైటార్పి పడుకోవాలని తెలీదూ!"

సుందరం నవ్వుకుంటూ లైటార్పి పడుకున్నాడు. ఎంత సేపటికీ నిద్ర పట్టలేదు. తోడులేక విరహంతో మనసూ, ఒళ్ళూ వేడెక్కి పోయాయి. చల్లారక పోతే లాభం లేదీబాధ.

లేచి బీరువా తెరిచాడు. తనకి ఇష్టమైన సూట్ ఎన్నిక చేసుకున్నాడు. డ్రెస్ చేసుకుని, అద్దంలో చూసుకుంటూ పాంటు జేబులో చెయ్యి పెట్టాడు.

చేతికి చిన్న చీటీ తగిలింది.

"నాకు తెలుసు మీ సంగతి - వెర్రి వేషాలెయ్యకుండా బట్టలు విప్పి హాయిగా పడుకోండి"

ఉసూరుమంటూ బట్టలు విప్పి మంచం మీద కూలబడ్డాడు సుందరం.

—బాలం వెంకట్రావు

**Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.**

…PURA Telugu Monthly, Hyderabad-500 004. Regd. No. H/HD/402

